

# మేధావి శునకం

★ 'భోగిల్' జాతికి చెందిన ఈ 'శునకశ్రీ' పేరు 'పోర్క్‌చాప్' డబ్బు, ముఖ్యంగా డాలర్‌నోట్ల విలువ బాగా తెలిసిన 'మేధావి కుక్క' ఇది. అమెరికన్ డాలర్స్ నోట్లు వివిధ విలువలు గలవీ (అమెరికన్ డాలర్‌నోట్లు ఒక డాలర్ అయినా, వంద డాలర్ల దయినా దాదాపు ఒకే సైజులో, రంగులో ఉంటాయి. అంకెల్లోనే తేడా) ఈ శునకశ్రీ ముందుంచి తే వాటిల్లోంచి అత్యధిక విలువ గల డాలర్‌నోటును మాత్రమే ఎంచుకుని తీయటం ఈ శునక శ్రీకి కూసువిద్య.

ఓ వేళ దీని ఓనర్‌గారు అధిక విలువగల డాలర్ నోట్లకు సెంటులాంటిదేమైనా రాసి, ఆవిధంగా శునకశ్రీగారా నోటును ప్రత్యేకించి గుర్తించేలా శిక్షణ ఇచ్చారేమోనని అనుమా నించిన వారు అప్పటికప్పుడు బ్యాంకునుంచి తెప్పించిన కొత్త నోట్లను అందించినా శునకశ్రీగా రు తఫీమని వాటిల్లోంచి ఎక్కువ విలువగల డాలర్ నోట్లునే తీయటంతో అందరూ అవాక్కయారు.



# సచిత్రవిచిత్రం

# చతుర కతలు

## పనిమనిషి

ఉదయం ఏడింటికి ఫోన్ మోగితే తీశాను. "హలో అమ్మగారేనా" అంది మా పనిమనిషి పరిమళ.

"ఔను తల్లీ. నువ్వేనా ఏమయింది. రావడం లేదా ఈరోజు పనికి?" అనడిగాను.



"ఔను అమ్మగారూ. మీరు స్కూల్‌కి వెళ్ళాలి. అయ్యగారు ఆఫీసుకి వెళ్ళాలి. అమ్మాయి స్కూల్‌కి వెళ్ళాలి. రావడం లేదని చెప్తే, నాకోసం ఎదురుచూడక మీ పనులు మీరు చేసుకుంటారని ప్రజాటెలిఫోన్ నుంచి ఫోన్ చేస్తున్నాను" అంది.

"నువ్వు వచ్చినా, రాకపోయినా మా పనులు మేము చేసుకోక నువ్వు చేసి పెడుతున్నావు గనుకనా, ఇపుడు అవన్నీ మమ్మల్నే చేసుకోమని చెప్పడానికి" అన్నాను.

"ఔనండీ... ఎంతైనా టీచర్ గదా, మీరు! మనిషిని చూడకుండానే మనసులోని మాటని ఇట్టే గ్రహించేస్తారు" అంది పరిమళ.

మా పరిమళ సెవెన్త్‌దాకా చదువుకుని టి.వి. సినిమాలు చూడడానికీ, సినిమా పత్రికలు చదవడానికీ టైమ్‌లేక చదువుకి స్వస్తిచెప్పింది. లక్ష్మీపార్వతి నుంచి లాలూ ప్రసాద్‌దాకా అన్ని సమకాలీన విషయాలు చెప్పగల లోకజ్ఞానం సంపాదించింది.

ఉద్యోగంలో సెటిలైన తనకు నచ్చిన యువకుడిని పెళ్ళి చేసుకుంది. మా ఫ్లాట్లలో మూడింటిలో ఏనాడో పనిమనిషిగా కుదిరింది. పొద్దున్నే ఏడింటికి వచ్చి అంట్లు తోమడం, ఇల్లు అలకడం, బట్టలు ఉతకడం మూడు ఫ్లాట్లలోనూ సిస్టమాటిక్‌గానూ, స్పీడ్‌గానూ చేస్తూ మంచి పేరు





సంపాదించింది. కాఫీ టిఫిన్‌లతో మూడు ఫ్లాట్లలోనూ నెలకి ఏడువందల యాభయి సంపాదిస్తోంది.

ఈ ఇన్‌ఫ్లేషన్ రోజుల్లో ఇదేమూలకి అని మా ఫ్లాట్లకి దగ్గరలోనే వుండే ఒక ఆఫీసులో కూడా ఆఫీసు పదిగంటలలోపునే శుభ్రంచేసి, అన్నీ అమర్చే పనిలో పార్ట్‌టైం జాబ్ సంపాదించింది. నెలకి మూడువందల రూపాయిలిస్తున్నారు వాళ్ళు.

తొమ్మిదిలోపున మా ఫ్లాట్లలో పనిపూర్తి చేసి ఆ ఆఫీసుకి చేరుకుని అరగంటలో అక్కడ పనీ పూర్తిచేసి ఇంటికి వెళ్ళేది.

భర్తకి అతని ఆఫీసులో సబ్సిడీ కాంటీన్‌లో మీల్స్ సదుపాయం వుండడంతో మా ఇళ్ళ దగ్గరనుంచి తీసుకువెళ్ళినవి 'మిడ్‌డే మీల్'గా పనికొస్తోందామెకు.

దీపావళికి చీరలు, స్వీట్లు, డబ్బు అన్నీ పరిమళకి తప్పనిసరి లాంఛనాలు.

అయితే తన అవసరం మాకు వుందని ఎప్పుడూ బెట్టు చేయక మాకు ఎంతో గౌరవం ఇచ్చేది. అందుకే ఏ కారణం చేతయినా పనికిరాకపోతే ఒకరి ఇంటికి ఫోన్ చేసి మిగిలిన ఇళ్ళలో చెప్పమనేది.

ఈరోజు అలాగే, అందుకే పరిమళ ఫోన్ చేసింది. "ఏమయింది. ఎందుకు రావడం లేదు, ఆరోగ్యం బాగోలేదా?" అని అడిగాను.

"మా పనిమనిషి రావడంలేదని కబురు పెట్టింది అమ్మగారూ. రాత్రి అంట్లన్నీ నేనే తోముకోవాలి. బట్టలు ఉతుక్కోవాలి. ఇల్లు తుడుచుకోవాలి. ఉంటానమ్మగారూ మూడు నిమిషాలు అయిపోతోంది" అంటూ ఫోన్ పెట్టేసింది మా పరిమళ,'ది' పనిమనిషి!

–బొడపాటి కృష్ణవేణి

# గ్రీటింగ్స్

సుబ్బారావుకి కొత్త సంవత్సరం వస్తోందంటే ఎంతో ఆనందం. కొత్తదనం రెక్కలు విప్పుకుని, ఉరుకులు పరుగులతో వస్తూవుంటే సుబ్బారావు ఎప్పుడూ స్వాగతం చెప్తాడు. వెళ్ళిపోతున్న సంవత్సరంకన్నా రానున్న సంవత్సరమే ఎన్నో శుభాలు, లాభాలు తీసుకురావాలని కోరుకుంటాడు. అందుకే స్నేహితులకి, బంధువులకి ప్రతి సంవత్సరమూ తప్పకుండా న్యూఇయర్ గ్రీటింగ్స్ పంపుతూ వుంటాడు. నచ్చే రంగూ, మెచ్చే సందేశం వున్న గ్రీటింగ్ కార్డులు కొని అందరికీ సరిగ్గా సమయానికి అందేలాగా పోస్ట్‌చేస్తాడు. ఆ పనిలో తనే 'థ్రిల్' పొందుతాడు. తను ఎవరెవరికి పంపాలో వాళ్ళ చిరునామాలు ప్రతి సంవత్సరమూ 'అప్ టు డేట్' చేసుకుంటూ వుంటాడు.

అయిదారు సంవత్సరాలుగా అలా ప్రతి సంవత్సరము న్యూఇయర్ గ్రీటింగ్స్ పంపుతున్న సుబ్బారావుకి ఆలస్యంగా ఒక నిజం తెలిసింది. ఇంతమందికి తను న్యూఇయర్ గ్రీటింగ్స్ ప్రతి సంవత్సరమూ పంపుతున్నా కనీసం ఒకరైనా తనకి ఒకసారైనా న్యూఇయర్ గ్రీటింగ్ పంపారా అని ఆలోచించాడు. ఎవరూ పంపలేదని అర్థమయింది. ఎంతమంది తను పంపుతున్న న్యూఇయర్ గ్రీటింగ్ లిస్ట్‌లో వున్నారో చూసుకున్నాడు. బంధువులు, స్నేహితులు కలిపి మొత్తం ఇరవయిఏడుమంది వున్నారు. వీళ్ళలో కనీసం ఒక్కరైనా కర్టెసీ కోసమైనా ఎక్నాలెడ్జ్ చేయలేదుగదా అని సుబ్బారావు చింతించాడు.

ఇంతలో డిసెంబర్ నెల వచ్చేసింది. ప్రతి సంవత్సరమూ వెళ్ళే "A టు Z గ్రీటింగ్ షాప్"కి బయలుదేరుతూ ఒక నిముషం ఆలోచించి సుబ్బారావు ఆగిపోయాడు. ఈ సంవత్సరమే కాదు, ఇకమీదట ఏ సంవత్సరమూ ఎవరికీ గ్రీటింగ్స్ పంపకూడదని తీర్మానించుకున్నాడు. ఆ తీర్మానం ఆచరణలో పెట్టాడు.



కొత్త సంవత్సరం వచ్చేసింది. పదిరోజులు గడిచిపోయాయి. సుబ్బారావుకి ఒకదాని తర్వాత ఒకటి ఇరవయి ఏడు లెటర్లు వచ్చాయి. ఆ ఉత్తరాలన్నిటిలోనూ "మినిమమ్ కామన్ మేటర్' ఒకటే!

"డియర్ సుబ్బారావు, ప్రతి సంవత్సరమూ నీ దగ్గరనుంచి నాకు తప్పకుండా న్యూఇయర్ గ్రీటింగ్ వచ్చేది. నీ గ్రీటింగ్‌తోనే నాకు కొత్త సంవత్సరం ప్రారంభమయ్యేది. ఈ సంవత్సరం నీ గ్రీటింగ్ రాలేదు. నాకు ఎంతో నిరాశ కలిగింది. నీ ఆరోగ్యం బాగానే ఉందని ఆశిస్తూ, ఎప్పటికీ బాగుండాలని కోరుకుంటున్నాను''

**-తాజీప్రసాద్**

---

# పాప్యులారిటీ...!

"నీఆలోచన చాలా అత్యాశా... అతిశయం కాదు గానీ పాపులర్ కావాలంటే ముందు నీ రచనలు పత్రికలకు పంపు, అవి అచ్చయితే గుర్తింపు అదే వస్తుంది. ఆటోమేటిగ్గా పాపులర్ అయిపోతావు" అన్నాడు హరనాథరావు శ్రీనాధరావుతో.

"నా రచనలు మేగజైన్స్‌కు పంపి, వారు ప్రచురించేవరకు ఎదురుచూసే ఓపిక నాకు లేదు. అలా ఎన్నో పంపినా లాభంలేకుండా ఉంది. ఆ తలనొప్పి లేకుండా నా స్వంత డబ్బు ఖర్చుపెట్టి నేను రాసిన పుస్తకాలు అచ్చేసుకున్నాను. పంచినవి ఫ్రీగా పంచిపెట్టగా మిగిలినవి మార్కెట్‌కు పంపించాను కూడా. కాకపోతే ఆ పుస్తకాలను కొనిపించి, చదివించి నన్నూ నా రచనల్నీ పాపులర్ చేసే మనిషి కోసం వెతుకుతున్నాను"

"అది ఎలా సాధ్యం అనుకుంటున్నావు? ఆ మనిషి మైకు పట్టుకుని డబ్బా కొట్టుకుంటూ ఊళ్ళవెంట తిరగాలా? "

"ఇంచుమించు అలాంటిదే! ఒక మనిషికి నెలజీతం ఇచ్చి, నా గురించీ నా రచనలగురించీ వివరించి, నా పుస్తకాలు చదివేలా చేసి, నన్ను పాప్యులర్ చేయాలి. అన్నట్టు నువ్వు పార్ట్‌టైం జాబ్‌కోసం చూస్తున్నావు కదా! మంచి జీతమే ఇస్తాను గానీ, ఈ పని చేసి పెట్టరాదూ!"

"ఎలక్షన్లలో గడపగడపకూ వెళ్ళి ఓట్లడగటంకంటే కష్టమైన పనే ఇది! సరే ఆలోచి





స్తానే"



"ఆరునెలలనించి నీకు జీతం ఇస్తున్నాను. పాపులర్ అయ్యానంటావా? "

"లక్షణంగా పాపులర్ అయ్యావు"



"మరి నా పుస్తకాలు ధుకాణాల్లో దుమ్ము పట్టి పోతున్నాయి. ఒక్కటంటే ఒక్కటీ అమ్ముడుపోలేదు"

"నా శాయశక్తులా కృషిచేశాను. నీ గురించి కనీసం వందన్నర సాహితీ సభల్లో పొగిడాను. మిగతా విషయాలు నాకు తెలియవు" గంభీరంగా అన్నాడు హరనాథ రావు.



ఆ తర్వాత ఓరోజు పేపర్లో, "ప్రముఖ విమర్శకులు హరనాథరావుకు లలిత కళాపరిషత్‌లో ఘనసన్మానం అనే వార్త వచ్చింది.

ప్రముఖులు హరనాథరావును అభినందిస్తూ, "ఏ పుస్తకం చదవాలో ఏ పుస్తకం చదవకూడదో నిర్ధారించుకోలేక పాఠకులు డబ్బు, సమయం వృధా చేసుకుంటున్న ఈ రోజుల్లో రెండు ముక్కల్లో చదవకూడని పుస్తకాల గురించి వివరించే సెమినార్స్ నిర్వహించి మనల్ని ఆపదనించి గట్టెక్కించి 'పాప్యులర్ క్రిటిక్'గా ప్రసిద్ధులైన హరనాథ రావుగారికి ఎంత పెద్ద సన్మానం చేసినా ఇంకా ఋణపడివుంటామన్న విషయం మనమందరం గుర్తుంచుకోవాలి..."

పూర్తిగా చదవకుండానే కళ్ళు బైర్లు కమ్మాయి శ్రీనాథరావుకు!

-ఎ. జయలక్ష్మిరాజు

# డిసిప్లిన్

వర్క్ ఎక్కువగా ఉండటంతో ఆఫీసునుండి బయటపడి, మెస్‌లో భోంచేసి ఇంటికెళ్లటానికి రాత్రి తొమ్మిదికిగాని తెమల్లేదు. తీరా వెళ్లేప్పటికి ఒక చెడువార్త!

హౌస్ ఓనర్ భాస్కర్రావు గారమ్మాయి ముద్దులు మూటగట్టే పాప స్కూలునుంచి తిరిగిరాలేదట.

కాంపౌండ్‌లో జనం మందగా పోగుపడి ఉన్నారు. అన్ని చోట్లా వెతకటం, పోలీస్

కంప్లయింట్ ఇవ్వటం కూడా జరిగిపోయిం దట.

పాపం, భాస్కర్రావుగారింట్లో ఎవ్వరూ పచ్చిమంచినీళ్ల కూడా ముట్టలేదు. ఆయ నేమో పాపని వెతుక్కుంటూ ఎటో వెళ్లాడు, సాయంత్రమనగా! వారికీ నాకు మధ్యవున్న ఇరుగుపొరుగు సంబంధాన్నిబట్టి ఆ కాంపౌండ్‌లో మిగతా అందరికంటే నాకు కాస్త ఎక్కువే బాధ్యత వుంది.

అందుకుని స్నానాదులు వదిలి నేను కూడా బయల్దేరాను పాపకోసం.

అప్పుడే వర్షపు జల్లు మళ్లీ మొదలైంది. అంతకుముందోసారి జోరుగా పడింది

ఆ పరిసర ప్రాంతాల్లో గల్లీ గల్లీ తిరి గాను. తర్వాత స్కూల్ చుట్టుపక్కల వీధుల్లో ఎంతదూరం నడిచానో! అలా నడు స్తున్నంతలో ఓ మలుపు తిరిగి ఆ వంక చూసి హఠాత్తుగా ఆగిపోయాను. నేను పడ్డ శ్రమ ఫలించింది.

అక్కడ బస్ షెల్టర్ కింద తడిసిముద్దై చలికి వణికిపోతూ... చతికిలపడి ఉన్న పాప! ఆమె పక్కనే పుస్తకాల సంచీ.

వీధి దీపం వెలుతుర్లో నేను స్పష్టంగానే అగుపిస్తున్నా. గానీ, పాప పరిశీలనగా చూస్తేకానీ కనిపించటంలా! దగ్గరగా వెళ్ల గానే పాప నన్ను చూసి ఏడుపులంకించు




కూడా. విపరీతమైన చలి.. వణుకు.. కానీ వాటన్నిటికంటే పాప కన్పించకపోవటమే ఎక్కువ బాధన్పిస్తోంది.

ఆ పాపకి సొంతం పదేళ్లుండవు. లోకం తెలియని పిల్ల. ఎక్కడికెళ్లినట్టు? ఎందు కలా చెప్పకుండా వెళ్లినట్లు? ఈ మాయా మహా నగరంలో ఎన్నో కిడ్నాప్‌లు... పిల్లల్ని ఎత్తుకుపోవడాలు... బ్లాక్‌మెయి లింగ్ రకరకాలు. అలాంటిదేదైనా ఉందా ఇందులో? అసలు ఆ ఆలోచన మింగుడు పడలేదు.

నడక వేగం పెంచాను.

కుని పరుగిడుకుంటూ వచ్చి నన్ను కౌగిలిం చుకుంది.

ఆమెని భుజానికెత్తుకుని కన్నీళ్ల తుడిచి "ఇంటికి రాకుండా ఎందుకమ్మా ఇక్కడు న్నావు" అన్నాను.

"అంకుల్! మరే నేను సాయంత్రం స్కూలు నుంచి వస్తూ వర్షంలో బురదలో జారిపడ్డాను. బ్యాగ్‌కూ, అందులోని బుక్స్‌కూ, యూనిఫామ్‌కీ బురద, మట్టి అంటింది. అట్టలు చెదిరితే టీచర్ కొడతా నంది. కొత్త యూనిఫామ్ ఏమాత్రం పాడ యినా అమ్మ కొడతానంది ఎలా? " అంది వెక్కిళ్ల పెడుతూ.

–పావులూరి శివాజీ

# ఫుల్ అటెండెన్స్

మా పంచవటి కాలనీలోని పాతికమంది ఆడ వాళ్ళం కలిసి మాకో వెల్ఫేర్ అసోసియేషన్ స్థాపించి సరిగ్గా అయిదేళ్ళు అయింది.

ఈ అయిదేళ్ళలో మా గురించి మేము చెప్పకూడదు కాని... ఎన్నెన్నో మంచి పనులు చేశాం.

ఎక్కడపడితే అక్కడ చెత్త వేయకుండా చేశాం. శుభ్రత, పరిశుభ్రత మెయింటైన్ చేయడంతోపాటు కాలనీలోని ఆడవాళ్ళ మంతా ఒకరికి తెలిసినవి ఇంకొకరుగా కుట్లు. అల్లికలు నేర్పుకోవడం... జరిగిపో యింది. చివరికి పోషక విలువలున్న ఆహార పదార్థాలేమిటో, వాటినెలా వండుకో వాలో కూడా క్లాసులు, పాఠాలు... నిర్వ హించాం!



ఇలా అయిదేళ్ళపాటు సమర్థవంతంగా సక్సెస్‌ఫుల్‌గా మా మీటింగ్స్ నిర్వ హించాం. అంటే సగటున రెండొందలు పైగా సమావేశాలు జరిగివుంటాయి.

అందాకా వచ్చాక, కాలనీ మీటింగ్ కాలనీ లోనే జరుపుకోవడం రొటీన్‌గా, బోరుగా వుందనిపించి నగర శివార్లలోని తోటలకో, సిటీ క్లబ్బులకో వెళ్ళి కూడా జరుపుకుం టున్నాం.

మా మీటింగ్స్‌లో హాజరు కావడాన్ని చాలామంది కాకున్నా కొంతమంది చాలా సార్లు ఎగ్గొట్టారు కాని వెంకాయమ్మగారు ఒక్కసారి కూడా రావడం మానలేదు. చివ రికి జ్వరం వచ్చినా, దూరమయినా, భారమ యినా సరే అవేవీ లెక్కచేయలేదు వెంకా యమ్మగారు. మీటింగ్‌లో అందరికన్నా ముందు వచ్చి ఆసాంతం ఆసక్తిగా, శ్రద్ధగా పాల్గొనేవారు.

ఆవిడకి మా పంచవటి కాలనీ మహిళా మండలి పట్లవున్న అభిమానానికి లోలోపలే పొంగిపోయాను. రెండొందల సమావేశాలు పూర్తయిన సందర్భంగా సన్మానం చేయిం చాలనుకున్నాను.

ఒకసారి నా అభిమానాన్ని అణచుకోలేక అడిగేశాను "ఎందుకండీ పిన్నిగారు మీకింత అభిమానం? మన మహిళా మండలిలో ఇన్నాళ్ళుగా ఫుల్ అటెండన్స్ వున్నది మీకొ క్కరికే! ఒక్కసారి కూడా మీకు మానాల న్పించలేదా? "

వెంకాయమ్మగారు ఒక్కసారి భారంగా నిట్టూర్చారు.

అటూ ఇటూ చూసి నా దగ్గరకు వచ్చి చెవిలో రహస్యంగా చెప్పింది. "ఏం మానడం అమ్మా? నేనొక్కసారి మీటింగ్‌కి రాకపోయినా, నా విషయాలన్నీ మాట్లాడు కోరూ ఈ టక్కులాడులు? "

–'పుష్యమి'

# చతుర

సంపుటి : 21 సంచిక : 1 ఫిబ్రవరి 1998

భార్య సంతానవతి కాలేకపోతోందనో, జబ్బుచేస్తే సెక్స్‌కి పనికిరాదనో కారణాలు చూపి డాక్టర్ సర్టిఫికేట్లతో విడాకులు పొందుతున్న పురుషులు ఈ దేశంలో కోకొల్లలు.

మరి స్త్రీ...? భర్తకి తనని తల్లిని చెయ్యగల శక్తి లేదని తెలిస్తే...? ఏం చేస్తుంది?

సంతానహీనులకి వరప్రసాదంలాంటి అత్యాధునిక పద్ధతుల్ని విజ్ఞానశాస్త్రం పురోగమింపచేస్తున్నా కూడా నేటికీ ఎంతోమంది భార్యాభర్తల మధ్య కేవలం 'సంతానలేమి' కారణంగా స్పర్ధలు, విడాకులు ఏర్పడుతున్న కారణాలేమిటి?

ఎంతోమందికి తన వైద్యవిజ్ఞాన నైపుణ్యంతో బిడ్డలనందించిన ఆ లేడీ డాక్టరు... తాను గర్భవతి కాలేని పరిస్థితిలో ఏం చేసింది?

మాతృత్వ వాంఛతో అప్పుడప్పుడు స్త్రీ తీసుకునే తొందరపాటు నిర్ణయానికి ఫలితం ఎలా వుంటుంది? వినూత్న వైద్యవిజ్ఞాన విశేషాలను కథానేపథ్యంలో ఆసక్తికరంగా కళ్లకు కట్టించిన

**తిరునగరి విజయకిషోర్** రచన **'మాతృత్వం'**

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



మ్యూజికల్ అలారం ఆగకుండా మోగుతుండడంతో చప్పున మెలుకువ వచ్చింది నాగమణికి.

ఆకాశం అప్పుడే ప్రసవించినట్లుగా తూర్పున సూర్యుడు ఎర్రటి పసిగుడ్డులా కనబడుతున్నాడు, కిటికీలోంచి.

అలారం ఆపుచేద్దామని ప్రయత్నించబోతే తన చేతితో సహా నడుమును చుట్టేసి ఉంది మరోచెయ్యి. ఆ చేతిని తప్పించుకుని అలారం ఆపుచేసింది. మరో వైపుకు తిరిగి పడుకుంటే ముఖానికి దగ్గరగా కనిపించింది అతడి ముఖం.

అంత శబ్దానికి కూడా సుధాకర్‌కి నిద్ర మత్తు వదిలినట్టు లేదు. మగతగా కళ్లు మూసుకుని పసిపిల్లాడిలా నిద్రపోతున్నాడు.

ఆమె అతడిని గట్టిగా కుదుపుతూ "ఏమండోయ్! ఈ రోజు అత్తయ్యగారు విజయవాడ నుంచి వస్తున్నారు. మీరు స్టేషన్‌కెళ్లాలి. లేవండి" అంది గొంతు కాస్త పెంచి

సుధాకర్ చిన్నగా మూలిగాడు, "హూఁ! కాసేపు పడుకోనివ్వు మణీ!" అన్నాడు.

"ఇక్కడ ఇలాగే పడుకుంటే అక్కడ ట్రెయిన్ దిగి అత్తయ్యగారు స్టేషన్‌లో దిక్కులు చూస్తూ ఉండిపోతారు. ఆ తర్వాత ఏదో ఆటో పట్టుకుని ఇంటికి చేరుకోగానే మిమ్మల్ని కాదు, 'అత్తగారు వస్తున్నారంటే మొగుడ్ని కనీసం స్టేషన్‌కి పంపడం కూడా తెలియదా తల్లీ' అంటూ నా మీద ఎగురుతారు. ముందు లేవండీ" చెయ్యిపట్టుకు లాగింది.

"అమ్మో" అదిరిపడి లేచి కూర్చున్నాడు సుధాకర్.

"ఇప్పుడు మీరు మా మంచి శ్రీవారు" ఆమె అతడి బుగ్గమీద మరోసారి ముద్దు పెట్టుకుని ఆ గదిలో నుండి వెళ్లిపోయింది.

బాత్‌రూంలోకెళ్లి గీజర్ ఆన్‌చేశాక తిన్నగా వంట గదిలోకెళ్లింది. సింక్‌లో రాత్రి పడేసిన వంట పాత్రలు తోముతుంటే సుధాకర్ బ్రష్ చేసుకుంటూ వచ్చాడు.

"నువ్వూ స్టేషన్‌కి రాకూడదా మణీ! అమ్మను రిసీవ్ చేసుకున్నట్టుంటుంది"

"వద్దులెండి! అత్తయ్యగారు వచ్చేసరికి ఇల్లంతా శుభ్రం చేసి సాదరంగా ఇంట్లోకి ఆహ్వానించడమే బాగుంటుంది"

"నీ ఇష్టం" అతడు వెనుదిరిగి బాత్‌రూమ్ వైపు నడిచాడు.

ఆమె ఇల్లు చిమ్ముతుండగా అతడు స్నానం పూర్తిచేసుకుని వచ్చాడు.

"మణీ! బట్టలు తీసివ్వు!"

ఆమె బీరువా దగ్గరకెళ్లి ఓ జత బట్టలు తీసి మంచం మీద ఉంచింది.

మరో అయిదు నిముషాలలో అతడు తయారయి "మణీ! స్కూటర్ కీస్ ఎక్కడ? " అన్నాడు.

నాగమణి వంటింట్లోంచి కాఫీ కప్పుతో వచ్చింది. కప్పు అతడి చేతికిస్తూ చెప్పింది, "స్కూటరెందుకండీ? అత్తయ్యగారి వెంట ఎలాగూ లగేజీ ఉంటుంది. ఆమెను స్కూటర్‌లో తీసుకురాలేరు. ఆటోలో రావడం తప్పదు కాబట్టి మీరూ వెళ్లేప్పుడు ఆటోలో వెళ్లి వచ్చేప్పుడు ఆటోలో వచ్చేస్తే సరిపోతుంది"

"ఇప్పుడు సెంటర్ వరకూ నడిచి వెళ్లే ఓపికలేదు. అమ్మను ఆటో ఎక్కించి ఆటో వాడితో నా స్కూటర్‌ని ఫాలోకమ్మని చెబుతాలే"

"సరే మీ ఇష్టం" నాగమణి లోపలికి వెళ్లి టేబిల్‌పైన ఉన్న స్కూటర్ తాళాలు, కళ్లజోడు తీసుకుని వచ్చి అతడికందించింది.

సుధాకర్ స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్లిపోయాడు.

అతడు వెళ్లాక ఆమె కొద్దిక్షణాలు అలాగే




వాకిలికి ఆనుకుని ఉండిపోయింది. అత్తయ్యగారు వస్తున్నారంటే ఆనందంగానూ ఉంది. కాసింత భయంగానూ ఉంది.

భయమంటే ఆమె గయ్యాళికాదు. అత్తగారిననే అహంతో కోడలిమీద పెత్తనం చెలాయించడం లాంటివి కూడా చేయదు. అసలు ఏ విషయంలోనూ తననేవిధంగానూ బాధపెట్టదు. తను బాధపడుతూ, తనను బాధపెట్టేది ఒకే ఒక్క విషయంలో.

అది-

తనకు ఓ మనుమడో, మనుమరాలో అర్జంటుగా కావాలని.

అలాంటి కోరిక కొడుకున్న ప్రతి తల్లికీ ఉండేదే. ఆమె కోరికలో అసహజం ఏమీ లేదు. అందులో కొంత న్యాయమూ ఉంది.

అందుకే ఆమె తనను బాధపెట్టేలా మాట్లాడినా తనేం కోప్పడదు. ఆ తల్లి హృదయాన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తుంది.

అత్తగారి గురించిన ఆలోచనలు కట్టిపెట్టి నాగమణి ఇంట్లోకి వెళ్లింది.

త్వరగా టిఫిన్ చెయ్యాలి. వీలయితే కాసింత అన్నం కూడా వండేస్తుకుంటే బాక్స్ తీసుకెళ్లి పోవచ్చు మధ్యాహ్నం కూడా టిఫిన్‌తోనే సరిపెట్టుకుంటే సాయంత్రానికి చాలా నీరసంగా ఉంటుంది.

టైం చూసుకుని వంటపనిలో మునిగిపోయిందామె.

ఉప్మా చేసి బాణలికింద పెడుతుండగా బయట వాహనాలు వచ్చి ఆగిన శబ్దం వినిపించింది. కుక్కర్ స్టౌమీద పడేసి వంటగదిలోనుండి బయటకు నడిచిందామె. వరండాలోకెళ్లి చూస్తే సుధాకర్ స్కూటర్‌ని కాంపౌండ్‌లోపల పెడుతున్నాడు. యశోదమ్మ ఆటో దిగుతూ ఉంది.

ఆమె నవ్వుతూ ఆటో దగ్గరకెళ్లింది. అత్తగారి చేతిలోని సూట్‌కేస్ అందుకుంటూ "ప్రయాణం బాగా సాగిందా అత్తయ్యా?" అనడిగింది.

"బాగానే సాగిందమ్మా" అని కోడలివైపు తేరిపార చూసి అంది "ఏంటే! ఈ మూడు నెలల్లోనే మరీ అంత చిక్కిపోయావ్"

"నేనేం చిక్కిపోలేదు. చాలా రోజుల తర్వాత చూడ్డంతో మీకంటికి అలా కనిపిస్తున్నానంతే"

ఆమె సూట్‌కేస్ పట్టుకుని ఇంట్లోకి నడుస్తుంటే యశోదమ్మ అనుసరించింది.

ఇంట్లోకి వెళ్లాక హాలులోని సోఫాలో కూలబడిందామె.

"అబ్బా! ఏం ప్రయాణమో ఏమోరా! కూర్చోలేక విసుగొచ్చేసిందనుకో!"

సుధాకర్ ఆమె పక్కనే కూర్చున్నాడు. "రాజశ్రీ, బావగారు బాగున్నారా?"

"పిల్లలతో సహా అంతా బాగానే ఉన్నారు"

"విశేషాలేమిటి?"

"మామూలే! మిమ్మల్నిద్దర్నీ అడిగినట్టు చెప్పమన్నారు"

"రాజీని తీసుకు రాకూడదూ?"

"తనకు తీరికెక్కడిదిరా? ఉదయం లేచింది మొదలు ఆ పిల్లల్ని రెడీచేసి కాన్వెంట్‌కి పంపించనూ, ఆయనకు అన్నీ సిద్ధంచేసి ఆఫీసు టైంకి అందించనూ, తను లేకపోతే ఆ ఇంట్లో ఒక్కపూట జరగదు"

"సరేనమ్మా! నువ్వు స్నానంచేసి, రెస్ట్ తీసుకో. తీరిగ్గా సాయంత్రం మాట్లాడుకుందాం"

"అలాగే" యశోదమ్మ బాత్‌రూమ్‌వైపు వెళ్లింది.

ఆమె స్నానంగట్రా ముగించుకునివచ్చేసరికి, నాగమణి టిఫిన్ ప్లేట్ అందించింది.

"నువ్వూ తినెయ్యకూడదూ"

"ఇంకా స్నానం కాలేదు. స్నానమయ్యాక



తింటాను"

నాగమణి గోడ గడియారం కేసి చూసింది. తొమ్మిదయిపోయిందప్పుడే. ఆమె హడావుడిగా బట్టలు తీసుకుని బాత్‌రూం వైపు వెళ్లింది. స్నానంచేసి రెడీ అయ్యేసరికి తొమ్మిదిన్నర.

అప్పటికే టిఫిన్ తినేసి రెడీగా ఉన్న సుధాకర్ "మణీ! త్వరగా రావాలి. ఇప్పటికే లేటయిపోయింది" అన్నాడు. అతడి కంగారులో కొంత కారణముంది. అతడు తనను గాంధీనగర్‌లో దించేసి సుల్తాన్ బజార్‌కెళ్లాలి. అతడు పనిచేసే బ్యాంక్ అక్కడుంది. ఇద్దరూ బ్యాంక్ ఉద్యోగస్తులే అయినప్పటికీ తాము పనిచేస్తున్న బ్యాంకులు మాత్రం వేరువేరు.

ఆమెకు ఆ హడావుడిలో టిఫిన్ తినాలనిపించలేదు. ఏదో ఎంగిలిపడ్డాననిపించి ముగించింది. రెండు బాక్సుల్లోకాస్త అన్నం సర్దాక "వెళ్లొస్తానత్తయ్యా" యశోదమ్మతో చెప్పింది.

యశోదమ్మ తలూపింది. ఆమె ఇంట్లోంచి బయటకు నడిచింది.

సుధాకర్ అప్పటికే స్కూటర్ స్టార్ట్ చేసి రెడీగా ఉన్నాడు. ఆమె ఎక్కి కూర్చుంటుంటే "నువ్వు ప్రతిరోజూ ఆలస్యం చేస్తావ్. నీవల్ల నేను రోజూ బ్యాంక్‌కి ఆలస్యంగానే వెళ్తున్నా" కాస్త చిరాకుగా అన్నాడు.

ఆమె అతడి మాటలు సీరియస్‌గా తీసుకోకుండా "ఏదో ఈ రోజుకు క్షమించేయండి సార్. తమ పనుల్లో నాకు కాస్త ఆలస్యమయింది. సారీసార్" అంటూ బుంగమూతి పెట్టింది.

"సరేసరే! మాటలతో మరింత ఆలస్యం చేయకు. సరిగ్గా కూర్చో" అన్నాడతడు.

ఆమె సీటులో సర్దుకుని కూర్చుంది.

బస్టాప్ చేరుకున్నాక అక్కడ క్రిక్కిరిసిన జనాన్ని చూస్తే ఆమెకు భయమేసింది. అక్కడున్న ఆ జనానికి పది బస్సులొచ్చినా చాలవు.

సుధాకర్ స్కూటర్‌ని ముందుకు పోనిచ్చాడు.

అయిదు నిమిషాల తర్వాత ఆమెను గాంధీనగర్‌లోని బ్యాంక్ ముందు దించి చెప్పాడు "సాయంత్రం ఆటోలోనయినా సరే త్వరగా ఇంటికెళ్లిపో. బస్సుకోసం వెయిట్ చెయ్యకు"

ఆమె తలాడించాక, అతడు స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్లిపోయాడు.

నాగమణి బ్యాంక్‌లోకెళ్లి తన సీటులో కూర్చుని టైం చూసుకుంది. పదయింది.

మరో ఏడు గంటలు. కేష్ రిసీవింగ్, ఎంట్రీలు, టోటలింగ్, బేలన్స్ చెకింగ్, కస్టమర్స్‌తో డీల్ చెయ్యడం, బ్రాంచ్ మేనేజర్ సందేహాలు తీర్చడం... గత రెండేళ్లుగా అలవాటుపడి పోయిన రొటీన్ జీవితం.

ఆమె చిన్నగా నిట్టూర్చి, రిజిస్టర్ అందుకుంది.



బ్యాంక్‌లో నుండి బయటపడేసరికి ఐదుంబావు అయింది.

నాగమణికిక బస్సెక్కే ధైర్యం లేకపోయింది. బస్టాప్‌లోనే ఆగివున్న ఆటో దగ్గర కెళ్లి చెప్పింది "బ్యాంక్‌కాలని".

ఆటో ఆగాక మీటర్ చూసి డ్రైవర్‌కి డబ్బులిచ్చేసి లోపలికి నడిచింది.

ఆమె హాల్లోకి వెళ్లేసరికి వంటగదిలో నుండి యశోదమ్మ ఎదురొచ్చింది.

"వంటగదిలో ఏం చేస్తున్నారత్తయ్యా? "

"మీరు వచ్చేసరికి కాసిన్ని కాఫీ నీళ్లన్నా కాచి అందిద్దామని"

"నేను వచ్చి చేసుకుంటానుకదా? మీకెందుకు శ్రమ? "

"ఇందులో శ్రమేముంది. ఇంట్లో ఊరికే కూర్చుని ఉన్నా ఏం తోస్తుంది? బెజవాడలోనయినా అంతే. ఏదో పని చేస్తూ ఉంటాను. రాజశ్రీ కూడా నీలాగే నీకెందుకమ్మా శ్రమా అంటూ కసురుకుంటూ ఉంటుంది"

ఆమె వంటగదిలోకి వెళ్లిపోయింది. నాగమణి హాల్లోని కుర్చీలో కూర్చుని రిలాక్స్‌గా వెనక్కు వాలింది.

అత్తగారిలో తనకు నచ్చే అంశం అదే. అత్తగారని పెత్తనం చలాయించే మనస్తత్వం కాదామెది. కోడలి శ్రమను అర్థం చేసుకుని పనుల్లో తనకు చాతనైనంత సహాయం చేస్తూనే ఉంటుంది. అయితే అయితే ఆ ఒక్క విషయంలో మాత్రం...!

అత్తగారి నోటినుండి ఆ ప్రస్తావన ఎప్పుడొస్తుందోనని - కాస్త భయంగా ఎదురు చూడడం తప్ప ప్రస్తుతం తను చేయగలిగిందేమీలేదు.

"ఇదిగో కాఫీ"

నాగమణి ఉలిక్కిపడి తలతిప్పి చూసింది. యశోదమ్మ కాఫీ గ్లాసుతో పక్కనే నిలబడి ఉంది. ఆమె చప్పున లేచి నిలబడి కాఫీ గ్లాసు అందుకుంది.

"వాడింకా రాలేదేంటి? " గ్లాసందించాక, వీధిలోకి చూస్తూ అంది యశోదమ్మ.

"ఆయన రావడం ఒక్కోసారి ఆలస్యమవుతూ ఉంటుంది. మీరు కాఫీని ఫ్లాస్క్‌లో పోసేయండి"

"ఆఫీసు వదిలాక తిన్నగా ఇంటికి రాకుండా ఏం చేస్తుంటాడు వీడు? "

"ఫ్రెండ్స్‌తోనో, కొలీగ్స్‌తోనో కలిసి ఏ కేఫ్‌లోనో కూర్చుని ఓ గంటా, అర్ధగంటా కబుర్లు చెప్పుకుంటారనుకుంటా" అంది నాగమణి నవ్వుతూ.

"ఓహో! ఈమధ్య ఈ అలవాటూ వచ్చిందా? " ఆమె తలాడించింది. "ఇంటికి రానీ చెపుతా" అంటూ వంటగదిలోకెళ్లిపోయిందామె.

నాగమణి కుర్చీలో కూర్చుంది. 'శ్రీవారికి ఈ రోజు తల్లిగారి చేతిలో చీవాట్లు తప్పవు' అనుకుందామె. తల్లిని చూస్తే సుధాకర్‌కి ఈ నాటికీ కాసింత భయం ఉంది. బహుశా అది భయం కూడా కాకపోవచ్చు తల్లిమీద ఉండే గౌరవాభిమానాలే ఆయన్ని మారు మాటాడకుండా చేస్తుంటాయి.

సాయంత్రం ఆరవుతుండగా వచ్చాడు సుధాకర్.

హాల్లోనే అతడిని నిలేసింది యశోదమ్మ "ఏమిటీ మధ్య కొత్తకొత్త అలవాట్లొస్తున్నట్టున్నాయి? "

"ఏమిటమ్మా"

"మూడు నెలల క్రితం నేనిక్కడ ఉన్నంత వరకూ ఐదుంబావుకంతా ఇంట్లో ఉండేవాడివి. ఇప్పుడేంటి ఆరు గంటలకు ఇల్లు చేరుతున్నావ్? "

సుధాకర్ ఓ మూలగా నిలబడి ఉన్న నాగమణికేసి చూశాడు. ఆమె తనదేం తప్పులేదన్నట్టుగా తలాడిస్తూ చేతులు తిప్పింది.

"అదికాదమ్మా! ఫ్రెండ్స్‌తో కలిసి మాట్లాడుతూ..."

అతడి మాటలు మధ్యలోనే కట్‌చేసింది ఆమె. "ఎవరా కొత్త ఫ్రెండ్సూ? "



"ఫ్రెండ్స్ అంటే.." అతడు నసిగాడు "ఫ్రెండ్స్‌కాదు. కొలీగ్స్. అంటే బ్యాంక్‌లో నాతో పనిచేసేవాళ్లు"

"బ్యాంక్‌లో పనిచేసేవారయితే, బ్యాంక్‌లో ఉన్నంతవరకూ మాట్లాడుకోవచ్చు బ్యాంక్ వదిలొచ్చాక కూడా మాటలేముంటాయి? "

తనిక జోక్యం చేసుకోక తప్పదనిపించింది నాగమణికి.

"ఆయన ఇంటికొచ్చి చేసేదేముంది అత్తయ్యా? టి.వి. చూస్తూనో, పుస్తకం తిర గేస్తూనో టైంపాస్ చేయాలి"

"అయితే మీ ఆయనకి మరేం పనిలేదం టావ్? "

"ఏం పని ఉంటుంది? "

"చూడమ్మా మణీ! మీకు అన్నీ ఉన్నాయి. కూటికి, గుడ్డకు దిగుల్లేదు. చాలినంత సంపాదన ఉంది. కానీ ఒక అదృష్టం మాత్రం లేదమ్మా! ఆ అదృష్టం కలిగించ మని మీరిద్దరూ ప్రతి సాయంత్రం ఏ గుడికో, గోపురానికో వెళ్లి దేవుడిని ప్రార్థించొచ్చుగా? "

యశోదమ్మ టాపిక్‌ని ఎటువైపు తీసుకెళు తోందో అర్థమయిపోయింది నాగమణికి. ఆమె ముఖం నల్లగా మాడిపోయింది.

సుధాకర్ కూడా మరేం మాట్లాడలేదు. ఆ సమయంలో తనేమయినా మాట్లాడితే ఆమె మరింత కోప్పడుతుందని అతడికి తెలుసు.

వాళ్లిద్దరూ మాట్లాడకపోయేసరికి ఆమె అంది, "పెళ్లయి ఏడేళ్లయింది. పిల్లాపీచు లేరు. అయినా మీకు మాత్రం ఎలాంటి దిగులూ లేదు.."

అప్పటికే వారిద్దరూ తలదించేశారు. ఆమె మాత్రం వారి ముఖాలలోని బాధను గమనించకుండానే మాట్లాడేస్తోంది.

"నాకున్నపాటి దిగుల్లో నూరోవంతు మీకున్నా ఈ పాటికి నేను నా మనుమలతో ఆడుకుంటూ ఉండేదాన్ని. పిల్లలుంటే ఖర్చని లేదా పిల్లలుంటే ఇద్దరూ ఉద్యోగాలకెళ్లడం వీలుకాదని మీరు అనుకుంటున్నట్టుంది. అందుకే ఇద్దరూ కాసింత వండుకుని తిని హాయిగా కాలం గడిపేస్తున్నారు. కాని పిల్లలు లేకపోతే వచ్చే నష్టమేమిటో మీకి ప్పుడు తెలియదు. రేపు ముసలాళ్లయి మంచాన పడతారు చూడు అప్పుడు... అప్పుడు మిమ్మల్ని చూసే దిక్కులేక బాధప డతారు. అయినా పిల్లలు లేని ఇల్లూ ఒక ఇల్లేనట్రా..."

ఇక ఓర్చుకోలేనట్టు "అమ్మా" అన్నాడు సుధాకర్. "మమ్మల్నేం చేయమంటావ్? "

"ఏమీ చేయలేమనుకుంటూ ఊరకుండక ఏదో ప్రయత్నం చేయమంటాను" వెంటనే చెప్పిందామె.

"ఆమధ్య తనని ఒకరిద్దరు డాక్టర్లకి చూపించాను. నేనూ చూపించుకున్నాను. వాళ్లిచ్చిన మందులు వాడాం. ఫలితం లేక పోతే మేమేం చెయ్యాలి? " అతడి గొంతులో చిరాకు ధ్వనించింది.

"ఇంకో డాక్టర్ దగ్గరకో, మరో హాస్పిట ల్‌కో వెళ్తూ ఉండాలి. అసలు మీ ఇద్దరికీ బిడ్డలు కావాలన్న ఆలోచనేలేదు. ఉండిఉంటే ఇదిగో ఇలాంటి అడ్రసులు పట్టుకుని వెళ్లి ఉండేవాళ్లు" ఆమె కొంగుకి ఉన్న ముడివిప్పి అందులో నుండి ఓ కాగితం తీసి అతడిచేతిలో పెట్టింది.

సుధాకర్ ఆ కాగితం మడతలు విప్పి చూశాడు. హైదరాబాదులోని ఓ ఫెర్టిలిటీ సెంటర్ అడ్రసు అది.

అతడు తన చేతిలోని కాగితం నాగమ ణికి అందించాడు. ఆమె ఆ కాగితంకేసి చూస్తుండగానే యశోదమ్మ చెప్పింది.

"రాజశ్రీ వాళ్ల పక్కింట్లో ఉండే దంపతు లకు మీలాగే ఏడెనిమిదేళ్లనుండి సంతానం లేదట. పత్రికల్లోని అడ్రసు పట్టుకుని ఈ





హాస్పిటల్ కి వచ్చారట. వాళ్లేవేవో చేస్తే ఇప్పుడా అమ్మాయి గర్భవతి. విజయవాడలో ఉంటూ హైదరాబాద్‌లోని అడ్రసు పట్టుకున్నారు. హైదరాబాదులో ఉండీ మీరీ అడ్రసు కనుక్కోలేకపోయారు"

సుధాకర్, నాగమణి ముఖాలు చూసుకున్నారు. అడ్రస్ కనుక్కోలేకపోవడంకాదు. ఈమధ్య ప్రతిచోటా ఓ ఫెర్టిలిటీ హాస్పిటల్ కనిపిస్తోంది. ఆ హాస్పిటల్‌లోకి అడుగుపెడితే చాలు వేల రూపాయలు ఖర్చయిపోతాయని తెలిసిన వాళ్లంతా అంటుంటారు. అలాంటప్పుడు ఆ హాస్పిటల్స్‌కేసి చూడాలంటేనే భయం వేస్తుంది. అంతేతప్ప అడ్రసులు తెలుసుకోలేకపోవడం కానేకాదు.

ఇదంతా తల్లితో అనలేదతడు. అంటేగనుక ఆమె ఏమంటుందో కూడా ఊహించగలడు. 'నాకు తెలుసురా! అలా డబ్బు ఖర్చవుతుందనే నువ్వు బిడ్డలు వద్దనుకుంటున్నావ్. పిసినారివి. అయినా నువ్వు సంపాదించి కూడబెట్టిందంతా నీ తదనంతరం ఎవరు తినాలని? '

"సరేనమ్మా! వీలు చూసుకుని ఈ హాస్పిటల్ కి ఓసారి వెళ్లొస్తాం" చాలాసేపటి తర్వాత నోరు పెగల్చుకుని పలికాడు సుధాకర్.

"వీలు చూసుకుని కాదు. రేపో ఎల్లుండో బ్యాంక్ కి శలవు పెట్టి వెళ్లిరండి"

"అలాగే" తలాడించాడు అతడు.

యశోదమ్మ హాల్లోనుండి లోపలికెళ్లిపోయింది. హాలు మధ్యలో వారిద్దరే నిలబడిపోయారు.

అతడు ఆమెకేసి కొద్ది క్షణాలు తదేకంగా చూసి తలతిప్పుకుని బెడ్‌రూమ్‌లోకెళ్లిపోయాడు.

ఆమెకు మాత్రం చాలా నీరసంగా అనిపించింది. అంతకుమించి ఇబ్బందికరమైన ఫీలింగ్... తల్లి కాలేకపోయిన ఏ ఇల్లాలికయినా అలాంటి ఇబ్బందికరమైన ఫీలింగ్ అప్పుడప్పుడూ ఎదురవుతూ ఉంటుంది.

★ ★ ★

ఆ రాత్రి-

సుధాకర్ భార్యను దగ్గరకు తీసుకున్నాడు. తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్‌కేసి చూస్తున్న ఆమె చూపులు గమనించి బుగ్గలు పొదివి పట్టుకుని ముఖాన్ని తనవైపుకు తిప్పుకున్నాడు. ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి.

"బాధగా ఉందా? "

"ఎందుకు? "

"సాయంత్రం అమ్మ అలా మాట్లాడినందుకు"

"ఆమె అనవసరంగా ఏమీ మాట్లాడలేదే. అత్తయ్యగారి మాటల వెనుక కొంత బాధ ఉంది. అప్పటికీ ఆమె ఉత్తమురాలు కాబట్టి ఆ ప్రయత్నం చేయండి, ఈ ప్రయత్నం చేయండి అంటూ సలహాలిస్తోంది. అదే మరో అత్తగారయితే ఈసరికి కొడుక్కి రెండోపెళ్లి ప్రపోజల్ పెట్టి ఉండేది"

"ఛాఛా! అమ్మ అలా ఎన్నటికీ మాట్లాడదు. ఆమె చదువుకున్నది కాకపోయినా కష్టనష్టాలు తెలుసు"

"అదే నేనూ అంటున్నది. ఆమె అర్థం చేసుకోగలుగుతుంది కాబట్టే మనం ఇంత మాత్రం కాపురం చేయగలుగుతున్నాం"

"అయితే మనం ఎల్లుండి శెలవుపెట్టి అమ్మ చెప్పిన హాస్పిటల్ కి వెళ్దామా? " అడిగాడు సుధాకర్.

"మీ ఇష్టం" అన్నాక చాలాసేపటి తర్వాత చెప్పిందామె "అలాంటి హాస్పిటల్స్‌లో అడుగుపెట్టాలంటేనే భయమనిపిస్తుందండి! మనం నెలరోజులు శ్రమపడి సంపాదించిందీ, పొదుపుచేసి దాచుకున్నదీ ఆ హాస్పిటల్‌లో అడుగుపెట్టిన అరగంటలోనే అయి



పోతుంది. అలా పది రోజులు ఆ హాస్పిట ల్‌కి వెళితే చాలు ఓ సంవత్సరం సంపాదన హుష్‌కాకి" నవ్విందామె. కానీ ఆ నవ్వు వెన కాల చాలా విషాదం ఉంది.

"ఇది డబ్బు గురించి ఆలోచించే సమస్య కాదు. మనకి ఉన్నంతలో ఖర్చుపెడదాం"

ఆమె మౌనంగా తలాడించింది.

అతడు ఆమెను మరింత దగ్గరకు తీసుకు న్నాడు.



హాస్పిటల్‌లోకి అడుగుపెడుతుంటే వారి ద్దరికీ ఒక రకమయిన జలదరింపు లాంటిది కలిగింది.

వైద్యుడిని నారాయణుడితోను, వైద్యశా లని పవిత్రదేవాలయంగాను పోల్చారు పెద్దలు. వైద్యుడిని చూస్తే ఏ రోగికయినా ఓ పవిత్రభావం మనసులో కదలాడాలి. అంతే తప్ప డాక్టర్ మనుషుల్ని పట్టుకుని రక్తాన్ని పీల్చే జలగలా కనిపించకూడదు.

దురదృష్టమేమిటంటే, ఆ దంపతులకు వెళ్ళిన ప్రతి హాస్పిటల్‌లోనూ జలగల్లాంటి డాక్టర్లే కనిపించారు. అందుకే వారికి హాస్పి టల్‌ని చూస్తేనే భయం. అదో జలగల మడుగు అనిపిస్తుంది వారికి.

సుధాకర్ రిసెప్షనిస్ట్ దగ్గరకెళ్లాడు. "మేము డాక్టర్‌ని కలుసుకోవాలి"

"అపాయింట్‌మెంట్ ఉందా? "

"లేదండి"

ఆమె ఓ బుక్ తీసి పేజీలు తిరగేసింది. తర్వాత చెప్పింది. "మీరీ రోజు సాయంత్రం ఏడింటికి రాగలరా? అపాయింట్‌మెంట్ ఫిక్స్ చేస్తాను"

"అలాగే" అన్నాడు సుధాకర్.

"రెండువందలివ్వండి" వెంటనే చెప్పిం దామె.

అది కన్సల్టేషన్ ఫీజు. కేవలం పరీక్షిం చేందుకు వసూలు చేసే మొత్తం అది. అంతటితో ఆగిపోతే ఫర్వాలేదు. ఎన్నిరకాల టెస్టులో...? ఆ టెస్టులకే వేల రూపాయల్లో డబ్బు ఖర్చవుతుంది.

సుధాకర్ జేబులోనుండి పర్స్ తీసి రెండు వందలు ఆమెకందించాడు. డబ్బు అందుకున్నాక రశీదు రాసి ఓ కార్డుమీద టైమ్ వేసి అతడికందించింది.

అతడు నాగమణి దగ్గరకొచ్చాక చెప్పాడు, "మనం ఈ రాత్రికి రావలసి ఉంది. డాక్టర్ అపాయింట్‌మెంట్ అప్పటికి దొరికింది"

"సరేపదండి" అంది నాగమణి.

ఇద్దరూ హాస్పిటల్ మెట్లు దిగుతూ ఉన్నారు.

సరిగ్గా అప్పుడే- హాస్పిటల్ ముందు ఓ కారు ఆగింది. కారు డ్రైవింగ్ సీట్‌లోంచి దిగిందామె.

సుధాకర్ మొదట చూడలేదామెను. నాగ మణితో సాయంత్రం ప్రోగ్రాం గురించి చెబుతూ ఉన్నాడు. ఆమె వారిని దాటిపో తున్నప్పుడు యథాలాపంగా తలతిప్పి చూశాడు. హఠాత్తుగా కళ్ళముందు కనిపిం చిన మనిషిని పోల్చుకోవడం కొంత కష్టమ యింది. పోల్చుకోవడం జరిగిన వెంటనే ఆనందంగాను, అప్పటికే కొంత అనుమానం గానూ "జ్యోతి...? " అన్నాడు.

ఆమె చప్పున తల తిప్పింది. అతడికేసి పరీక్షగా చూడసాగింది. ఆమె జ్యోతి అని అప్పటికి నిర్ధారణ అయింది సుధాకర్‌కి. పద్దెనిమిదేళ్ళ క్రితం సన్నగా, మెరుపుతీగలా ఉన్న జ్యోతి కాస్త లావయి, బాగా మారి పోయినప్పటికీ తను సరిగానే గుర్తించగలి గాడు. ఆమె మాత్రం తనవైపు ఇంకా పరిశీ లనగానే చూస్తోంది.

"నువ్వు..." అతడు సర్దుకున్నాడు. "...

మీరు... జ్యోతి... తెనాలి...!"

ఆమె ముఖంలో వెలుగు... అప్పటికి గుర్తుపట్టినట్టు మోహంనిండా సంతోషం తాండవిస్తూండగా " నువ్వు... సారీ! మీరు... సుధాకర్... యామైరైట్?" నవ్వుతూ అందామె.

"అవును" అతడూ నవ్వుతూ అన్నాడు.

"ఎన్నాళ్ళకి చూస్తున్నాను?... ఎప్పుడో చిన్నప్పుడు చూడడం కదూ! అసలు గుర్తే పట్టలేకపోయాను"

"నేను కూడా"

నాగమణి వారిద్దర్నీ చూస్తూ ఉంది.

"ఎక్కడుంటున్నారు?"

"ఇక్కడే... బ్యాంక్ కాలనీలో" చెప్పాక, వెంటనే అడిగాడు " మీరూ హైదరాబాద్ లోనే ఉంటున్నారా?"

"అవును! నేను గాంధీ హాస్పిటల్‌లో డాక్టర్‌గా పనిచేస్తున్నాను"

"డాక్టరా?"

"యస్. ఈ హాస్పిటల్‌కి కూడా నేను కన్సల్టెంట్ డాక్టర్‌ని"

"అలాగా" అన్నాడు సుధాకర్. పల్లెటూర్లో తనతోపాటు స్కూల్ ఫైనల్ వరకూ చదువుకున్న అమ్మాయి, తను టీజ్ చేస్తే ఏడ్చి కొద్దిరోజులపాటు పలకడం మానేసిన ఆడపిల్ల... పద్ధెనిమిదేళ్ళ తర్వాత డాక్టర్‌గా తన ఎదుట నిలవడం అద్భుతం కాకపోయినా చాలా థ్రిల్లింగ్‌గా అనిపించింది అతడికి.

"మీరేం చేస్తున్నారు?"

"నేను బ్యాంక్‌లో పనిచేస్తున్నాను"

అప్పుడు చూసిందామె నాగమణివైపు "ఆమె...?"

"మిసెస్... నాగమణి... మణీ! ఇద్దరం చిన్నప్పుడు ఒకే స్కూల్లో చదువుకున్నాం"

నాగమణి రెండుచేతులూ జోడించి "నమస్కారమండీ" అంది. ఆమె కూడా ప్రతి నమస్కారం చేసింది.

"అది సరే, మీరేంటి ఇలా వచ్చారు?"

ఎందుకోగాని అతడికి చెప్పడం కొద్దిగా ఇబ్బంది అనిపించింది. "ఈ హాస్పిటల్ లోని డాక్టర్‌ని కన్సల్ట్ చేద్దామని వచ్చాం"

"ఫెర్టిలిటీ కేసా?"

"అవును" అలా అంటున్నప్పుడు అతడి మేల్ ఈగో' కొద్దిగా దెబ్బతిన్నట్టు ఫీలయ్యాడు.

"లోపలికి రండి మాట్లాడుకుందాం" ఆమె ముందుకు నడిచింది. వారిద్దరూ ఆమెను అనుసరించారు.

హాస్పిటల్ లోపలికి నడిచాక ఆమె వారిని డాక్టర్స్ రెస్ట్‌రూంలోకి తీసుకెళ్లింది. అక్కడున్న బాయ్‌ని కాఫీ కోసం పంపించింది.

"చెప్పండి! పెళ్ళయి ఎంతకాలమయింది?"

"ఏడేళ్ళు"

"ఇంతకుముందు వేరే హాస్పిటల్స్‌లో చూపించారా?"

ఈసారి నాగమణి జవాబు చెప్పింది. "నాలుగేళ్లుగా అప్పుడప్పుడూ వాళ్ళూ వీళ్ళూ చెప్పిన గైనకాలజిస్ట్‌లనికలుస్తూనే ఉన్నాం"

"ఇద్దరూ టెస్ట్ చేయించుకున్నారా?"

"చేయించుకున్నాం"

"రిపోర్ట్స్ మొత్తం ఉన్నాయా?"

"ఉన్నాయి"

"అయితే ఓ పని చేయండి. ఈరోజు డాక్టర్ భవానీగారిని కలవదలచుకుంటే కలవండి. కానీ ఆమె సజస్ట్ చేసే టెస్ట్ ఏమాత్రం చేయించకండి. ఎందుకంటే ఆల్‌రెడీ మీ దగ్గర రిపోర్ట్స్ ఉన్నాయి కాబట్టి. వృథా ఖర్చు ఎందుకు? మీ కేసు గురించి ఆమెకు నేనూ ఓ మాట చెబుతాను. రేపు

సాయంత్రం మీరిద్దరూ ఆ రిపోర్ట్స్ మొత్తం తీసుకుని నన్ను కలవండి" ఆమె హేండ్‌బ్యాగ్‌లోని తన విజిటింగ్‌కార్డు తీసి అతడికి అందించింది.

"థాంక్యూ డాక్టర్" అన్నాడు సుధాకర్.

ఆమె అతడివైపు సీరియస్‌గా చూసింది. "నేను డాక్టర్‌నని తెలియడంతోనే మన మధ్యదూరం పెరిగిపోయిందా? అయ్యబాబోయ్! నేనిప్పుడు డాక్టర్‌నైనా ఒకప్పుడు మీకు క్లాస్‌మేట్‌నే. సో! అప్పటిలానే జ్యోతి అంటూ పిలవండి చాలు"

సుధాకర్‌కి చాలా ఉత్సాహంగా అనిపించింది. "అలాగే" అన్నాడు.

అంతలో బాయ్ కాఫీ తీసుకురావడంతో ఆ టాపిక్ అంతటితో కట్ అయింది. బాయ్ ముగ్గురికీ కాఫీ అందించాడు.

కాఫీ తాగడం పూర్తయ్యాక జ్యోతి లేస్తూ "రేపు సాయంత్రం మీరు నన్ను మా ఇంటి దగ్గర కలుస్తున్నారుకదూ? " అంది.
"అలాగే" అన్నాడు సుధాకర్.

అతడికి ఆమెతో మరికాసేపు మాట్లాడాలని ఉంది. తమ చిన్ననాటి చిలిపి అల్లరి మరోసారి గుర్తుచేసుకోవాలని ఉంది. కాని...

"నేను మీతో మరికాసేపు మాట్లాడొచ్చు కాని అక్కడ నాకోసం పేషెంట్స్ ఎదురు చూస్తుంటారు. రేపు సాయంత్రం నేను ఫ్రీగా ఉంటాను. ఎంతసేపైనా మాట్లాడుకోవచ్చు"

తన మనసులోని మాటలు చదివినట్టుగా ఆమె అనడంతో అదిరిపడి, "భలేవారే! మీలాంటి బిజీ వ్యక్తులు ఈమాత్రం మాట్లాడటమే అదృష్టం..." సుధాకర్ మరింకేదో చెప్పబోతుంటే ఆమె చెయ్యి అడ్డుగా ఉంచి ఆపమన్నట్టుగా సైగచేసింది.

"అదిగో మళ్ళీ 'మీరు' అంటూ గౌరవవాచకం వాడేస్తున్నారు. మనం చిన్ననాటి స్నేహితులం. నో మర్యాదలు..." అంటూ నవ్విందామె.

"ఓహ్... సారీ" అతడూ నవ్వాడు.

ముగ్గురూ రూంలోనుండి బయటికి నడిచారు.

"వెళ్ళొస్తామండీ" నాగమణి చేతులు జోడించింది.

జ్యోతి కూడా చేతులు జోడించి "ఉంటాను" అంది.

వారిద్దరూ హాస్పిటల్‌నుండి బయటకు నడిచారు. పార్కింగ్ ప్లేస్‌లో ఉన్న స్కూటర్ వైపు నడిచేప్పుడు సుధాకర్ చెప్పాడు "మణీ! కలిసి చదువుకునే రోజుల్లో నేను జ్యోతిని భలే ఏడిపించేవాడిని. మా స్కూల్ ఊరికి కాస్త దూరంలో ఉండేది. మగపిల్లలు మధ్యాహ్నం ఇంటికెళ్ళి భోంచేసి వచ్చేవారు. ఆడపిల్లలు మాత్రం బాక్సులు తెచ్చుకునేవారు. నేను ఉదయంపూట ఇంటర్వెల్‌లో జ్యోతి బాక్స్‌లోని కోడిగుడ్డులాంటివి తినేసేవాడిని. ఆపని చేసింది నేనేనని తెలిసినా, తను మాత్రం మాస్టారికి చెప్పేది కాదు"

అప్పటికే వారిద్దరూ స్కూటర్ దగ్గరకు చేరుకున్నారు. అతడు స్కూటర్ స్టార్ట్ చేస్తున్నప్పుడు ఆమె అడిగింది.

"స్కూల్ ఫైనల్ తర్వాత మీరిద్దరూ మళ్ళీ కలుసుకోనేలేదా? "

అతడు స్కూటర్ స్టార్టుచేసి, ఆమె కూర్చున్నాక ముందుకు పోనిస్తూ చెప్పాడు, "నేను స్కూల్ ఫైనల్ పరీక్షలు రాయడం, అప్పుడే నాన్న చనిపోవడంతో ఊళ్ళో ఉన్న పొలాలన్నీ అమ్మేసుకుని విజయవాడలోని మామయ్య దగ్గరకు చేరుకున్నాం. విజయవాడలోనే కాలేజీ చదువులు పూర్తిచేశాను. అందుకే ఆ తరువాత జ్యోతిని కలవడం జరగలేదు"

పావుగంట తర్వాత స్కూటర్ వారి ఇంటి




ముందు ఆగింది.

ఇంట్లోకెళ్లాక అతడు తల్లితో చెప్పాడు, "అమ్మా! తెనాలిలో శంకర్రెడ్డిగారి అమ్మాయి జ్యోతి లేదూ? నాతోపాటు చదువుకునేది..."

"శంకర్రెడ్డి కూతురు తెలియకపోవటమేమిట్రా? తెలుసు" యశోదమ్మ అంది.

"ఆ అమ్మాయి ఇప్పుడు హైదరాబాద్ లోనే ఉంది. తనిప్పుడు పెద్ద డాక్టర్. మేమెళ్ళిన హాస్పిటల్‌కి తనూ కన్సల్టెంట్ డాక్టరట"

"అలాగా" యశోదమ్మ ముఖంలో కాస్త సంతోషం కదలాడింది. "ఆ అమ్మాయిని అప్పుడెప్పుడో చూశాను. పద్దెనిమిదేళ్ళయిపోయింది కదూ!... అప్పుడు సన్నగా, గాలి వేస్తే ఎగిరిపోయేలా ఉండేది. ఇప్పుడూ అలాగే ఉందా?"

"లేదు. కాస్త వళ్ళు చేసింది. మరీ లావు కాదనుకో..." ఆమె అందం గురించి చెబుదామనుకున్నాడు గానీ పక్కనే భార్య ఉందని ఆగిపోయాడు. జ్యోతి గురించి తనిప్పటికే ఎక్కువ మాట్లాడుతున్నానని తనకే అనిపిస్తోంది.

"చాలాకాలమయిపోయింది కదూ? నేనూ ఓసారి చూసినట్టు ఉంటుంది. తననోసారి మనింటికి రమ్మనకూడదూ?"

"ఈరోజేకదమ్మా తన గురించి తెలిసింది. రేపు మమ్మల్ని వాళ్ళింటికి రమ్మంది. వెళ్ళినప్పుడు తనని మనింటికి రమ్మని పిలుస్తాను" చెప్పాడతడు.

సుధాకర్ బెడ్‌రూంలోకి వెళ్ళి రిలాక్స్‌గా బెడ్‌మీద పడుకున్నాడు. అతడికి చాలా ఉత్సాహంగా ఉంది. చాలాకాలం తర్వాత తన చిన్ననాటి స్మృతులు గుర్తుకు రాసాగాయి. జ్యోతితో కలిసి చదివిన రోజుల్లో తను చేసిన చిలిపిపనులు, ఆమె ముద్దుగానే తనను కసురుకోవడం దృశ్యాల్లా కనుల ముందు కదలాడసాగాయి.

★ ★ ★

అమీర్‌పేటలోని ఓ లగ్జరీ అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్‌లో రెండో అంతస్తులో ఉంది జ్యోతి ఉంటున్న ఫ్లాట్. గ్రౌండ్ ఫ్లోరులో పచ్చికబయళ్ళు, విశాలమైన పార్కింగ్ ప్లేస్ ఉంది.

సుధాకర్ అక్కడ స్కూటర్ ఆపాడు. నాగమణి స్కూటర్ దిగింది. స్కూటర్ స్టాండు వేశాక, మెట్లవైపు దారితీశాడు. అతడిని అనుసరించింది నాగమణి.

కాలింగ్‌బెల్ నొక్కిన రెండు క్షణాల్లోనే ఫ్లాట్ తలుపు తెరిచింది జ్యోతి. వారిద్దరూ కనిపించడంతో ముఖమంతా సంతోషం కదలాడుతుండగా "రండి... రండి! మీ కోసమే ఎదురుచూస్తున్నా" అంది.

హాల్లోకి ఎంటరవ్వగానే 'కూర్చోండి' అంటూ సోఫాలు చూపించింది. వారిద్దరూ కూర్చున్నాక తనూ వారి ఎదురుగా కూర్చుని 'మాలా' అంటూ పిలిచింది.

"ఏంటండమ్మగారు" అంటూ లోపలి నుంచి ఓ పదిహేనేళ్ల పిల్ల వచ్చింది. "మంచినీళ్లు పట్రా" అంటూ జ్యోతి ఓ మూలగా ఉన్న ఫ్రిజ్ వైపుకు చూపించింది. ఆమె వెళ్ళాక అంది, "ఊ! చెప్పండి"

నాగమణి తన చేతిలోని రిపోర్ట్స్ ఆమెకు అందించింది.

"మొదటినుంచీ తీసిన రిపోర్ట్స్ మొత్తం ఉన్నాయా?"

"అన్నీ ఉన్నాయండీ" చెప్పింది నాగమణి.

జ్యోతి ఆ రిపోర్ట్స్ తిరగేస్తుంటే, నాగమణి ఆ ఇంటికేసి పరిశీలనగా చూడసాగింది. ఆ ఇంట్లో అడుగడుగునా ఇల్లాలి టేస్ట్ ప్రదర్శితమౌతోంది. బిజీ డాక్టర్‌గా ఉండీ ఆమె ఇంటిని అంత అందంగా తీర్చిదిద్దుకోవడం గొప్ప విషయం. అప్పటివరకూ తనేదో శ్రమపడిపోతున్నానన్న ఫీలింగ్ నాగమణిలో ఉండేదిగానీ ఆమెను,

ఆ ఇంటినీ చూశాక తనలో ఆ ఫీలింగ్ పోయింది.

రిపోర్ట్స్ కింద పెట్టాక, "కేసు గురించి తర్వాత మాట్లాడుకుందాం ముందు..." అంటూ జ్యోతి ఇంకేదో చెప్పబోతుండగా మాల ఐస్‌వాటర్ గ్లాసులతో వచ్చింది. నీళ్లు తాగాక జ్యోతి అంది "టీయా? కాఫీనా? "

"కాఫీ" అన్నాడు సుధాకర్.

జ్యోతి మాలవైపు తిరిగి కాఫీ చెయ్యమని చెప్పి ఆ దంపతులిద్దర్నీ "ఇల్లు చూద్దురు రండి" అంటూ ఆహ్వానించింది.

"సుధాకర్, నాగమణి ఆమెను అనుసరించారు. ముందు వంటగది చూపించింది. డ్రాయింగ్‌రూమ్, బెడ్‌రూమ్ చూపిస్తుంటే వారిద్దరి కళ్లూ వాటిని పరిశీలించడం మానేసి, మరి దేనికోసమో వెతకసాగాయి. కాని వారు వెతుకుతున్నది ఎంతకీ కనిపించడంలేదు.

"ఇంతకీ మీ ఫ్యామిలీ ఫొటో ఒక్కటీ కనిపించట్లేదు? " నాగమణి అడిగేసింది ఉండబట్టలేక.

జ్యోతి ముఖంలో ఓ బాధావీచిక అలా కదలాడి ఇలా మాయమయింది. ఆమె సమాధానం చెప్పలేదు. భార్యాభర్తలిద్దరూ ముఖాలు చూసుకున్నారు. రకరకాల అనుమానాలు వారి మనసుల్లో ఉదయించాయి. జ్యోతి ఇంకా పెళ్లి చేసుకోలేదేమోనన్న అనుమానంతో ఆమెకేసి పరిశీలనగా చూసింది నాగమణి.

"నా ఇల్లెలా ఉంది? " అడిగింది జ్యోతి టాపిక్‌ని డైవర్ట్ చేస్తున్నట్టుగా.

'మా ఇల్లు' అనకుండా నా 'ఇల్లు' అనడంలోనే కొంత అర్థమయిపోయింది వారికి. కానీ పూర్తిగా అర్థం కాలేదు.

"చాలా బాగుందండీ" ఇద్దరూ ఒకేసారి అన్నారు. అటుపైన టాపిక్ డైవర్ట్ చేస్తూ

"ఇన్‌ఫెర్టిలిటీ...! ఇదో సమస్యా... అనిపిస్తూనే భవిష్యత్తులో పెద్ద సమస్యగా ఇప్పుడిప్పుడే రూపుదిద్దుకుంటున్న సమస్య ఇది. డూ యూ నో? "అంది జ్యోతి

"రాబోయేకాలంలో పెద్ద సమస్యగా మారబోతుందన్న విషయం నాకు తెలియదుగానీ, ప్రస్తుతం మాత్రం చాలా కొద్దిమంది ఈ సమస్యవలన చాలా రకాలుగా బాధపడుతున్నారని తెలుసు" సుధాకర్ చెప్పాడు.

ఆమె వెంటనే అంది, "చాలా కొద్దిమంది... ఆ పదం కూడా తప్పే! ఎందుకో తెలుసా? ప్రస్తుతం ఈ జంట నగరాలలోనే 'ఫెర్టిలిటీ సెంటర్స్' ఎన్ని ఉన్నాయో, ఆ సెంటర్స్‌కి వచ్చే జనమెంతో మీకు తెలియదు కాబట్టి అలా అనగలుగుతున్నారు మీరు.

జంటనగరాల్లో ఒకస్థాయి కలిగిన ఫెర్టిలిటీ కేంద్రాలు పదివరకూ ఉన్నాయి. ఒక్కో ఫెర్టిలిటీ కేంద్రానికీ ప్రతి సంవత్సరం రెండువేల నుంచి మూడువేలవరకూ పేషంట్స్ సంప్రదింపుల కోసం వస్తూవుంటారు. అంటే ఈ పది ఫెర్టిలిటీ కేంద్రాలకూ కలిపి సుమారుగా పాతికవేలమంది సంతానం కోరివస్తున్నారు. పోతే ఫెర్టిలిటీ కేంద్రాలకు రాకుండా తమకు అందుబాటులో ఉన్న గైనకాలజిస్టులు తదితర డాక్టర్లకు చూపించుకునే పేషెంట్స్ సంఖ్య ఇంతమందే ఉంటారనుకున్నా మొత్తంమీద ఓ యాభైవేలమంది స్త్రీలు ప్రతిఏటా సంతానం కోసం హాస్పిటల్స్‌కి పరిగెడుతున్నారు. ఆ సంఖ్య జంటనగరాలు, ఈ నగరాల పరిసర ప్రాంతాలలో ఉన్న గ్రామప్రజలకు సంబంధించింది మాత్రమే! ఈ మొత్తం ప్రాంతంలోని జనాభా ఓ యాభైలక్షలు అనుకుంటే, అందులో యాభైవేలమంది స్త్రీలు ఇన్‌ఫెర్టిలిటీ సమస్యతో బాధపడుతున్నారు... ఇది నేను ఊహాగానంతో చెపుతున్న లెక్కలు కాదు. కొన్ని రిపోర్టుల ఆధారంగా ఖచ్చితంగా చెప్తున్న లెక్కలు. ఇప్పుడు చెప్పండి! ఇది చాలా కొద్దిమంది సమస్యనా? "




ఆ దంపతులిద్దరూ కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయారు. కొన్ని సమస్యల తీవ్రత ఏమిటో మామూలు జనానికి అర్థం కాదు. కాని ఆ రంగంలో ఉండేవారు మాత్రమే ఆ సమస్యల గురించి ఆలోచించ గలరు. భవిష్యత్తులో ఆ సమస్యవల్ల ఏర్పడే తీవ్ర పరిణామాలేమిటో అర్థం చేసుకోగ లరు. 'ఓజోన్ పొర' గురించి పర్యావరణ శాస్త్రజ్ఞులు భయపడటమేగానీ, మామూలు జనం దాని గురించి పట్టించుకోరు. 'సేవ్ పెట్రోల్' అనే ప్రకటనని చూసే జనం ఆ సమస్య తీవ్రత గురించి ఆలోచించరు. అదే మామూలు జనానికీ, మేధావులకు మధ్య తేడా!

చాలా సేపటి తరువాత ఆమే అడిగింది. "ఏమిటో ఏమీ మాట్లాడకుండా ఉన్నారు? "

"నమ్మలేకపోతున్నాం. ఒకవైపు అనేకదే శాలు జనాభా పెరిగిపోతోందని బెంగపడు తుంటే, మరోవైపు ఇంతమంది దంపతులు పిల్లలకోసం హాస్పిటల్స్‌కి పరుగెత్తడం చాలా చిత్రంగా ఉంది. ఇదే నమ్మలేని నిజంగా అనిపిస్తోంది" అన్నాడు సుధాకర్.

ఆమె నవ్వింది "ఇదే జీవితాల్లోని వాస్తవి కతకు, అసంబద్ధతకు ఓ ఉదాహరణ. ఇప్పుడు జనాభా పెరిగిపోతుందంటూ గోల పెడుతున్న దేశాలు, మరో యాభైఏళ్ల తర్వాత జనాభా తరిగిపోతుందంటూ 'పాపు లేషన్ డెవలప్‌మెంట్ ప్రోగ్రామ్స్' ప్రకటిం చినా ఆశ్చర్యం లేదు"

"అలా కూడా జరగవచ్చునంటారా? " నాగమణి ఆశ్చర్యంగా చూసింది.

"ఎందుకు జరక్కూడదు? మీకొక అత్యంత ఆశ్చర్యకరమైన, ఆందోళనకరమైన విషయం చెబుతాను వినండి- మీకు తెలు సుగా, పురుష వీర్యంలోని పునరుత్పత్తి కణాల ద్వారానే స్త్రీలలో అండం ఫలదీకరణ చెంది ఒక జీవిగా రూపుదిద్దుకుంటుం దని..."

వారిద్దరూ తెలుసునన్నట్టు తలలూపారు.

"ఈమధ్య వివిధ అమెరికన్ పత్రికలతో పాటు బొంబాయినుండి వెలువడే ఓ పత్రిక కూడా ఒక సర్వే నిర్వహించింది. ఆ సర్వేలో బయటపడిన విషయం ఎంత భయంకరమైనదంటే, భవిష్యత్‌లో మాన వాళి ఉనికి ఏమవుతుందోనన్న ఆందోళనను కలిగిస్తుంది. మా డాక్టర్లని ఆ విషయం మరింత ఆలోచింపజేస్తోంది..."

వారిద్దరూ ఆసక్తిగా ముందుకు వంగారు.

"...ఇక సర్వే విషయం ఏమిటంటే- యాభై సంవత్సరాల క్రితం పురుషుల వీర్యంలో ఒక ఎం.ఎల్.కి 113 మిలియన్ల పునరుత్పత్తి కణాలు ఉండేవి. 1992లో జరి పిన సర్వేలో పురుషుల వీర్యంలోని పునరు త్పత్తికణాల సంఖ్య 66 మిలియన్లుగా తేలింది. అంటే పురుషుల్లో సంతానోత్పత్తి సామర్థ్యం నలభైశాతం తగ్గిపోయింది. ప్రస్తుతం ఉన్న 'కౌంట్' నిలకడగా ఉండే అవకాశం ఎంతమాత్రమూ లేదు. రోజురో జుకీ ఈ కౌంట్ తగ్గి పురుషుల్లోని పునరు త్పత్తి సామర్థ్యం అసలే లేకుండా పోయే ప్రమాదం ఉంది. ఇప్పటికే కొన్ని నగర ప్రాంతాల్లో ప్రతి వందమందిలోనూ ఐదు మంది పురుషులలో ఈ కౌంట్ ఒక మిల్లీ లీటరుకు 20 మిలియన్లకంటే తక్కువగా ఉంది. అంటే ఈ ఐదుశాతం పురుషులలో ఏ ఒక్కరివల్లా సంతానం కలిగే అవకాశం లేదు" ఆమె చెప్పడం ఆపింది.

సుధాకర్ భార్యకేసి చూశాడు. ఆమె అత డిని చూసి నవ్వింది. ఆ తర్వాత నాగమణి అడిగింది.

"ఇలా జరగడానికి కారణమేమిటో కను క్కున్నారా? "

"స్పష్టమైన కారణాలు చెప్పలేకపోతు న్నారు శాస్త్రజ్ఞులు. అయితే, కొన్ని రకాల కారణాలు ఈ మార్పుకి మూలం అయివుం

డొచ్చని అనుకుంటున్నారు. ఆ కారణాలే వంటే గత నలభై, యాభై ఏళ్లనుంచే కృత్రిమ ఎరువుల వాడకం అమలులోకి వచ్చింది. కృత్రిమ ఎరువులతో పెరిగిన ఆహారం తినడంవల్ల మనిషి రోగి కాకపో వచ్చు గుర్తించదగిన మార్పులు అతడికేమీ కనిపించకపోవచ్చు కానీ ఇలాంటి గుర్తించ లేని 'సైడ్ ఎఫెక్ట్స్'కి ఆస్కారం ఉంది. అలాగే 'పొగతాగడంవలన నాకు కేన్సర్ రాలేదే? ' అని ఓ వ్యక్తి ప్రశ్నించవచ్చు బట్... ఆ వ్యసనంవలన ఇలాంటి 'బలహీ నత' ఏర్పడేందుకు చాలా అవకాశం ఉంది. ఇంకా మద్యం, దోషపూరితమైన నీరు, కాలు ష్యభరితమైన గాలి, వెర్రి మొర్రి ఫ్యాషన్స్‌తో మనం ధరించే బిగుతైన దుస్తులు... ఇవన్నీ మనిషిని ఏదో రూపంలో వీక్ చేస్తూనే ఉంటాయి. అయితే అవి గుర్తించ దగిన స్థాయిలో తనను బలహీనపరచకపో వడం వెనువెంటనే తనను ఇబ్బంది పెట్టక పోవడంతో మనిషి ఈ 'అసహజాలు' కలి గించే దీర్ఘకాలిక ప్రమాదాన్ని పట్టించుకోవ డంలేదు. అంతే..."

జ్యోతి చెబుతున్న విషయాలు వినడానికి చాలా ఇంటరెస్టింగ్‌గానే ఉన్నాయిగానీ, అంతకుమించిన భయమూ, మరికాస్త ఇబ్బందిలాంటివి సుధాకర్‌కి కలిగాయి. డాక్టర్లు వ్రాసిన పరీక్షలు చేయించుకోవడమే గాని, తనేనాడూ ఆ రిపోర్ట్స్ కేసి చూడ లేదు. అందుకే ఆ భయం. కొంపదీసి తన కౌంట్ ఇరవైవేల మిలియన్లు మాత్రమే కాదుకదా?

తన ఫీలింగ్స్ గమనించిందేమో, ఆమె తనవైపు తిరిగి నవ్వుతూ చెప్పింది. "ఎనీ హౌ యూఆర్ వెరీ లక్కీ అండ్ వెరీ వెల్" మీ స్పెర్మ్‌కౌంట్ అరవైఐదు వేలుంది.

అతడికి నిశ్చింతలాంటిది కలిగింది. తన జీవితం మొత్తంమీద అంత నిశ్చింతగా నిట్టూర్చిన సందర్భాలు అరుదు. నాగమణి మొహంలోనూ అంతటి నిశ్చింతనే జ్యోతి గమనించింది.

"పురుషుడిలో సరైన స్పెర్మ్ కౌంట్, స్త్రీలలో మేజర్ ప్రాబ్లెమ్స్ లేకపోతే ఆ స్త్రీ పురుషులకు సంతానోత్పత్తి కలిగించడం కష్టంకాదు" చెప్పింది జ్యోతి.

"స్త్రీలో గర్భధారణ శక్తి లేకపోవడం అంటే గర్భాశయంలో లోపం ఉండడం... అలాగే గర్భధారణలో ముఖ్య పాత్ర వహించే ఫెలోఫిన్ ట్యూబ్స్ మూసుకు పోవడం లాంటివి మేజర్ ప్రోబ్లెమ్స్‌గా మేము పరిగణిస్తుంటాం"

ఈసారి నాగమణి కాస్త భయంగా అడి గింది. "ఒకవేళ స్త్రీలలో ఇలాంటి మేజర్ ప్రోబ్లెమ్స్ ఉంటే ఆమెకి బిడ్డలు పుట్టే అవ కాశమే లేదా? "

జ్యోతి వెంటనే చెప్పింది "నేడు సైన్స్ చాలా డెవలప్ అయింది. స్త్రీల్లోని ఇలాంటి మేజర్ ప్రాబ్లెమ్స్‌ని అధిగమించే విధానాలు చాలా అమల్లోకి వచ్చాయి. 'ఇన్‌వెట్రో ఫెర్టి లైజేషన్'- అంటే టెస్ట్‌ట్యూబ్‌లోఫలదీకరణ జరిగాక ఆ పిండాన్ని స్త్రీ గర్భాశయంలో ప్రవేశపెట్టడం అన్నమాట. ఈ రకంగా పుట్టిన బిడ్డనే 'టెస్ట్‌ట్యూబ్ బేబీ' అంటాము. ప్రస్తుతం 'ఇన్‌వెట్రో ఫెర్టిలైజే షన్' చాలా సర్వసాధారణమైన వైద్యవి ధానం. పేరున్న ప్రతి ఫెర్టిలిటీ సెంటర్‌లో ఈ 'ఇన్‌వెట్రో ఫెర్టిలైజేషన్' వసతులు లభి స్తున్నాయి. మా హాస్పిటల్‌లోనూ ఈ సౌకర్యం ఉంది".

నాగమణి ముఖంలో ఇంతకు ముందు కదలాడిన నిశ్చింతలాంటిది పోయింది. ఏదో అసంతృప్తి ఆమె ముఖంలో ప్రవేశిం చింది. ఈ ప్రపంచంలోని ఏ స్త్రీ అయినా 'సహజ సిద్ధం'గానే తల్లి కావాలని కోరుకుం టుంది మరీ విధిలేని పరిస్థితుల్లో తప్ప.

జ్యోతి టీపాయ్ మీద ఉన్న కెటిల్ అందుకుని కప్పుల్లో కాఫీ నింపింది. చెరొక




కప్పు ఆ దంపతులకి అందించి, తానూ ఓ కప్పు తీసుకుంది.

కాఫీ సిప్ చేస్తూ సుధాకర్ అన్నాడు "నేనింత వరకూ ప్రపంచ జనాభా విపరీతంగా పెరిగిపోతోందనీ, అన్ని ఇతర సమస్యలకూ మూలం అదేనని అనుకుంటూ ఉండేవాడిని. కానీ ఈ సరికొత్త సమస్య గురించి నాకు ఇప్పుడే తెలిసింది"

"సహజంగా ప్రతి సమస్యకూ రెండు కోణాలుంటాయి. అయితే అందులో ఒక కోణం మాత్రమే మనల్ని ఇబ్బంది పెడుతుంది. ఇబ్బంది పెట్టే కోణం గురించి మాత్రమే మనం ఆలోచిస్తాం. ఆ కోణం పెట్టే ఇబ్బంది తొలగిపోతే ఆ రెండో కోణం గురించిన తీవ్రత దర్శించగలుగుతాం."

నాగమణికి ప్రపంచ సమస్య గురించి ఏమో గానీ, తన గురించి మాత్రం భయంగా ఉంది. అదృష్టవశాత్తు ఆయన వైపు ప్రోబ్లెమ్ లేదని తేలిపోయింది. మరి తనవైపు ఏవైనా మేజర్ ప్రోబ్లెమ్స్ ఉన్నాయేమోనని తన ఆందోళన. 'ఈ డాక్టర్లు చెకప్ చేస్తారు. ఆమందులు, ఈమందులూవాడండి అంటూ ప్రిస్క్రిప్షన్ రాసిస్తారు. అంతేతప్ప ఇదీ ప్రాబ్లెమ్ అంటూ వివరించరు. ఇప్పుడీమె ఆ విషయం గురించి చాలా వరకూ అర్థమయ్యేలా చెప్పాక, తన ప్రాబ్లమ్ ఏమిటో తనకు తెలుసుకోవాలనిపిస్తోంది.

అందుకే అడిగిందామె "ఇంతకీ నా రిపోర్టులు చూశారా?"

అప్పటికే తన చేతిలోని కాఫీకప్పు ఖాళీ అవడంతో దాన్ని టీపాయ్ మీద పెట్టింది జ్యోతి. వారిద్దరి వైపు ఓసారి చూశాక నాగమణి వైపు చూపు నిలిపి చెప్పింది. "చూశాను! మేజర్ ప్రాబ్లమ్స్ లేవు. నిన్న డాక్టర్ భవాని మిమ్మల్ని పరీక్షించింది కదా! తనతో ఓసారి డిస్కస్ చేసి పూర్తి విషయాలు మీకు చెబుతాను"

మరి కాసేపటి తర్వాత సుధాకర్ అన్నాడు "మేము వెళ్ళొస్తాం"

"అదేమిటి? మీరిద్దరూ భోంచేసి వెళ్ళాలి"

"ఇప్పుడా? !" అన్నాడు సుధాకర్

"మీరెప్పుడంటే అప్పుడు! అరగంటలో అన్నీ రెడీ అయిపోతాయి."

సుధాకర్‌కి ఏంచెప్పాలో అర్థంకాక ఇబ్బంది పడుతుండడంతో నాగమణి చెప్పింది "లేదక్కా! అక్కడ అత్తయ్య మాకోసం ఎదురుచూస్తూ ఉంటుంది. మేం భోంచేసి వెళితే, కలిసిభోంచేయడం అలవాటు కాబట్టి తాను భోంచేయకుండా పడుకుంటుంది. మేము మరోసారి వస్తాం"

"ఆంటీ ఇక్కడే ఉందా? ... అయ్యో! నేను ఆమె గురించే మర్చిపోయాను. తనెలా ఉంది!" వెంటనే అడిగింది జ్యోతి.

"బాగున్నారు. మిమ్మల్ని అడిగినట్టు చెప్పమన్నారు"

"ఆమెను చూసి చాలా కాలమయింది. రేపు వచ్చేప్పుడు ఆమెను తీసుకురాకూడదూ? " అని ఆగి "వద్దొద్దులే, నేనే ఓసారి మీ ఇంటికొస్తాను" చెప్పింది.

"తప్పకుండా రండక్కా... రాబోయే ఆదివారం మీ ఫ్యామిలీ మొత్తం మా ఇంటికొస్తే ఆ రోజంతా మనం ఆనందంగా గడిపేయొచ్చు మీరు వస్తానంటే నేనే వచ్చి తీసుకెళ్తాను. ఆ రోజు మీకు వీలవుతుందా? "

జ్యోతి మెల్లగా "ఆరోజు నాకు శలవే.. రాగలను" అంది.

నాగమణి కాస్త సంతోషంగా పలికింది "అయితే ఆరోజు మీ ఫ్యామిలీ మొత్తం మా ఇంట్లోనే ఉండబోతున్నారు"

జ్యోతి ముఖం కాస్త మ్లానమయింది. "ఫ్యామిలీ అంటే..? " అప్పటికీ నవ్వుతూనే

అడిగింది.

"అదే... మీరూ, మీ వారూ, పిల్లలు..."

నాగమణిని ఇక ఆపమన్నట్టుగా సైగ చేశాక జ్యోతి చెప్పింది. "ఇంతకు ముందు 'మీ ఫ్యామిలీ ఫోటో ఒక్కటి కూడా లేదని' అడిగారు కదూ? ఫర్ యువర్ కైండ్ ఇన్ఫర్మేషన్, ఈ ఇంట్లో నేనొక్కదాన్నే ఉంటున్నాను" ఆమె నవ్వుతూనే ఉంది. కాని ఆ నవ్వులో జీవం లేకపోవడం వారిద్దరూ గమనించారు.

ఈసారి సుధాకర్ అడిగాడు "మరి మీవారు... పిల్లలు? "

నాకు పిల్లలు లేరు. మావారు నానుండి విడాకులు తీసేసుకున్నారు"

చాలా గాఢమైన నిశ్శబ్దం ఆవరించింది. సుధాకర్, నాగమణి ఊపిరి పీల్చడం కూడా మరిచిపోయినట్టు ఆమెకేసే చూస్తున్నారు. ఆమె పెదాలు మీద మాత్రం చిరునవ్వు అలాగే ఉంది.

ఎంతోసేపటి తర్వాత సుధాకర్ "జ్యోతీ...! నీకూ... నువ్వు..." ఏమడగాలో అర్థం కాలేదు. "నేనసలు ఊహించలేదు" అన్నాడు.

"ప్రతి మనిషి జీవితంలోనూ, ఎదుటివారి ఊహకందని విషయాలు చాలా ఉంటాయి" ! జ్యోతి ఈసారి కాస్త పెద్దగానే నవ్వింది. ఆమె ఆ వాతావరణాన్ని తేలిక పరచడానికి అలా చేస్తోందని వారిద్దరికీ అర్థమయింది. తాముకూడా ఆవిషయం గురించి మరీ గుచ్చి గుచ్చి ప్రశ్నించి ఆమె మూడ్ చెడగొట్టడం ఎందుకనిపించింది. తనే మరెప్పుడయినా ఆ వివరాలన్నీ చెబుతుంది.

"ఎనీ హౌ! ఆదివారం మీరు మా ఇంటికొస్తున్నారు. అంతే కదక్కా? " అంది నాగమణి.

"అలాగే! తప్పకుండా వస్తాను"

"ఇక మేం బయలుదేరుతాం జ్యోతీ" సుధాకర్ చెప్పాడు.

ఆమె తలూపాక చెప్పింది. "రేపో, ఎల్లుండో ఒకసారి హాస్పిటల్‌కి వస్తే, మీ కేసు గురించి పూర్తి వివరాలు చెబుతాను"

"అలాగే"

ఆమె వారిద్దరి వెనకా వీధిగేటు వరకూ నడిచింది.

సుధాకర్ స్కూటర్ లాక్‌తీసి స్టార్ట్ చేశాక అన్నాడు "గుడ్‌నైట్ జ్యోతీ"

"గుడ్‌నైట్" చెప్పిందామె. నాగమణి సర్దుకు కూర్చుని, "ఉంటానక్కా" అనగానే స్కూటర్ ముందుకు సాగింది. జ్యోతి చిరునవ్వుతో చెయ్యి ఊపింది.

యశోదమ్మ, నాగమణి, సుధాకర్‌లు భోంచేస్తూ ఉన్నారు. జ్యోతి ఇంటికి వెళ్ళొచ్చాక అక్కడ జరిగిన విషయాలన్నీ సుధాకర్ చెబుతున్నాడు.

"అయ్యో! ఆ పిల్ల బ్రతుకు అలా అయిందట్రా!"

"అవునమ్మా"

"ఏమిటోరా! ఈ ప్రపంచంలో ఎవరికి, ఏది, ఎలా జరుగుతుందో ఏమీ చెప్పలేం! ఆ పిల్ల ఎంత బాగుంటుందో నాకు తెలుసు. శంకర్రెడ్డి ఆ అమ్మాయిని ఎంత గారాబంగా పెంచాడో కూడా తెలుసు. డాక్టర్ కోర్స్ చదివించడమంటే మాటలు కాదు. లక్షలే ఖర్చుపెట్టి ఉంటాడు. అమ్మాయి కూడా తెలివైనదే అనుకోవాలి! లేకపోతే డబ్బు ఖర్చుచేసినంత మాత్రాన డాక్టరయి పోదుకదా?... పాపం! ఇన్ని అదృష్టాలున్న పిల్లకు, మొగుడితో కాపురం చేసే అదృష్టం లేకుండా పోయింది. జీవితమంటే ఇదేనేమో...!"

భోజనాలు పూర్తయ్యాయి.

సుధాకర్, నాగమణి తమ బెడ్‌రూంలో కెళ్ళిపోయారు.







ఎలక్ట్రానిక్ బోర్డుమీద టోకెన్ నెంబర్ నొక్కి, టోకెన్ కోసం చెయ్యి చాపాడు సుధాకర్.

టోకెన్ ఇచ్చిన వ్యక్తి ముఖం చూడకుండానే, టోకెన్ తీసుకుని వందరూపాయల నోట్లకట్టలు అందిస్తుండగా ఎదుటి వ్యక్తి మెల్లగా అన్నాడు "సుధా"

అతడు చప్పున తలెత్తి చూశాడు. ఆ వ్యక్తిని గుర్తుపట్టడంతోనే అతడి ముఖంలో ఆనందం కదలాడింది.

"రేయ్ మురళీ..."

"యస్! మురళీనే" అన్నాడా వ్యక్తి నవ్వుతూ

"లోపలికిరా" సుధాకర్ అతడికి చుట్టూ తిరిగి వచ్చే దారి చూపించాడు. "అలాగే" అంటూ మురళీ అటువైపు నడిచాడు.

సుధాకర్ ఇంకా ఇవ్వవలసిన టోకెన్లేమయినా ఉన్నాయా అని చూశాడు. ఏమీ లేవు. బహుశ మురళిదే ఆఖరు టోకెన్ అయి ఉంటుంది. బిజినెస్ టైం ఇంకా ఐదు నిమిషాలు మాత్రమే ఉంది. అతడు కేష్‌బాక్స్‌కి తాళం వేసి, లేచి కాబిన్ బయటికి వచ్చి మళ్ళీ కాబిన్ డోర్‌కి తాళం వేశాడు. తాళాలు జేబులో వేసుకుంటూ మురళి వస్తున్నవైపు నడిచాడు.

ఇద్దరూ కరచాలనం చేసుకున్నాక స్టాఫ్ రూంలో చెరో కుర్చీలో కూర్చున్నారు.

"హైదరాబాద్ ఎప్పుడొచ్చావురా? " సుధాకర్ అడిగాడు.

"ఇక్కడ మా ఫ్యాక్టరీ బ్రాంచ్ ఓపెన్ చేసి రెండు నెలలయింది!"

"మరి రెండు నెలలుగా నాకు కనిపించకుండా ఎలా ఉన్నావ్?"

"నువ్వు హైదరాబాద్‌లో ఉన్నావని తెలుసు. కాని అడ్రస్ మిస్సయ్యాను. కనీసం ఈ బ్యాంక్‌లో జాబ్ చేస్తున్నావని కూడా నాకు తెలియదు. అప్పుడెప్పుడో ఫ్యాక్టరీ పేరు మీద అకౌంట్ ఓపెన్ చేసినప్పుడు వచ్చాను. అప్పుడు నువ్వు నాకు కనిపించ లేదు. బహుశ ఆరోజు శెలవు పెట్టి ఉంటావు. ఆ తర్వాత ఎప్పుడూ బ్యాంక్‌కి రాలేదు. మనిషి ద్వారా చెక్ ఇచ్చి పంపేవాడిని"

"అదన్నమాట సంగతి" అన్నాడు సుధాకర్. మురళి డిగ్రీలో తన క్లాస్‌మేట్. తను హైదరాబాద్ వచ్చేప్పుడే వాళ్ళ డాడీ విజయవాడలో ఆటోమోబైల్‌కి సంబంధించిన ఓ స్మాల్ స్కేల్ ఇండస్ట్రీ స్టార్ట్ చేశాడు. అప్పుడే ఆ బిజినెస్ పెంచి హైదరాబాద్‌లో దాని బ్రాంచ్ స్టార్ట్ చేయాలని మురళి తనతో చెప్పేవాడు. ఇంత కాలానికి అది సాధ్యపడిందన్న మాట!

"ఇప్పుడెక్కడుంటున్నావ్? "

"ఆఫీస్ ఇక్కడే- ఉస్మాన్ గంజ్‌లో"

"మరి ఫ్యామిలీ? "

"నేనుండేది లకడీకాపూల్‌లో....! బస్టాప్ ఆపోజిట్ స్ట్రీట్‌లో ఉన్న అరుంధతి అపార్ట్‌మెంట్స్‌లో ఉంది నా ఫ్లాట్" నవ్వుతూనే బదులిచ్చాడు మురళి.

"అయితే నేను ఐదింటికి మీ ఆఫీసుకి వస్తాను. ఇద్దరం కలిసి ఇంటికెళ్దాం"

"అలాగే" మురళి విజిటింగ్ కార్డు తీసి అతడికి అందించాడు. "వెళ్ళొస్తాను. ఐదింటికి ఆఫీసులో నీకోసం ఎదురు చూస్తూ ఉంటాను. మిస్ చేయకు"

"ఇంతకాలానికి కలిసాక చెప్పుకోవలసిన విషయాలెన్నో ఉన్నాక రాకుండా పోవడమే మిత్రా బాబు! ఎప్పుడెప్పుడు ఐదు అవుతుందా అని ఎదురుచూడడమే నాపని"

మురళి నవ్వి, వెళ్ళిపోయాడు.

బ్యాంక్ అవర్స్ పూర్తయ్యాక సుధాకర్ చాలా హుషారుగా ఉస్మాన్‌గంజ్ వైపు వెళ్ళాడు.

అడ్రసు పట్టుకుని ఆఫీసు వెతుక్కుని వెళ్ళే సరికి మురళి తనకోసమే ఎదురుచూస్తున్నట్లు కనిపించాడు. తనను చూడడంతోనే అతడు మేనేజర్‌లా కనిపించే వ్యక్తికి ఏదో చెప్పి తనవెంట బయటకు నడిచాడు.

మురళి పార్కింగ్ ప్లేస్‌లో ఉన్న కారు వైపు నడుస్తుంటే "ఏమిటీ కారు కొత్తగా ఉంది. ఈ మధ్యే కొన్నావా? " అడిగాడు సుధాకర్.

"అవును. ఇద్దరం కారులో ఇంటికెళదామా? "

"మరి నా స్కూటర్...? "

మురళి రెండు సెకన్లు ఆలోచించాక చెప్పాడు "సరేలే" రేపు ఉదయం ఆఫీసుకి ఆటోలో వస్తాను. పదా వెళ్దాం"

సుధాకర్ స్కూటర్ స్టార్ట్ చేశాడు. మురళి వెనక కూర్చున్నాడు.

"చెప్పరా! ఏమిటి విశేషాలు? "

"ఏమున్నాయ్! నేను ఈ బిజినెస్ పనుల్లో బిజీగా వున్నాను".

"బిజినెస్ అంటేనే బిజీ, జాబ్ అంటే రిలాక్స్ అని అందరికీ తెలిసిందే. నువ్వేం చెప్పక్కర్లేదు... అది సరే! బెజవాడలో మన వాళ్ళంతా ఎలా ఉన్నారు? "

"ఎవరి పనుల్లో వాళ్ళు లీనమయిపోయి, మిత్రులంతా తరచుగా కలుసుకోవడం తగ్గిపోయిందిరా. ఏదేమయినా ఒక వయసు వచ్చాక ఫ్రెండ్‌షిప్‌లో దగ్గరితనం కుదరదేమో! ఏమంటావ్? "

"అదీ నిజమే" అన్నాడు సుధాకర్. "నేను చూడు! ఎప్పుడయినా బెజవాడొస్తే మన వాళ్ళందరినీ కలవాలనే ఉంటుంది. కాని ఒక్కరోజు శెలవు పెట్టుకుని రావడం, లేదా అక్కడి బంధువుల ఇళ్ళలో ఇరుక్కుపోవడంతో ఏ ఒక్కర్నీ కలవడానికి వీలయ్యేది కాదు"

మరో ఐదు నిమిషాలలోనే స్కూటర్ అతడు చూపించిన అపార్ట్‌మెంట్ పార్కింగ్ ప్లేస్‌లో ఆగింది. ఇద్దరూ లిఫ్ట్‌లో పైకి వెళ్ళారు.

మురళి తన అపార్ట్‌మెంట్ తలుపు తీసిన తర్వాత ఇద్దరూ లోపలికి వెళ్ళారు. అడుగుపెట్టిన అరనిమిషంలోనే సుధాకర్‌కి అర్థమయిపోయింది.- అది ఫ్యామిలీ ఉంటున్న తీరు కాదు. బ్రహ్మచారి నివాసం.

ఇద్దరూ డ్రాయింగ్ రూమ్‌లోని సోఫాలో కూర్చున్నాకా సుధాకర్ అడిగాడు. "ఇంతకీ మీ ఫ్యామిలీని ఇక్కడకు తీసుకురాలేదా? "

"పెళ్ళే కాకపోతే, ఫ్యామిలీని ఎక్కడనుండి తీసుకురానురా బాబు" సన్నగా నవ్వుతూ చెప్పాడు మురళి.

సుధాకర్ అతడికేసి విచిత్రంగా చూశాడు. "ఇంకా... ఇంకా పెళ్ళి చేసుకోలేదా? ఎందుకని? "

"చేసుకోవాలనిపించలేదు. చేసుకోలేదు" ఈసారి అతడు మరికాస్త పెద్దగా నవ్వాడు.

సుధాకర్ అతడికేసి కొత్తగా చూస్తూనే ఆలోచించసాగాడు. తనకు తెలిసి కాలేజిలో లవ్ ఎఫైర్ లాంటిదేమీ లేదు ఇతగాడికి! సో! ప్రేమ విఫలమయి పెళ్ళి చేసుకోకపోవడం లాంటిది కాదనిపిస్తోంది. మరి వీడు పెళ్ళి చేసుకోకపోవడానికి కారణం?

"అప్పుడప్పుడు నువ్వు గుర్తుకొచ్చేవాడివిరా మురళీ! వీడింకా పెళ్ళి చేసుకోలేదా, లేక నాకు వెడ్డింగ్ కార్డ్ పంపడం మర్చిపో యాడా అనుకునేవాడిని. కాలం గడిచే కొద్దీ నువ్వు నన్ను మర్చిపోయి ఉంటావనే అను కున్నాను."

"అలాంటిదేం లేదు! బెజవాడలో నీ పెళ్ళికి అటెండ్ అయ్యాకా మళ్ళీ మనం కలు సుకునే అకేషన్ రాలేదు. అంతే! ఇంతకీ నీ సంగతి చెప్పు! మేరేజ్ లైఫ్ ఎలా ఉంది? పిల్లలెంతమంది?"

"మేరీడ్ లైఫ్ ఎక్సలెంట్‌గా ఉంది! కానీ... పిల్లలే... ఇంకా...!" ఆగిపోయాడు సుధాకర్.

"ఏమిట్రా నువ్ చెప్పేది? మీ పెళ్ళి జరిగి ఇప్పటికి ఏడేళ్ళవుతోంది. ఇంకా పిల్లలు లేకపోవడం ఏమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు మురళి.

"మొదట్లో మూడేళ్ళవరకూ మేమే వద్దను కున్నాం! కానీ ఆతర్వాత నాలుగేళ్ళు గడి చినా పిల్లలు పుట్టలేదు. ఇద్దరిలోనూ ఏలోపం లేదంటున్నారు డాక్టర్లు. అయినా అక్కడా ఇక్కడా చూపించుకుంటూనే ఉన్నాం. మొన్ననే ఓ ఫెర్టిలిటీ సెంటర్‌కి వెళ్ళాం"

"ఫెర్టిలిటీ సెంటరా? అంటే?"

సుధాకర్ మొత్తం కథంతా చెప్పాడు. చిన్ననాటి క్లాస్‌మేట్ జ్యోతి గురించి చెప్పి "ఆమె విడాకులెందుకు తీసుకుందో మాత్రం తెలియలేదురా" అన్నాడు.

"తెలియకపోతే ఇప్పుడొచ్చిన నష్టం ఏమీ లేదు కానీ, మీ ఆవిడని... అదే మా నాగ మణి చెల్లాయిని ఎప్పుడు చూపిస్తావ్?" అన్నాడు మురళి.

"ఎప్పుడో ఏమిట్రా! ఇప్పుడే వెళ్దాం పద!"

"ఇప్పుడు కాదులే మరోరోజు వెళదాం"

"ఎందుకని? పనేమన్నా ఉందా?"

"ఏంలేదు! చాలా కాలం తరువాత కలి సిన శుభసందర్భంగా చిన్న పార్టీ సెలబ్రేట్ చేసుకుంటే బాగుంటుందని! ఏమంటావ్?" సమాధానం కోసం ఎదురుచూడకుండానే ఫ్రిజ్ వైపు నడిచాడు మురళి.

★ ★ ★

పచ్చని పొలాలు...

చల్లని పైరగాలి...

ప్రకృతి కాంతను పలకరిస్తున్నట్టున్న పక్షుల కిలకిలారావాలు...

ఆ వాతావరణం అంటే శంకర్రెడ్డికి చాలా ఇష్టం. అంతకుమించి తను పుట్టి, పెరిగిన ఆ పల్లెటూరంటే మరింత ఇష్టం. కష్టపడే జీవులు, స్వచ్ఛమైన మనసులు, ఆరోగ్యా న్నిచ్చే ఆహార విహారాలు... ఎంతయినా పల్లెటూరి బతుకుల్లో పరిపూర్ణత ఉంది అని ఆయన అనుకుంటూ ఉంటాడు.

అయితే కొద్దికాలం క్రితం ఆ పరిపూర్ణ తను గుర్తించకుండా వేసిన చిన్న తప్పట డుగు జీవితాంతం తనను బాధపెడుతూనే ఉంటుందని ఆయనకు అనుభవం చెప్పిన సత్యం!

ఆయన గట్టుమీద నడుస్తూ, మోటారు పంపు దగ్గరకు వెళ్లాడు. కాల్వ మళ్లిస్తున్న సింగరయ్య తలెత్తి ఆయనకేసి చూసి "అయ్యగారూ! మెట్టపొలానికి నీళ్లు మళ్లి స్తున్నా" చెప్పాడు.

"మళ్లించరా" అన్నాడాయన.

పొలమంతా ఓసారి తిరిగి చూసుకు న్నాక, ఆయన తిరిగి సింగరయ్య దగ్గరగా వచ్చాడు.

"సింగా! నేను ఇంటికెళ్తున్నానురా" అన్నాడు.

"వెళ్లిరండయ్యా"

"నువ్వూ ఓ గంట ఉండి వచ్చెయ్యి. మోటారు ఆపొద్దు. ఎలాగూ కరెంట్ కోతనే

కాబట్టి అదే ఆగిపోతుందిలే"

"అలాగేనయ్యా"

శంకర్రెడ్డి పొలం వదిలి ఊరు వైపు నడకసాగించాడు.

పది నిమిషాలలో ఆయన ఇంటికి చేరుకున్నాడు. పని పిల్ల మంగి ఆయనకు నీళ్ల చెంబు అందించింది. ఆయన నీళ్లు కాళ్ల మీద పోసుకుని ఇంట్లోకి వెళ్లాడు.

సాధారణంగా తను వస్తున్న అలికిడి వినిపించడంతోనే ఇంట్లో ఎక్కడున్నా హాలులోకి వస్తుంది తన భార్య కామాక్షి. మంచి నీళ్ల గ్లాసు చేతికి అందించి, ఒద్దికగా ఒరిగి నిలబడి 'ఇంకేమయినా కావాలా?' అన్నట్టు ముఖంలోకి చూస్తుంది.

ఆయన అటు ఇటు చూశాడు, బహుశా పెరట్లో ఉండి ఉండొచ్చేమో అనుకుంటూ. అక్కడే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు అలసటగా.

పది నిమిషాలు గడిచాయి.

కామాక్షి జాడలేదు.

ఆయన పైకిలేచి మెల్లగా పెరట్లోకి వెళ్లాడు. అక్కడ కూడా కామాక్షి కనిపించలేదు. "ఎక్కడి కెళ్లిందబ్బా?" అనుకుంటూ పడకగదివైపు వచ్చి తొంగి చూస్తే, కనిపించిన దృశ్యం అతడి భృకుటి ముడివడేలా చేసింది.

ఎంత అనారోగ్యమైనప్పటికీ, సంధ్యవేళ పడక ఎక్కే అలవాటు ఆమెకు లేదు. అలాంటి ఆమె ఆ సంధ్యవేళ పడక చేరడం ఆయనకు ఆశ్చర్యమనిపించింది.

ఆయన కాస్త కంగారుగానే లోపలికెళ్లి ఆమె భుజం మీద చెయ్యివేస్తూ "కామాక్షీ!" అన్నాడు ఆప్యాయంగా

ఆమె ఉలిక్కిపడ్డట్టు పక్కకు తిరిగి, కంట నీరు ఆయన కంట పడనివ్వకుండా ప్రయత్నిస్తూ "మీరు... మీరు ఎప్పుడొచ్చారు?" అంది.

"పది నిమిషాలయింది..." అంటూనే, ఆయన ఆమె ముఖంలోనికి చూసి "... ఏమయింది.. ఏమయింది కామాక్షీ? ఎందుకేడుస్తున్నావ్?" కంగారుగా అడిగాడు.

ఆమె మంచం దిగింది. "ఏం లేదులెండి. ఏదో కంట్లో నలక పడితేనూ..." సర్ది చెప్పబోయింది.

ఆ స్థితిలోనూ ఆయన అదోలా నవ్వాడు. "కంట్లో నలకపడితే గొంతులో మార్పెందుకొస్తుంది? నన్ను చూసి కంగారు పడవలసిన అవసరం ఏముంది?"

ఆమె పెదవులు బిగపట్టింది.

ఈసారి ఆయన అనునయంగా అడిగాడు, "చెప్పు కామాక్షీ! ఏం జరిగింది?"

"గంట క్రితం పంకజం మనింటికి వచ్చిందండీ"

"ఏదీ... ఎదురింటి పంకజమా?" అడిగాడు ఆయన.

"ఆఁ! తనే"

"వస్తే ఏమయింది?"

"మన జ్యోతిని గుర్తు చేసిందండీ"

"ఏమిటట?"

"అదేనండీ.. జ్యోతి భర్తనుండి విడాకులు తీసేసుకుందికదా! మరి భవిష్యత్తేమిటి? అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది. మన మ్మాయి గురించి మనకు లేని ఆసక్తి తనకెందుకో? సరే! ఆ ప్రశ్నలతో సరిపెట్టుకుంటే ఫర్వాలేదు. వాళ్ల బంధువులమ్మాయి ఎవరో ఇలాగే భర్తనుండి విడిపోయాక, మరో పెళ్లి చేసుకోకుండానే బిడ్డ తల్లి అయిందట... అలా అంటూనే అయినా మీ అమ్మాయికి ఎలాగూ తల్లి అయ్యే అవకాశం లేదుకదా అంటూ వ్యంగ్యంగా నవ్వింది..." అప్పటికే కామాక్షమ్మ గొంతు జీరబోయింది.




శంకర్రెడ్డి పెదవులు బిగబట్టి కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాడు. చెప్పడం అయ్యాక భర్త ముఖంలోకి చూసిన కామాక్షికి ఆయన బాధ దిగమింగుకోవడం కనిపించింది. ఆ స్థితిలో ఆయనను చూస్తే ఆమెకూ జాలి కలిగింది. ఛీఛీ పొలంనుండి రాగానే బాధలు బయటపెట్టి ఆయనను బాధపెట్టకుండా ఉండాల్సింది. ఆమె మనసులోనే అనుకుంది.

"తన మాటలకేంగానీ.. మీరు కూర్చోండి. మంచి నీళ్ల పట్టుకొస్తాను" ఆమె వడివడిగా పడకగదిలో నుండి బయటకు నడిచింది.

ఆమె మంచినీళ్ల గ్లాసుతో తిరిగి లోపలికి వచ్చేసరికి ఆయన పట్టెమంచం మీద కూర్చుని ఇంటిపైకప్పుకేసి తదేకంగా చూస్తున్నాడు.

"తీసుకోండి" ఆమె మంచినీళ్ల గ్లాసు అందిస్తుంటే ఆయన నిశ్శబ్దంగానే అందుకున్నాడు. ఆయన మంచినీళ్లు తాగాక మరో ఐదు నిముషాలు మౌనంగా ఉండిపోయేసరికి ఆమే అంది. "పోనీలెండి! లోకులు కాకులు. ఏవేవో అనుకుంటూ ఉంటారు. మనం వాటిని పట్టించుకోకూడదు. పట్టించుకుంటే అసలు బతకలేం"

ఆయన తలవూపి కొద్ది క్షణాలు భార్యకేసి తదేకంగా చూశాడు. "లోకులు అన్నారని కాకపోయినా జ్యోతి విషయం మనం పూర్తిగా మరచిపోతున్నామేమో అనిపిస్తోంది కామాక్షీ! తన దురదృష్టం.. కట్టుకున్నవాడు విడాకులిచ్చాడు. అంతమాత్రాన అసలు జీవితమే లేదనుకుని అలాగే ఒంటరిగా బతకడం ఎంతవరకూ సబబు? కనీసం మనమైనా ఈ విషయంలో తనను బలవంతపెట్టక పోవడం మన తప్పేకదా కామాక్షీ? "

ఆమె మాత్రం నిరాశగానే పలికింది "తనను బలవంతపెట్టొచ్చు కానీ దానివల్ల ఒరిగేదే ముంటుందండీ? "

అప్పుడే ఆ అనుమానం తనకూ వచ్చినట్టు ఆయన పెదవులు బిగపట్టారు. "నిజమే! జ్యోతిని మళ్లీ పెళ్లి చేసుకోమని బలవంతపెట్టినా ప్రయోజనం ఏముంటుంది? తల్లి కాలేని స్త్రీని తెలిసి తెలిసీ ఇల్లాలుగా చేసుకునేందుకు ఈ ప్రపంచంలో ఏ మగాడయినా ముందుకొస్తాడా? "

ఆయనకు ఒంట్లోని శక్తినంతా ఏ అదృశ్య శక్తో హరించివేసినట్టు చాలా నీరసంగా అనిపించింది. ఇక పడక గదిలో ఉండలేనట్టు నెమ్మదిగా లేచి బయటకు నడిచాడు.

హాలులో నుండి వరండావైపు నడుస్తున్న ఆయనకేసి కొద్ది సెకన్లు అలాగే చూసి వంటగదివైపు నడిచింది కామాక్షి ఆయనకు కాఫీ అందించాలనుకుంటూ.

శంకర్రెడ్డి వరండాలో ఉన్న వాలుకుర్చీలో కూర్చున్నాడు.

శంకర్రెడ్డి కాఫీ తాగుతూ ఉంటే వీధిగేటు తెరుచుకుని సుబ్బారాయుడు లోపలికి రావడం కనిపించింది.

సుబ్బారాయుడు శంకర్రెడ్డికి చిన్ననాటి స్నేహితుడు. వారిద్దరికీ మధ్య కష్టసుఖాలు చెప్పుకునేంత అభిమానం, ఆప్యాయతలున్నాయి.

శంకర్రెడ్డి సుబ్బారాయుడిని చూడడంతోనే ఇంట్లోకి తొంగిచూసి అరిచాడు. "కామాక్షీ! రాయుడు వచ్చాడు. మరో కాఫీ పట్రా"

"ఆ! తెస్తున్నానండీ" ఆమె వంట గది లోంచి అరిచింది.

సుబ్బారాయుడు వరండాలోకొచ్చి వాలు కుర్చీ పక్కనే ఉన్న మరకొయ్య కుర్చీలో కూర్చున్నాడు.

"ఏంటోయ్ విశేషాలు" అడిగాడు.

"ఏమున్నాయ్! ఇప్పుడే పొలం నుండి వచ్చాను. నేను వచ్చేటప్పటికే మీ చెల్లెమ్మ



మంచమెక్కి ఏడుస్తూ ఉంది"

"ఎందుకు?" సుబ్బారాయుడు ఆశ్చర్యంగా ఆయనకేసి చూశాడు.

ఆయన కొద్దిక్షణాలు తటపటాయించాక దాచిపెట్టుకోవలసింది ఏమీలేనట్టు చిన్నగా నిట్టూర్చి చెప్పాడు. "ఇదిగో ఆ ఎదురింట్లో వీర్రాజు కోడలు పంకజం ఉందిచూడు, దాని నోటికి తాళం ఉండదు. అసలు ఏవిషయం మాట్లాడొచ్చో ఏం మాట్లాడకూడదో అర్థం కాదేమో. మధ్యాహ్నం అది ఈ ఇంటికొచ్చి మాట్లాడిన మాటలకు మీ చెల్లెలు బాధపడి, ఆపై బెంగపడి సంధ్యవేళ ఏడుస్తూ కూర్చుంది. ఏదో నేనొచ్చాక మనసు కుదుటపరచుకుందనుకో"

"పంకజం ఏమంది?"

శంకర్రెడ్డి పంకజం అన్న మాటల గురించి మిత్రుడికి చెప్పాడు.

"జ్యోతి గురించి పంకజం అలా అన్నదని బాధపడుతున్నాంగానీ, బాధపడి మాత్రం చేయగలిగిందేముందని. ఆ తర్వాత నాకూ అర్థమయిందిరా... అంత చదువు చదివి ఎంతో సంపాదిస్తూ కూడా దాని బతుకు బండలయిపోయింది"

"అలా ఎందుకనుకుంటున్నావ్?" వెంటనే ప్రశ్నించాడు సుబ్బారాయుడు.

"ఎందుకనుకోవడం ఏమిట్రా?" అని ఆగి మిత్రుడికేసి అదోలా చూసి "మన జ్యోతి గురించి నీకు తెలిసిందేకదరా? అలాంటి ఆడపిల్ల బతుకు ఎలా బాగుపడుతుంది?" ప్రశ్నించాడు.

"మనసుంటే మార్గాలు లేకపోవు. మనం కాస్త సర్దుకు పోదలచుకుంటే బతుకు మళ్లీ చిగురించే అవకాశం ఉంది"

"అంటే?" ఆశగా చూశాడు శంకర్రెడ్డి.

సుబ్బారాయుడు కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాడు.

"చెప్పరా" రెట్టించాడు శంకర్రెడ్డి.

"అదే... ఒరేయ్ శంకరం! మన జ్యోతికి సంతానయోగం లేదు. అందులోనూ విడాకులు తీసుకుంది. ఆ కారణాలవలన తనను మొదటి భార్యగా స్వీకరించేందుకు ఏ మగాడూ రాకపోవచ్చు కానీ..."

ఆయన ఆగి గాఢంగా ఊపిరి పీల్చుకున్నాడు, "పెళ్లయి పిల్లలున్న, భార్యను కోల్పోయిన మగాడెవరైనా జ్యోతిలాంటి పిల్లను పెళ్లి చేసుకునేందుకు ముందుకు రావచ్చు" ముగించాడు సుబ్బారాయుడు.

"నేనూ అదే అనుకుంటున్నాను. పోనీ నీ ఎరికలో అలాంటి సంబంధం ఏదయినా ఉంటే చూడరా రాయుడూ!"

సుబ్బారాయుడు సాలోచనగా తల ఊపాడు.

"అలాంటి సంబంధం ఒకటుందిరా! కుర్రాడు కూడా డాక్టరే! తనకూ పిల్లలున్నారు. భార్య ప్రమాదవశాత్తు మరణించింది" చెప్పాడు.

శంకర్రెడ్డి మౌనంగా ఉన్నాడు. అంతలో కామాక్షమ్మ కాఫీ గ్లాసుతో అక్కడికి వచ్చింది.

"బాగున్నావా చెల్లెమ్మా!" అడిగాడు సుబ్బారాయుడు.

"బాగున్నానన్నయ్యగారు! ఈమధ్య ఇటు రావడమే మానేశారే" అంటూ కాఫీ గ్లాసు అందించింది.

"ఏవో పనులు చెల్లెమ్మా! అసలు తీరికే ఉండడంలేదు" చెప్పాడు సుబ్బారాయుడు.

శంకర్రెడ్డి భార్యకేసి చూశాడు. మిత్రుడు చెప్పిన విషయం ఆమెకు తెలియజేసి అభిప్రాయం కనుక్కోవడం అవసరమనిపించిందేమో,

"కామాక్షీ! మీ అన్నయ్య ఓ సంబంధం గురించి చెబుతున్నాడే!" అన్నాడు.

"సంబంధమా? ఎవరికి?"




# ఏరిన ముత్యాలు

★ డబ్బు కూడబెట్టడమనే తపన తగ్గి సామాన్యులకు, శ్రామికులకు కనీస సదుపాయాలు కల్గించాలి.

-గాంధీజీ

★ భాష అనేది ఒక అద్భుతమైన పరికరం. అది మన మనోభావాలు చెప్పగలదు. దాచగలదు. వక్రీకరింపజేయగలదు.

-మార్టిన్

★ నేర్చుకుని కూడా తన పాండిత్యాన్ని ఉపయోగించనివాడు పుస్తకాల బరువుతో వున్న ఒక భారమైన మృగంవంటివాడు.

-సాది

★ విలాసం లేని వ్యక్తి దేశ దిమ్మరి. కాని రెండు విలాసాలున్న వ్యక్తి మాత్రం చెడునడత గలవాడు.

-బెర్నార్డ్‌షా:

★ఆలోచన కన్నా ప్రపంచంలో ఎక్కువ విలువకలది మరేదీ లేదు.

-రస్సెల్

★ ఎవరూ నిన్ను ప్రేమించకపోతే నిశ్చయంగా అది నీ తప్పే.

-డాడ్రిడ్జ్

★ మనసులోని ప్రేమను, మొహంమీది పుట్టుమచ్చను దాయటం కష్టం.

-జార్జి సెగల్

★ ప్రేమ అనేది చినుకులా రావాలి. నదిలా పొంగాలి.

-ఫార్మర్స్ ఆఫ్ దునాకి

★ తన మనసుకు స్వేచ్ఛ ఇవ్వడానికే కళాకారుడు సృష్టికర్త అవుతున్నాడు. కళాకారుడు ఒక్కడే ప్రపంచంలో స్వేచ్ఛాజీవి.

-మాయ్

★ శాస్త్రం అనేది అన్నింటిని గురించి మొదటి మాట మాత్రం చెబుతుంది. అంతేకాని దేనిని గురించి కూడా చివరి మాట చెప్పదు.

-విక్టర్ హ్యూగో

★ జాగరూకత వివేకపు జ్యేష్ఠ సంతానం.

-విక్టర్ హ్యూగో

★ ఇతరుల మీద నమ్మకం కుదరాలంటే సహనం ఉండాలి.

-డొనాల్డ్

సేకరణ: **పట్నం శేషంశెట్టి**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఫిబ్రవరి చతుర నవల మాతృత్వం

.................................................

సమీక్షకుని పేరు : .................................................

చిరునామా : .................................................

.................................................

.................................................

.................................................

"ఇంకెవరికమ్మా! మన జ్యోతికే" సుబ్బారాయుడు చెప్పాడు.

"జ్యోతికా? "

ఆమె ఆశ్చర్యానికి ఫుల్‌స్టాప్ పెట్టాలన్నట్టు శంకర్రెడ్డి మిత్రుడు చెప్పిన విషయాలన్నీ ఆమెకు వివరించి చెప్పాడు.

అంతా విన్నాక కామాక్షమ్మ చెప్పింది, "ఇదేదో బాగానే ఉంది. అయినా ముందుగా అమ్మాయి అభిప్రాయం కనుక్కోవడం మంచిదేమో? "

శంకర్రెడ్డి తలాడించి "అదీ నిజమే! అయితే నేను రెండు మూడు రోజుల్లో హైదరాబాద్ వెళ్తాను" అన్నాడు.

కామాక్షమ్మ లోపలికి వెళ్లిపోయింది.

శంకర్రెడ్డి గాఢంగా నిశ్వసిస్తూ, "సరేరా! వీలయినంత త్వరలో మనం ఆ కుర్రాడిని కూడా చూసి వద్దాం" అన్నాడు.

"అలాగే వెళ్దాం" చెప్పాడు సుబ్బారాయుడు.



కాలింగ్‌బెల్ చప్పుడు చేయడంతో జ్యోతికి మెలుకువవచ్చింది. బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ లేచింది. టైమ్ చూస్తే ఆరు గంటలే అయింది. ఇంత ఉదయాన్నే ఎవరొచ్చారబ్బా! అనుకుంటూ బెడ్‌దిగి తలుపు దగ్గరగా వెళ్లింది. తలుపు తీయడంతోనే కనిపించాడు శంకర్రెడ్డి.

ఆమె ముఖం ఒక్కసారిగా ట్యూబ్‌లైట్‌లా వెలిగిపోయింది. "నాన్నా" అంది సంబరంగా

శంకర్రెడ్డి ఆమెను తప్పించుకుని లోపలికి వచ్చాడు. ఆమె అతడి చేతిలోని సూట్‌కేస్ అందుకుంది. "కనీసం వస్తున్నట్టు ఫోన్ లేదు. ఏమిటీ హఠాత్ దర్శనం నాన్నా? " ఆమె అతడి భుజం మీద చెయ్యివేసి తల భుజానికి ఆన్చింది.

ఆయన కూతురి తలమీద ఆప్యాయంగా చెయ్యివేసి నిమిరాడు. "నిన్నటికినిన్నే నిన్ను చూడాలనిపించింది. ఫోన్ చేద్దామంటే అక్కడ లైన్లు పాడయ్యాయన్నారు. సాయంత్రమే బయలుదేరి తెల్లారేసరికి ఇక్కడున్నాను"

అసలు విషయం అది అయి ఉండదని ఆమెకు తెలుసు. ఏదో పని లేకపోతే ఆయన అంత హఠాత్తుగా రాడని ఆమెకు తెలుసు.

ఆయన సోఫాలో కూర్చున్నాక, ఆమె సోఫా వెనుక చేరి ఆయన మెడ చుట్టూ చేతులేసి "అమ్మ ఎలా ఉంది? "

"బాగుందమ్మా"

"నాన్నా! మీరింకా అక్కడ ఎందుకు? వచ్చేయకూడదూ? "

"వచ్చేస్తాంలేమ్మా" ఆయన ఆమె భుజం మీద తట్టాడు. "అక్కడి పొలాలు, ఇల్లూ ఇప్పుడే వదిలేయడం ఎందుకు? ఉన్న ఊరు, నమ్ముకున్న భూమి అప్పుడే వదలాలనిపించడంలేదు. ముసలితనంలో ఏమీ చేయలేని పరిస్థితివస్తే అప్పుడు నీ దగ్గరకు రాక మరెక్కడికెళ్తాం? "

"సరే, వెళ్లి ముందు ముఖం కడుక్కుని రండి. కాఫీ తాగుదాం"

"మాలా! తొందరగా కాఫీ కలిపెయ్యవే!" అంది జ్యోతి.

"అలాగేనమ్మా" అంటూ మాల లోపలికెళ్లాక జ్యోతి అదే చోట కూర్చుని తండ్రి ఎందుకు వచ్చివుంటాడో ఆలోచించసాగింది. ఏమీ తోచడంలేదు. అలాగే లేచి వాష్‌బేసిన్ దగ్గరకు వెళ్లి బ్రష్ తీసుకుని పేస్ట్ వేసుకుంది.

కాఫీ తాగుతుండగా ఆయనే తను వచ్చిన విషయం మెల్లగా చెప్పాడు. "మన ఇంటి పక్కన సుబ్బారాయుడు లేడూ...

ఆయన... ఆయనో మాట చెప్పారమ్మా"

"ఏం మాట?" అడిగింది జ్యోతి.

"అది గుంటూరులో ఓ డాక్టరున్నాడట. ఆయనకు పెళ్లయింది. ఇద్దరు పిల్లలు కూడా. అయితే ఆమె ఈమధ్యనే కారు యాక్సిడెంట్‌లో చనిపోయింది"

ఆమెకు అర్థమయిపోయింది ఆయన ఈసారి ఏ ప్రపోజల్‌తో వచ్చాడో.

"నాన్నా!" చాలా సేపటి తర్వాత అందామె.

"వద్దమ్మా... వెంటనే... వెంటనే నువ్వేం నిర్ణయం చెప్పనవసరంలేదు. నేను మరో రెండు రోజులు ఉంటాను. నేను వెళ్లే ముందు నీ నిర్ణయం చెప్పినా చాలమ్మా!"

ఈసారి ఆమె మెల్లగా తలాడించింది. తన మనసులోని అభిప్రాయం వెంటనే చెప్పేసి, ఆయనను వెంటనే నిరుత్సాహపర చడం ఆమెకిష్టంలేదు. ఓ రెండు రోజులు వ్యవధి తీసుకుంటే తనేదో లోతుగా ఆలో చించిందన్న భ్రమ ఆయనకు కలుగు తుంది. కన్నతండ్రి రెండురోజులపాటు ఆనందంగా ఉండడం కోసం ఆయనను ఆమాత్రం భ్రమలో ఉంచడం తప్పుకాదు.

"అలాగే నాన్నా" అందామె.

ఆయన మౌనంగా ఉండిపోయాడు. కన్న కూతురి బతుకు ఊహించని మలుపు తిరి గితే, ఆ మలుపు ఆమె జీవితాన్ని దుఃఖ మయం చేస్తే కన్నతండ్రి ఆమె సమక్షంలో ఆనందంగా గడపలేడు.

"చెప్పండి నాన్నా! ఇంకా విశేషాలేంటి?"

"ఏమున్నాయమ్మా! అన్నీ మామూలే"

"వరినాట్లు అయిపోయాయా?"

"నాట్లు ఎప్పుడో అయిపోయాయి. అయితే ఈమధ్య వచ్చిన వరదల దెబ్బకు వరిపైరు బాగా నాశనమయింది. ఎకరానికి పుట్టెడు వడ్లయినా రాలతాయో లేదోనని అనుమానంగా ఉంది"

"ఈ దేశంలో రైతన్న పరిస్థితి ఎప్పుడూ ఘోరంగానే ఉంటోంది. ప్రభుత్వ విధానాలే కాదు, ప్రకృతి కూడా రైతుకే ద్రోహం చేస్తోంది. సరే నాన్నా! నేను స్నానం చేసి వస్తాను. ఈ రోజు కాస్త తొందరగా వెళ్లాల్సి ఉంది!" అంటూ జ్యోతి బాత్‌రూంకి వెళ్ల బోతూ "మాలా! రాత్రి వేయించిన పల్లీని మిక్సీలో వేసి చట్నీ చేసేయ్. నాన్నకు ఇడ్లీలో అది చాలా ఇష్టం" అంటూ కేకే సింది.

"అలాగేనమ్మా" అంది మాల కుక్కర్ లోంచి ఉడికిన ఇడ్లీల ప్లేట్లు బయటికి తీస్తూ.

శంకర్రెడ్డి కూడా స్నానం చేసి వచ్చేసరికి జ్యోతి డైనింగ్ టేబుల్‌మీద టిఫిన్ సిద్ధం చేసి ఎదురు చూస్తోంది. ఆయన కూర్చు న్నాక ప్లేట్లలో ఇడ్లీలు వడ్డిస్తూ చెప్పిందామె,

"నాన్నా! నేను హాస్పిటల్ నుండి వచ్చేస రికి ఆలస్యం కావచ్చు మీరు నా కోసం ఎదురు చూడకుండా భోజనం చేసేయండి"

"అలాగే లేమ్మా! నువ్వు మాత్రం వీలయి నంత త్వరగా వచ్చేయ్!"

"త్వరగా రావాలనే ఉంటుంది. కాని చివరి పేషెంట్‌వరకూ చూసి మరీ రావాలి కదా నాన్నా" చట్నీ వడ్డిస్తూ అంది.

టిఫిన్ తినడం పూర్తయ్యాక ఆమె కాఫీ అందించింది.

"నీకిష్టమైన కూరలేవో మాలతో చెప్పి చేయించుకో. సరిగ్గా టైంకి భోజనం చేసేయ్. మరి నేను వెళ్ళొస్తాను నాన్నా" కాఫీ తాగటం పూర్తయ్యాక చెప్పింది జ్యోతి.

ఆయన తలాడించాడు.

ఆమె ఇంట్లోంచి బయటకు నడుస్తుంటే, ఆయన అనుసరించాడు. మెట్లవరకూ వచ్చాక "ఇక మీరు ఉండండి నాన్నా" అంటూ జ్యోతి మెట్లు దిగింది.




పార్కింగ్ ప్లేస్‌లో తన కారు ఉన్నవైపు నడిచి, కీతో డోర్‌లాక్ తీసి డ్రైవింగ్ సీట్లో కూర్చుందామె. "నమస్తే మేమ్‌సాబ్" అంటూ వాచ్‌మెన్ ఆమెకి శల్యూట్ కొట్టి గేటు తెరిచేందుకు వెళ్ళాడు.

ఆ అపార్ట్‌మెంట్స్ ఆవరణలోంచి ఆమె కారు బయటపడి మెయిన్‌రోడ్‌మీదకి వచ్చే సరికి సమయం తొమ్మిది గంటలైంది.

రెడ్‌లైట్ పడడంతో ఆమె కారుని ఆపుచేసింది. గేర్ న్యూట్రల్ చేసి సీట్లో వెనక్కు వాలింది రిలాక్స్‌డ్‌గా. యధాలాపంగా తలతిప్పి అటుచూసి అదిరిపడింది.

సతీష్...!

తెల్లని మారుతి థౌజండ్ కారు. డ్రైవింగ్ సీట్లో కూర్చుని విలాసంగా సిగరెట్ పొగ రింగులుగా వదులుతున్నాడు. ఆమె చప్పున తల తిప్పుకోబోయింది. కాని అతడు అప్పటికే ఆమెను చూసేశాడు. వెంటనే పలకరింపుగా నవ్వాడు. తను నవ్వకూడదనుకుంది. కాని... అతడిమీద తనకు ద్వేషం, పగ, ప్రతీకారాల్లాంటివి లేవు. 'విధివశాత్తు' కొద్ది కాలంపాటు ఇద్దరూ కలిసి కాపురం చేయడం జరిగింది. విధి వక్రించాక విడిపోవడమూ జరిగింది. అంతే! తప్పొప్పుల గురించి అప్పుడే బేరీజు వేసుకుని ఘర్షణ పడ్డారిద్దరూ. విడిపోయి ఎవరికెవరో అయ్యాక పాతకాలం జ్ఞాపకాలు మనసులో ఉంచుకుని అతడిని శత్రువుగా చూడడం ఆమెకు ఇష్టంలేకపోయింది. అందుకే ఆమె కూడా పలకరింపుగా నవ్వింది.

అతడేదో మాట్లాడేందుకు నోరు తెరిచాడు. సరిగ్గా అప్పుడే రెడ్‌లైట్ ఆరిపోయి, గ్రీన్‌లైట్ వెలిగింది.

ఆమె అతడిమీదనుంచి చూపు మరల్చి, కారుని ముందుకు పోనిచ్చింది.

ట్రాఫిక్ దాటాక అతడు తన కారువైపు చూస్తూ, రోడ్డు అంచుకు వెళ్ళడం గమనించిందామె. కాని అతడికోసం తను ఆగదలచుకోలేదు. వ్యూమిర్రర్‌లోనుండి అతడి కారుని గమనిస్తూ ముందుకి సాగిపోయింది.

మరో పదినిముషాల తరువాత ఆమె కారు గాంధీ హాస్పిటల్ ముందు ఆగింది. ఆమె కారు దిగింది.

తన కన్సల్టింగ్ రూమ్‌వైపు నడవ సాగింది. నర్సులు, తెలిసిన పేషంట్స్ నమస్కరిస్తున్నారు.

ఆమె తన రూంలోకి వెళ్ళికూర్చుంది.

అవుట్ పేషంట్స్ కన్సల్టింగ్ రూమ్ అది.

అటెండర్ పేషంట్‌ని లోపలికి పంపాడు.

మొదటి పేషంట్ లోపలికి వస్తుంటే ఆమెకు నవ్వొచ్చింది. 'తను గైనకాలజిస్ట్. గర్భకోశ వ్యాధుల నిపుణురాలు. కాని విచిత్రంగా... తనకు మాత్రం... గర్భంలేదు'

పేషంట్ ఆమె ముందుకు వచ్చింది. స్టూలు చూపించాక కూర్చుంది. తన సమస్యలు చెప్పడం మొదలుపెట్టింది. డాక్టర్ జ్యోతి వింటూ ఉంది. ఆమె తన వృత్తిలో లీనమయిపోయింది. ఆ సమయంలో ఆమెకు ఈ ప్రపంచంలోని మరే విషయమూ గుర్తుకు రాదు.

★ ★ ★

మరో పావుగంటలో బ్యాంక్ క్లోజ్ అయిపోతుంది. స్టాఫ్ ఇళ్ళకెళ్ళే మూడ్‌లో ఉన్నారు.

సుధాకర్ తన ముందున్న లెడ్జర్‌బుక్స్ క్లోజ్ చేస్తుండగా అటెండర్ వచ్చి చెప్పాడు "సార్! మీకు ఫోన్"

అతడు బుక్స్ మూసేసి పక్కనపెట్టి, మేనేజర్ రూంలో కెళ్ళాడు. టేబుల్‌మీద పెట్టి ఉన్న రిసీవర్‌ని తీసుకుని "హలో" అన్నాడు.

"హలో సుధాకర్..."

ఆ కంఠం ఎవరిదో వెంటనే గుర్తుపట్టే శాడు. రిసీవర్ చుట్టూ చేతివేళ్లు బలంగా బిగుసుకున్నాయి. ఆనందోద్వేగం మనసులో నుండి పొంగుకొచ్చింది. జ్యోతి... జ్యోతి తన కోసం బ్యాంక్‌కి ఫోన్ చేయడమే మిటి?

"హలో! నేనే సుధాకర్‌ని"

"థ్యాంక్ గాడ్! నువ్వింకా బ్యాంక్‌లో ఉంటావో, ఉండవోననుకుంటూనే రింగ్ చేశాను. లక్కీగా దొరికావు" ఆమె సన్నగా నవ్వుతూ నిట్టూర్చిన ధ్వని.

"చెప్పు" అన్నాడతడు.

"ఏంలేదూ- నువ్విప్పుడు బ్యాంక్‌నుండి తిన్నగా ఇంటికే వెళ్తున్నావా? "

"అవును జ్యోతీ"

"అయితే నువ్విప్పుడు గాంధీ హాస్పిటల్ వరకూ రాగలవా? "

ఎందుకు అని ప్రశ్నించలేదు అతడు. "మరో పదిహేను నిమిషాలలో అక్కడ ఉంటాను" చెప్పాడు.

"గేటు ముందు వెయిట్ చేస్తుంటాను"

"అలాగే" అతడు ఫోన్ పెట్టేశాడు. మరో ఐదు నిమిషాలలో బ్యాంక్‌నుండి బయటికి వచ్చాడు. స్కూటర్ స్టార్ట్ చేసి హాస్పిటల్ వైపు పోనిచ్చాడు.

అతడు వెళ్ళేసరికి జ్యోతి గేటుదగ్గరే నిల బడి ఎదురుచూస్తోంది. అతడిని చూడడం తోనే ఆమె నవ్వింది. ఆమె ముందు స్కూటర్ ఆపాక అడిగాడు "ఏమిటి ఫోన్ చేశావ్? "

"ఏంలేదు! కాసేపు ప్రశాంతంగా ఎవరితో నైనా మాట్లాడదాం అనిపించింది. నువ్వు గుర్తుకు వచ్చావు... అది సరే... నీ పను ల్నేమీ డిస్టర్బ్ చేయడం లేదుకదా!" జ్యోతి అడిగింది.

"అబ్బే! వేరే పనులేం లేవు. ఒకవేళ ఉన్నా వాయిదా వేసేస్తాను. చిన్ననాటి స్నేహితురాలితో చాలాకాలం తరువాత ఒంటరిగా మాట్లాడే అవకాశం లభించింది. ముందు ఈ పని ముఖ్యం" అన్నాడు సుధా కర్ నవ్వుతూ.

"ఏదైనా రెస్టారెంట్ కెళ్దామా? "

"ష్యూర్" అంటూ సుధాకర్ స్టార్ట్ చేసే శాడు యథాలాపంగా. అయితే ఆమె వెనుక కూర్చోవాలి అనే ఊహరాగానే ఒక్కసారిగా టెన్షన్ ఫీలయ్యాడు. జ్యోతి మాత్రం ఎలాంటి తడబాటు లేకుండా స్కూటర్ వెనుక కూర్చుంది.

ఒక్కసారిగా గుండె ఆగి, తిరిగి కొట్టుకో వడం మొదలయినట్టుగా ఫీలయ్యాడు సుధా కర్. తన భార్యని కాకుండా పరాయిస్త్రీని స్కూటర్ వెనక కూర్చోబెట్టుకోవడం జీవి తంలో ఇదే మొదటిసారి. కానీ వెంటనే అతడు తన ఆలోచనల్ని అదుపులోకి తెచ్చు కున్నాడు.

"పోనివ్వు సుధాకర్"

అప్పుడే ఈ లోకంలోకి వచ్చినట్లుగా ఉలి క్కిపడి, గేర్ మార్చి స్కూటర్‌ని ముందుకి పోనిచ్చాడు.

మరో పదినిముషాలలో వైశ్రాయ్ హోట ల్ ముందు ఆగారు. కొద్దిగా మూలగా ఉన్న టేబుల్‌ని ఎన్నుకుని కూర్చున్నారు ఇద్దరూ. ఎక్కడినుంచో సన్నగా షెహనాయ్ వినిపి స్తోంది. వారిద్దరి మధ్య నిశ్శబ్దం కొద్దిక్ష ణాలు గాఢంగా ప్రవహించింది.

"మనం చాలాకాలం తర్వాత చాలా తమాషాగా కలుసుకున్నాంకదూ? " ఆ నిశ్శ బ్దాన్ని బ్రేక్ చేస్తూ అన్నాడతడు.

"అవునవును" అందామె.

"నేను మాత్రం మళ్ళీ నిన్ను చూడగలనని అనుకోలేదు. నిన్ను చూసిన క్షణం చాలా థ్రిల్ ఫీలయ్యాననుకో"




"నేనూ అంతే"

"... ... ... ..."

ఆమె ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నట్టు అతడూహించాడు. ఆమె అందుకోసం మెంటల్‌గా ప్రిపేరవుతున్నట్టుగా అతడికి తోచింది. తను డిస్టర్బ్ చేయడం ఇష్టం లేక పోయింది. అతడు మరికొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాడు.

చాలా సేపటి తర్వాత ఆమె అంది, "సుధాకర్! నేనిలా ఒంటరిగా ఎందుకున్నానో తెలియక నువ్వు తలబద్దలు కొట్టుకుంటున్నావనుకుంటాను? "

అతడు మెల్లగా తలాడించాడు. "నేను ఊహించుకున్న జ్యోతి వేరు. హఠాత్తుగా నా కంటబడిన జ్యోతి వేరు. మొదట నిన్ను డాక్టర్‌గా చూసి థ్రిల్ ఫీలయ్యాను. ఆ తర్వాత నువ్వు ఒంటిరిగా వుంటున్నట్టు తెలియడంతో షాక్ తిన్నాను" అతడు బలవంతంగా నవ్వాడు.

ఆమె నవ్వలేదు. అతడికేసి అదోలా చూసింది. "జీవితంలో మన కెరీర్‌ని మనం నిర్ణయించుకోగలమేమోగాని, పెళ్ళి, సంసార జీవితం అనేవాటిని మాత్రం వేరెవరో నిర్ణయం చేస్తారని నా జీవితం నాకు తెలియచేసింది"

అతడు ఆమెకేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"నీకు తెలిసే ఉంటుంది. నా తల్లిదండ్రులు నన్నెంత గారాబంగా చూసుకున్నారో. నేనడిగిందేదీ కాదనలేదు. ఎంతో ఖర్చుచేసి నన్ను మెడిసిన్ చదివించారు. నాన్నగారు నిర్ణయించిన సంబంధం అయినప్పటికీ నేను ఒప్పుకున్నాకే, నా అభిప్రాయం తెలుసుకున్నాకే సతీష్‌తో నా పెళ్లి జరిపించారు..." ఆమె చెప్పడం ఆపి అతడి ముఖంలోకి చూసింది.

అతడి కనుబొమ్మలు ముడిపడ్డాయి. అయితే జ్యోతి భర్త పేరు సతీష్ అన్న మాట మనసులోనే అనుకున్నాడతడు.

"... అతనూ డాక్టరే. నేనూ డాక్టర్నే. కానీ ఐదు లక్షలు కట్నం తీసుకున్నాడు. ఆ విషయంలో కూడా నేను ఫీల్ కాలేదు. అది లోకసహజం అనుకున్నాను. ఈ ప్రపంచంలోని ఏ వ్యక్తయినా ఉచితంగా డబ్బు వస్తుంటే మోకాలు అడ్డుపెట్టడనిపించింది. ఆ విషయాన్ని నేను స్పోర్టివ్‌గా తీసుకున్నాను. అలాంటి చాలా విషయాల్లో అతడితో అడ్జస్ట్ అవుతూనే ఆరేళ్లు కాపురం చేశాను. సిక్స్ ఇయర్స్..." ఆమె కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయింది.

ఆ కొద్దిక్షణాలు మౌనం భరించలేనట్టు సుధాకర్ ఆతృతగా ఏదో అడగబోయాడు. ఇంతలో వెయిటర్ రావడంతో ఆగిపోయాడు. ఇద్దరికీ చెరో మెనూ కార్డ్ ఇచ్చాడు వెయిటర్.

"ఆనియన్ దోసె" చెప్పాడు సుధాకర్.

"వెజిటబుల్ ఆమ్లెట్" చెప్పింది జ్యోతి.

వెయిటర్ నోట్ చేసుకుని, వినయంగా వంగి, వెనక్కి రెండడుగులు వేసి వెనుదిరిగి వెళ్ళిపోయాడు. అందుకోసమే వెయిట్ చేస్తున్నట్టుగా సుధాకర్ ముందుకు వంగి ఆసక్తిగా అడిగాడు "చెప్పుజ్యోతీ! ఆ తర్వాత ఏం జరిగింది? "

"డైవోర్స్ తీసేసుకున్నాం"

"ఎందుకు? " వెంటనే అడిగాడు.

"నాకు పిల్లలు పుట్టే అవకాశం లేదని"

అతడు అదిరిపడి "నీకు... నీకు పిల్లలు పుట్టే అవకాశం లేదా? " అడిగాడు.

"లేదు" ఆమె చాలా కామ్‌గా చెప్పింది. "చాలా... చాలా కొద్ది కేసుల్లో స్త్రీలలో గర్భాశయం చిన్నదిగా ఉంటుంది. అలాంటి అరుదయిన కేసుల్లో నాదొకటి.

అతడికేం మాట్లాడాలో అర్థం కాలేదు. అలాగే నోరు తెరుచుకుని ఉండిపోయాడు.



ఆమె బలవంతంగా నవ్వింది. "చాలా చిత్రంగా ఉందికదూ? నా చిన్ననాటి మిత్రుడి కుటుంబ సమస్య, నా సమస్య ఒక్కటే కావడం! దురదృష్టమేమిటంటే మేం విడిపోయాం! "

"మీరు... మీరిద్దరూ డాక్టర్లు. ఇంత చిన్న సమస్యను పరిష్కరించుకోలేక విడిపోయారా? ఎందుకు...ఎందుకిలా చేశారు? " అతడి గొంతులో వేదన ధ్వనించింది.

"నీకు చిన్న సమస్యగా అనిపించింది. కానీ నా భర్తకు మాత్రం పెద్ద సమస్యగా అనిపించింది. నేననుకోవడం ఏమిటంటే బహుశా నానుండి విడిపోవడానికే ఈ సమస్యను ఒక సాకుగా తీసుకున్నాడేమోనని"

"విడిపోవాలని ఎందుకనుకోవడం? "

"మగాడుకదా...? మరో పెళ్లి చేసుకోవచ్చునని! కొత్త భార్య, కొత్త అందాలు, కొత్త రుచులు... జీవితంలో మరోసారి ఓ థ్రిల్ అనుభవించొచ్చుకదా? " ఆమె క్షణమాగాక చెప్పింది. అవకాశం దొరికితే చాలు, చాలా మంది మగాళ్లు ఆడవాళ్లని మోసం చేయాలనే చూస్తారు. ఆమెను వంచించి, తమ స్వసుఖం కోసం- స్వలాభం కోసం వాడుకోవాలనే చూస్తారు"

"కానీ, భార్యకు బిడ్డలు కలగరని తెలిస్తే, ఆ భార్యను వదిలించుకునే సంకుచిత మనస్తత్వం ఉండేవాళ్లు చాలా అరుదుగా ఉంటారనుకుంటాను"

ఆమె తల అడ్డంగా ఆడించింది. "పొరపాటు సుధాకర్! మన రాష్ట్రంలో తక్కువేమో గానీ ఉత్తరప్రాంతపు రాష్ట్రాలలో అటువంటి మనస్తత్వం చాలా ఎక్కువ. ఒక స్త్రీ సంతానవతి కాలేకపోవడాన్ని ఈ సమాజం చాలా పెద్ద తప్పుగానే భావిస్తుంది. చివరికి చట్టం కూడా సంతాన యోగ్యత భార్యాభర్తలలో ఒకరికి లేకపోతే ఆ కారణాన్ని పరిగణనలోకి తీసుకుని చట్టబద్ధంగా వారికి విడాకులు మంజూరు చేస్తుంది. అయితే చిత్రమేమిటంటే! ఈ దేశంలోని న్యాయస్థాన చరిత్రలో ఏ స్త్రీ కూడా తనకు భర్తవల్ల సంతానం కలగడం లేదని కోర్టుని ఆశ్రయించి అతడినుండి విడిపోవడం జరగలేదు"

"ఈజిట్? " అతడు కళ్లు పెద్దవి చేశాడు.

"ట్రూ! అదే తన భార్య సంతానవతి కాలేకపోతోందనీ, జబ్బుచేస్తే 'సెక్స్‌కి' పనికిరాదనీ డాక్టర్ల సర్టిఫికెట్‌లు సంపాదించి చట్టం నుండి విడాకులు మంజూరు చేయించుకున్న మగాళ్లు ఈ దేశంలో కోకొల్లలు" చెప్పిందామె.

"నిజంగా దారుణం" వాపోయాడతడు.

"నాతిచరామి అంటూ బాసచేసిన భర్త, సంతానం కోసమంటూ ఆ భార్యను దూరం చేయడం ఎంతవరకూ సబబు? "

ఆలోచించుకుంటున్నట్టు సుధాకర్ కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాడు. ఆ తర్వాత చెప్పాడు. "ఒక కోణంలో అది తప్పే కావచ్చు! మరో కోణంలో ఆలోచిస్తే ఈ ప్రపంచంలోని ప్రతి వ్యక్తీ ఈ మానవాళి ఉన్నంతకాలం తన వంశం ఉండాలని కోరుకుంటాడు. తన ముత్తాతకు తాత, తాతకు తండ్రి, తండ్రికి తను, మరి తనకూ ఓ వారసుడు... ఆ వారసుడి ద్వారా పెరిగే వంశాభివృద్ధి ఇలా వంశం గురించి ఆలోచించడం కూడా తప్పు కాదు. ఏమంటావు జ్యోతీ? "

"మగాళ్లలాగే ఆడవాళ్లు కూడా ఈ సమస్యను తమవైపునుండి ఆలోచిస్తే ఎలా ఉంటుంది? తన తల్లికి తను రక్తం పంచుకుపుట్టినట్టే, తన రక్తాన్ని పంచుకుపుట్టే బిడ్డ మరొకరు ఉండాలని కోరుకోవడం న్యాయమేకదా?

"న్యాయమే" వెంటనే చెప్పాడు సుధాకర్.

జ్యోతి నవ్వింది. "అయితే మా దగ్గర కొచ్చే ప్రతి పదిహేను వందల కేసుల్లో ఆరు




వందల డెబ్బయ్ కేసుల్లో లోపమంతా పురుషలదే అని తేలుతోంది. ఆ ఆరు వందల డెబ్బయ్ కేసుల్లో కనీసం పాతిక శాతం కేసులకు అసలు సంతానయోగ్యత లేదు. మరి ఆ నూటా అరవైమంది ఆడ వాళ్లు కూడా నువ్వనే కోణంనుంచి ఆలో చిస్తే మగవాళ్ల పరిస్థితి ఎలాఉంటుంది? "

జవాబు చెప్పడం చాలా కష్టమే! ఆలో చించి చూస్తే మగాడు 'నువ్వు సంతానవ తివి కాలేవంటూ భార్యను వదిలేయగలడు. కాని స్త్రీ 'నువ్వు తండ్రివయ్యే అవకాశం లేదంటూ' భర్తను దూరం చేసుకోలేదు. అదే ఈ దేశంలోని స్త్రీ గొప్పతనం. ఏమన గలడు తను?

"ఈ పాయింట్ చాలా అర్థవంతంగా ఉంది జ్యోతీ"

"అందుకే నేనంటాను- భార్యాభర్తలు తల్లి దండ్రులుగా మారడమన్నది అదృష్టంమీద ఆధారపడి ఉంటుంది. ప్రస్తుతమే కాదు. భవిష్యత్‌లో కూడా ఇది ఖచ్చితంగా అదృ ష్టమే కాగలదు. అలాంటప్పుడు ఈ అదృష్టం తమకు లేదని ఒకరినొకరు దూరం చేసుకోవడం పూర్తిగా మూర్ఖత్వమే"

అతడు మౌనంగా తలాడించాడు.

పెద్ద ట్రేతో వెయిటర్ టేబుల్ దగ్గరికి వచ్చాడు. జ్యోతి ఎదురుగా ఆమ్లెట్ ఉన్న ప్లేటు, సుధాకర్ ఎదురుగా దోసె ఉన్న ప్లేటు ఉంచాడు. వాటికి ఆధరువుగా ఉప యోగించేందుకు నాలుగైదు రకాల పదార్థా లని కప్పుల్లో ఉంచాడు. తాను తెచ్చిన ఐస్ వాటర్ జగ్‌ని అక్కడ ఉంచి, అంతకు ముందు అక్కడ ఉన్న వాటర్‌జగ్‌ని ట్రే పైన పెట్టుకుని వెళ్ళిపోయాడు.

జ్యోతి ఫోర్క్కు, నైఫ్ చేతుల్లోకి తీసు కుంటూ అన్నది "ఈ విషయంలో నేను నిన్ను అప్రిషియేట్ చేస్తున్నా సుధాకర్! ఏడేళ్లు... ఏడేళ్లపాటు ఆమెను... ఐమీన్... నీ భార్యను ఆదరంగానే చూసుకోవడం చాలా గొప్ప విషయం"

సుధాకర్ అడిగాడు "నేను నా భార్యను ఆదరంగా చూసుకుంటున్నానని నువ్వెలా అనుకుంటున్నావు? మా ఆవిడ నీకు చెప్పే అవకాశమే లేదే"

జ్యోతి ముందుకు వంగి మెల్లగా నవ్వింది. "ఇలాంటి విషయాలు ఎదుటివా రికి చెప్పనవసరంలేదు. భార్య ముఖంలో కనిపించే ఆనందమే, భర్త ఆమెను ఎంత అపురూపంగా చూసుకుంటున్నాడో తెలియ జేస్తుంది"

సుధాకర్ కాస్త సిగ్గుపడ్డాడు.

"ఇక ఆ సమస్య... ఆ టాపిక్ వది లేద్దాం! మరేవైనా విశేషాలు చెప్పు సుధాకర్"

"విశేషాలంటే... విశేషాలేమున్నాయ్? "

"నీ కాలేజీ లైఫ్ గురించి చెప్పు"

"మనూర్నించి వెళ్ళిపోయి మేం విజయ వాడ చేరాం. అక్కడ మామయ్యగారింట్లో ఉంటూ కాలేజీలో చేరాను..."

మధ్యలోనే మాటలు కట్‌చేస్తూ ఆమె "అది కో-ఎడ్యుకేషన్ కాలేజీ నేనా? " అడి గింది.

"అవును" అని ఆగి అనుమానంగా ఆమె కేసి చూసి ప్రశ్నించాడు. "ఎందుకడిగావ్? "

"ఏంలేదు. ఆ కాలేజీలో కూడా ఆడపిల్లల కేరియర్‌లో కోడిగుడ్లు తినేసేవాడివేమోనని అనుమానం వచ్చి..." ఆమె చిలిపిగా నవ్వింది.

అతడూ నవ్వాడు. తనకు చిన్ననాటి చిలి పిచేష్టలు గుర్తుకొచ్చాయి. అప్పట్లో జ్యోతి కేరియర్‌లో కోడిగుడ్లు తను తినేయడం తలచుకుంటే ఏదోలా అనిపించింది. "చిన్న వయసులో ఏదో తెలియక నిన్ను ఏడిపిం చాలని అలా చేసేవాడిని. కాలేజీలో కూడా అలా చేస్తే ఆడపిల్లలు తరిమి తరిమి కొడ

తారు. అయినా ఆ చిన్ననాటి విషయాలలో నిన్ను ఏడిపించిన విషయం గుర్తుకొస్తే మాత్రం కాస్త బాధగానే అనిపిస్తుంది.

"బాధ ఎందుకు? నాకు మాత్రం ఇప్పటికీ ఆ సంఘటనలు గుర్తుకొస్తే చాలా సంతోషంగా అనిపిస్తుంది. ఆ బాల్యం మరోసారి వస్తే బాగుణ్ణనిపిస్తుంది. స్నేహితులు తిట్టుకుని కొట్టుకుని విడిపోవడం- మళ్ళీ కొద్ది రోజులలోనే ఒక్కటైపోవడం కేవలం బాల్యంలోనే సాధ్యమేమో అనిపిస్తుంది. అదే పెద్దయ్యాక కాస్త మనస్పర్థలు వస్తే చాలు స్నేహితులే కాదు, ఒకే కడుపున పుట్టిన అన్నదమ్ములు, తాళిబంధంతో ఏకమయిన భార్యాభర్తలు కూడా విడిపోతారు. మనుష్యుల్ని విడదీసే పెద్దరికాని కన్నా, మనుషుల్ని కలిపి ఉంచే బాల్యమే బెటర్‌కదా అనిపిస్తుంది ఆలోచిస్తుంటే. నిజమేకదూ సుధాకర్"

అతడు మెల్లగా తలాడించి అన్నాడు. "అయితే చిన్నప్పుడు అలా ఏడిపించేవాడినని నీకు నామీద కోపం లేదన్నమాట"

"ఖచ్చితంగా లేదు. పైపెచ్చు ఆ బాల్యస్మృతులు తలచుకుని నన్ను నేను ఉత్సాహపరచుకుంటూ ఉంటానుకూడా"

"థాంక్స్" చెప్పాడు సుధాకర్. వెయిటర్ సమీపిస్తుండడం చూసి కాఫీకి ఆర్డరిచ్చాడు.

టిఫిన్ ముగించి జ్యోతి నాప్‌కిన్‌తో పెదవులమీద అద్దుకుంటూ చెప్పింది "ఈరోజు నాకు చాలా ప్రశాంతంగా అనిపిస్తోంది"

"ఎందుకు?"

"మనసులోని బాధ మనకు దగ్గరయినవారికి చెప్పుకుంటే కొంత తగ్గుతుందికదా"

ఆమె పలుకుల్లో దగ్గరయినవారు అనే పదం అతడిని ఆనందపరిచింది. అయినా అతడు అన్నాడు "నాకు మాత్రం చాలా బాధగా ఉంది"





ఈసారి ఆమె అడిగింది "ఎందుకు?"

"నేను నిన్ను చూడగానే చాలా సంతోషపడ్డాను. ఎందుకో తెలుసా- మనం చిన్ననాడే విడిపోయినప్పటికీ నువ్వు అప్పుడప్పుడూ గుర్తొచ్చేదానివి. జ్యోతి ఎక్కడో సుఖంగా, సంతోషంగా కాపురం చేసుకుంటూ ఉండొచ్చు అని అనుకునేవాడిని. కాని నువ్వు హైదరాబాద్‌లోనే కలిశాక, రెండోరోజు నీ గురించి కొంత తెలిశాక గాభరాపడ్డాను. ఇప్పుడు పూర్తిగా తెలిశాక నిజంగా బాధపడుతున్నాను"

ఆమె బలవంతంగా నవ్వింది. "కావచ్చు కాని అదే జీవితమంటే... మనం ఊహించుకున్నవి జరగవు. జరిగేవి ఊహకందవు. అందుకే ఒక కవి అన్నాడుకదా- 'జరిగేవన్నీ మంచికని అనుకోవడమే మనిషిపని' అని"

"నీకు జరిగింది మాత్రం నీ మంచికి కాదు. ఇది చాలా బాధాకరమైన విషయం"

"వదిలేయ్ సుధాకర్! ఆ టాపిక్‌ని వదిలేసెయ్. నేనూ ఆ విషయాన్ని వీలయినంత వరకూ మనసులో ఉంచుకోను. బట్... నిన్న నాన్న ఊర్నించి వచ్చాడు. ఆయన వచ్చినప్పుడంతా నన్నుచూసి బాధపడతాడు. నన్నూ బాధపెడ్తాడు. ఏదేదో చెప్పి నన్ను పెద్ద కన్‌ఫ్యూజన్‌కి గురిచేస్తాడు. అలాటప్పుడు ఎవరితోనన్నా మనసువిప్పి మాట్లాడుకోవాలనిపిస్తుంది. ఈరోజు నీతో మాట్లాడాక నాకు కొంత ఉపశమనం దొరికింది."

"ఏమిటీ! శంకర్రెడ్డిగారు వచ్చారా! ఆయన్ని చూసి చాలా కాలమయింది. ఒకసారి మా ఇంటికి తీసుకురాకూడదూ"

"అలాగే! అయితే ఆయన ఎన్నాళ్ళుంటారో తెలియదు. హఠాత్తుగా బయలుదేరి వచ్చేశారు. అలాగే హఠాత్తుగా బయలుదేరి వెళ్ళిపోతుంటారు కూడా".

"ఇంతకీ నీ మనసు బాధపడేంతగా ఆయన అనేదేమిటి?" సుధాకర్ అడిగాడు.

"మళ్ళీ పెళ్ళిచేసుకోమంటూ సంబంధాలు

తెస్తుంటాడు"

"నీ కభ్యంతరం ఏమిటి? "

"ఓహ్! గాడ్! నువ్వూ ఆయనలాగే మొదలెట్టావ్" అంటూ జ్యోతి నుదురు కొట్టుకుంది.

"అయామ్ సారీ!"

ఇద్దరూ కాసేపు మౌనంగా వుండిపోయారు.

ఆమె టాపిక్ డైవర్ట్ చేస్తూ అంది "అన్నట్టు అసలు విషయం చెప్పడం మరిచిపోయాను. డాక్టర్ భవానీతో మీ విషయం మాట్లాడాను. మీ రిపోర్ట్స్ మొత్తం ఆమెకు చూపించి పర్సనల్ గా డిస్కస్ చేశాను. ఆమె నాగమణి మెన్సెస్ అయిన పదమూడో రోజు హాస్పిటల్ కి తీసుకురమ్మంది. ప్రెగ్నెన్సీ నిలవడానికి కొన్ని మందులు వాడతాం. ఒకటి రెండు నెలలు చూశాక ఆ మెడిసిన్ పనిచేయకపోతే అప్పుడు 'ఇన్ విట్రో ఫెర్టిలైజేషన్' పద్ధతిని ఫాలో అవుదాం"

సుధాకర్ అన్నాడు "చాలా ఖర్చవుతుందేమో"

"ఓ అరవై, డెబ్బయివేలు ఖర్చు కావచ్చు కానీ మీ విషయంలో నేను ఉన్నానుగా! డోంట్ వర్రీ!"

"థాంక్యూ"

"ఫ్రెండ్స్ మధ్య కృతజ్ఞతలు వొద్దు" ఆమె నవ్వింది.

వెయిటర్ వచ్చి కాఫీ సర్వ్ చేశాడు.

కాఫీ సిప్ చేస్తూ అన్నాడు సుధాకర్ "ఆదివారం మా ఇంటికి రావడం ఖాయమే కదా"

"ఖచ్చితంగా చెప్పలేను. కొన్ని కేసులు అటెండ్ కావాలి"

"రావడానికి ప్రయత్నించు. అమ్మ నిన్ను చూడాలని చాలా ఉబలాటపడుతోంది"

హోటల్ నించి బయటకొచ్చాక జ్యోతిని తిరిగి హాస్పిటల్ దగ్గర దించి సుధాకర్ వెళ్ళిపోయాడు. జ్యోతి అక్కడ ఉన్న తన కారులో కూర్చుని ఇంటిముఖం పట్టింది.



"అమ్మా జ్యోతీ! సాయంత్రం నీకు డ్యూటీ ఉందా? "

"ఈరోజు భవానీగారి హాస్పిటల్ కి వెళ్ళనవసరంలేదు నాన్నా! కన్సల్టెంట్ డాక్టర్ గా వారంలో నాలుగైదు రోజులు మాత్రమే ఆ హాస్పిటల్ కి వెళుతుంటాను"

"అయితే మనం కాసేపు ఎక్కడికయినా వెళ్ళివద్దామా? "

"అలాగే" అని ఆగి "ఎక్కడి కెళ్దాం నాన్నా? " అడిగిందామె.

ఆయన వెంటనే చెప్పాడు. "బిర్లామందిర్ కి వెళ్దామమ్మా"

మరో గంట తర్వాత వారిద్దరూ కారులో బయలుదేరారు.

సిల్వర్ మెటాలిక్ కలర్ లోఉన్న బుల్లి మారుతీకారు అది. ఆమెకు డ్రైవర్ ని పెట్టుకోవడం ఇష్టంలేదు. అందుకే తనే డ్రైవ్ చేసుకుని వెళ్ళిపోతుంటుంది.

ఆమె చాలా గొప్ప అందగత్తె కాకపోవచ్చు అయితే అతి సాధారణమైన అందం

మాత్రం కాదామెది. ఆమె కారు డ్రైవింగ్ సీట్లో కూర్చుని ఉన్నా, హాస్పిటల్ కారిడార్లో నడిచి వెళ్తున్నా అపరిచితులు ఆమె మీద ఒకటికి రెండుక్షణాలు అలాగే దృష్టి నిలుపుతారు. ఆమెలో అందంకన్నా మరేదో తెలియని ఆకర్షణ, అంతకు మించిన హుందాతనం చూపరులను ఇట్టే ఆకర్షిస్తుంది.

ఆ హుందాతనమే ఒక్కోసారి ఆ తండ్రి కూడా ఆమె ముందు మాట్లాడేందుకు భయపడేలా చేస్తుంది.

పావుగంట తర్వాత కారు బిర్లామందిర్ కొండ ఎక్కి పార్కింగ్ ప్లేస్‌లో ఆగింది. వారిద్దరూ కిందకి దిగారు.

చెప్పుల స్టాండులో చెప్పులుంచాక, పక్కనే ఉన్న కొట్టువైపు నడిచారు. దుకాణంలోని వ్యక్తికి ఎనిమిది రూపాయలిస్తే, అతడు కొబ్బరికాయతో పాటు పూజాసామగ్రి అందించాడు.

ఇద్దరూ మెట్లెక్కి పైకి వెళ్ళాక అక్కడ పెద్ద క్యూ ఉంది. శనివారం కావడంతో జనం రద్దీ ఎక్కువగానే ఉంది. వారిద్దరూ క్యూలో నిలబడ్డారు.

అర్ధగంట తర్వాత వారిద్దరూ మందిరం ప్రక్కనే ఉన్న ఖాళీస్థలం వైపు నడిచారు. దేవుని దర్శనం తర్వాత కాసేపు ఆలయ ప్రాంగణంలో కూర్చుని లేవడం ఆచారం. ఆ చోట చాలా మంది సందర్శకులు కూర్చుని దేవుని ప్రసాదం భక్తిగా కళ్ళకద్దుకుని తింటున్నారు.

జనానికి కాస్త దూరంలో ఓ గోడకు ఆనుకుని కూర్చున్నారు వారిద్దరూ. జ్యోతి కొబ్బరిచిప్ప పగలకొట్టి ఓ ముక్క ఆయనకు అందించింది. ఆయన ఆ ముక్కను కళ్ళకద్దుకుని తినసాగాడు. ఆమె తను కాస్త తీసుకుంది.





ఆకాశం చీకటి చీర సింగారించుకుంటోంది. నవంబర్ నెల కావడంతో ఆరింటికే చలిగాలి మొదలయింది.

అక్కడ కూర్చుంటే, నగరంలో చాలా భాగం కనిపిస్తోంది. ముఖ్యంగా హుస్సేన్ సాగర్, టాంక్‌బండ్ మీద వరసగా, వేగంగా సాగిపోయే వాహనాలు... చాలా ఆహ్లాదం గొలిపే సీనరీ అది.

"జ్యోతీ" అన్నాడు ఆయన.

"చెప్పండి నాన్నా" ఎటో చూస్తున్న ఆమె ఆయన వైపు తిరిగింది.

"నేను చెప్పిన విషయం గురించి ఏమయినా ఆలోచించావామ్మా? "

"ఇంకా ఏం నిర్ణయించుకోలేదు నాన్నా"

"నాకే కాదు, మీ అమ్మక్కూడా ఈ సంబంధం నచ్చింది. ఆయన చాలా మంచివాడని తెలిసిన వాళ్ళంతా చెప్పారట"

ఆమె కొద్ది క్షణాలు మౌనంగా ఉండిపోయింది.

"ఏమిటమ్మా? ఏమీ మాట్లాడవు? "

"నాన్నా..." ఆమె అప్పటికే కొద్దిగా సంశయించింది.

"చెప్పమ్మా" ఆయన అనునయంగా అన్నాడు.

"నాన్నా! మీరు... మీరన్నట్టే ఒప్పుకుంటే నేను ఆ వ్యక్తికి భార్యను కాగలను. కాని... ఆ పిల్లలు మాత్రం నన్ను తల్లిలా చూడలేరు"

"అదేంటమ్మా" ఆయన కనుబొమలు చిట్లించాడు.

"అదంతే నాన్నా! నేను పిల్లల సైకాలజీ చదివాను. తమకు తల్లి లేకపోతే వారు ఇబ్బందిపడతారు. అయితే తమ తల్లిస్థానంలో మరో ఆడది ప్రవేశిస్తే మాత్రం అప్‌సెట్ అవుతారు. ముఖ్యంగా వారిలో ఇన్‌సెక్యూరిటీ ఫీలింగ్ ప్రవేశిస్తుంది. 'సవతి తల్లి' అనగానే ఇక ఆమె మొదటి భార్య

పిల్లలని హింసిస్తుంది, రాచిరంపాన పెడుతుంది అనే భావం ముద్రగా పడిపోవడం వలన వాళ్ళలో ఇన్ సెక్యూరిటీ ఫీలింగ్ అధికమవుతుంది. దాంతో వాళ్ళు కావాలని ఇంట్లో గందరగోళం సృష్టిస్తారు. ఆ తండ్రి మనసు అశాంతి మయమవుతుంది. నా బ్రతుకులో నిశ్చింత కోసం మరో ఇంటిని నరకం చేయడం నాకు ఇష్టంలేదు..."

"జ్యోతీ"

"ఇది నా అభిప్రాయం మాత్రమే కావచ్చు! నేను ఏ నిర్ణయమూ తీసుకోలేదు. నా జీవితాన్ని గురించిన నిర్ణయం నాదే కావచ్చు. కానీ కని, పెంచిన మీకూ నా మీద హక్కు ఉంది. మీరు తప్పదని నిర్ణయిస్తే నేను అంగీకరిస్తానేమో!"

ఆయన మెల్లగా తలూపుతూ "నువ్వా అభిప్రాయం చెప్పాక, మేమూ మళ్ళీ ఆలోచించుకోవలసిన పరిస్థితి ఏర్పడిందమ్మా" అన్నాడు.

ఆమె మౌనంగా ఉండిపోయింది.

చాలా సేపటి తర్వాత ఆయన అన్నాడు "కాని నువ్విలాఒంటరిగా ఎంతకాలమమ్మా"

"చూడండి నాన్నా! మరో పెళ్ళి చేసుకోకూడదని, ఇలాగే వొంటరిగా గడిపేయాలనే పట్టుదల నాకేమీ లేదు. కాకపోతే ఆ చేసుకోబోయే వ్యక్తి విషయంలోనే నేనొక నిర్ణయం తీసుకోదలచుకున్నాను"

శంకర్రెడ్డి ఆశ్చర్యంగా చూశాడు. "ఏమిటమ్మా అది? "

"భగవంతుడు నాకో లోపాన్నిచ్చాడు. నేను చేసుకోబోయే వ్యక్తి కూడా అటువంటి లోపంతోనే ఉండాలి".

"ఏమిటమ్మా నువ్వనేది? "

"అవును నాన్నా! సంతానాన్ని ఇవ్వగలిగే శక్తి అతడిలో లేదని ఓ భార్య వదిలేసిన వ్యక్తిని నేను చేసుకోడానికి సిద్ధమే! అప్పుడే మాది సరైన జోడీ అవుతుంది" దృఢంగా అంది జ్యోతి.

ఆయన కొద్దిక్షణాల పాటు అవాక్కయిపోయాడు. తనమీద మనసులో ఎక్కడో కోపం ఉండి, అది తీర్చుకోడానికి ఇలా వ్యంగ్యంగా మాట్లాడుతోందేమో అనుకున్నాడు.

"నేను సంబంధాలు తేవడం ఇష్టం లేకపోతే మానె! నువ్వు మాత్రం అలా మాట్లాడకమ్మా" ఆయన గొంతులో ఆర్ద్రత పలికింది.

జ్యోతి ఇక రెట్టించదలచుకోలేదు. ఆమె లేస్తూ "వెళ్దామా నాన్నా" అంది.

శంకర్రెడ్డి తలాడించి లేచాడు.

పార్కింగ్ ప్లేస్ వైపు వెళ్ళాక ఆమె డోర్‌లాక్ తీసి డ్రైవింగ్ సీట్లో కూర్చుని, మరోవైపు డోర్‌లాక్ తీసింది. ఆయన కూర్చున్నారు.

కారు కొండ దిగి రోడ్డెక్కింది.

చీకటిలో మునిగిన నగరాన్ని పట్టపగలు చేయాలని స్ట్రీట్‌లైట్లు విఫలయత్నం చేస్తున్నాయి. వాటి ప్రయత్నం కొంతవరకూ మాత్రమే ఫలిస్తోంది. రోడ్డుమీద సాగే వాహనాల లైట్లని కాసింత ఎత్తులో నుండి చూస్తే నేలమీద నక్షత్రాల గుంపు పరిగెడుతున్నట్టు కనిపించవచ్చు.

కారు సెక్రటేరియట్ దాటి టాంక్‌బండ్ సమీపిస్తోంది. అప్పటి వరకూ వారిద్దరూ మౌనంగానే ఉన్నారు. ఆ నిశ్శబ్దం చాలా ఇబ్బందిగా అనిపించిందామెకు. ఏదో మాట్లాడాలి. ఆయనను ప్రస్తుతం ఉన్న మూడ్‌లోంచి ఇవతలకు తీసుకురావాలి. అప్పుడు... అప్పుడు గుర్తొచ్చాడామెకు సుధాకర్. ఆమె చప్పున ఆయన వైపుకు తలతిప్పింది.

"నాన్నా! మీకు సుధాకర్ తెలుసు కదూ? "

"సుధాకరా? ..." ఆయన ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"అదేనాన్నా! మన ఊళ్ళో ఉండేవారు. వాళ్ళ నాన్నగారి పేరు నారాయణ. ఆయనా, మీరు స్నేహితులు... ఆయన గుండెపోటుతో చనిపోయారు..."

ఆయనకు గుర్తొచ్చినట్టుంది. "ఓహో! ఆ నారాయణ కొడుకు సుధాకరా! వాడు మనూళ్ళో నీతోపాటే చదువుకున్నాడు కదమ్మా!... పాపం! వాళ్ళ నాన్న చనిపోవడంతో మరో దిక్కులేక ఊరు వదిలేశారు"

"ఆ సుధాకర్ ఇప్పుడు ఇక్కడే ఉన్నాడు నాన్నా!"

"ఏదీ ఈ హైదరాబాదులోనా?"

"అవును నాన్నా! తనిప్పుడు బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తున్నాడు"

"అలాగా" అన్నారాయన. "మరి వాళ్ళమ్మ... పేరేదో గుర్తుకురావడంలేదు. కొడుకు దగ్గర ఉందా?"

"యశోదమ్మగారా!... తనూ ఇక్కడే ఉందట"

"అతడికో చెల్లెలు కూడా ఉండాలనుకుంటాను"

"ఆ అమ్మాయికి పెళ్ళయిపోయిందట. వాళ్ళాయన విజయవాడలోనే రైల్వేస్‌లో పనిచేస్తున్నాడట"

ఆయన తన కూతురి వైపు తేరిపారా చూసాడు. ఆమెకు తన సొంత విషయాలే గుర్తుండవు. దగ్గరి బంధువుల పేర్లు అడిగినా చెప్పలేదు తను. ఇంటిపక్కన ఎవరున్నారో కూడా తెలుసుకోవాలన్న ఆసక్తి ఆమెకు ఉండదు. అలాంటిది ఆమె సుధాకర్ గురించి, అతడి కుటుంబం గురించి చాలా విషయాలు చెపుతుంటే ఆయనకు ఆశ్చర్యమేసింది. ఆయన ఆమె ముఖంలోకి మరింత పరిశీలనగా చూశాడు. ఆ ముఖంలో ఏదో సంతోషం, పెదాల మీద చిరునవ్వు కదలాడుతున్నాయి. ఆయన కనుబొమలు ముడిచాడు.

"అయితే సుధాకర్ నీకు కనిపించాడన్న మాట"

"అవును నాన్నా! మొన్నీమధ్యే భార్యతో పాటు భవాని గారి హాస్పిటల్‌కి వచ్చాడు. అక్కడ అనుకోకుండా నేను కలిసాను".

అప్పటివరకూ ఆసక్తిగా వింటూ, సీట్లో కాస్త ముందుకు వంగి ఉన్న శంకర్రెడ్డి ఒక్కసారిగా వెనక్కు వాలిపోయాడు. పొంగుతున్న పాలమీద నీళ్ళు చిలకరించిన అనుభూతి...! తన కూతురు మరో కుర్రాడి గురించి హుషారుగా చెబుతుంటే మనసు... పాడు మనసు ఏదేదో ఊహించింది. కాని... వారిది స్నేహం మాత్రమే. కేవలం చిన్ననాటి స్నేహం. తను మరోలా అపోహపడ్డాడు.

కారు టాంక్‌బండ్ దాటి రాణిగంజ్ వైపు సాగిపోతోంది.

"అయితే సుధాకర్‌కి పెళ్ళయిపోయిందన్న మాట"

ఆమె తలతిప్పి ఆయన కేసి అదోలా చూసింది. "అదేం మాట నాన్నా! ముప్ఫయ్ మూడు, ముప్ఫయ్ నాలుగేళ్ళు వచ్చాక కూడా అతడింకా పెళ్ళిచేసుకోకుండా ఉంటాడని మీరెందుకనుకున్నారు?"

ఆయన తడబడి "పెళ్ళి అయివుండకూడదని కాదులేమ్మా!... అయిపోయింది కదా అనుకుంటున్నాను" అన్నాడు. తన జవాబు తనకే అస్పష్టంగా అనిపించింది.

కారు ప్యారడైజ్ సమీపిస్తుండగా ఆమె అడిగింది. "మనం వారింటికి ఓసారి వెళ్ళి వద్దామా నాన్నా?"

"నేనూ అదేమాట అనాలనుకుంటున్నానమ్మా! యశోదమ్మను చూసి ఎంత కాలమయిందో. ఆమెను మళ్ళీ చూడగలననుకోలేదు. దగ్గరలోనే ఉన్నారంటున్నావ్... ఒకసారి వెళ్ళి చూసి వద్దాం"





"రేపు ఆదివారం కదా! వాళ్ళంతా ఇంట్లోనే ఉంటారు. నేను మార్నింగ్ డ్యూటీ తొందరగా ముగించుకుని వచ్చేస్తాను. అప్పుడు వెళదాం!"

"అలాగే! అయితే ఒక విషయం! నేను రేపు ఊరికి బయలుదేరుతాను. వాళ్ళింటి నుంచి బయలుదేరి అటే స్టేషన్‌కి వెళ్ళిపోతాను. అన్నట్టు మర్చేపోయాను చూడు! వచ్చే శనివారం నాడేగా దీపావళి! అమ్మ బట్టలు తీసుకురమ్మంది... మనమిప్పుడు షాపింగ్ చెయ్యాలే!" కంగారు పడుతున్నట్టుగా అన్నాడాయన.

కారప్పటికి సరిగ్గా క్రాస్‌రోడ్స్ చేరుకోవడంతో జ్యోతి కారుని కుడివైపు రోడ్‌మీదికి తిప్పింది. బట్టలషాపులు ఆరోడ్డులో చాలానే ఉన్నాయి.

★ ★ ★

రాత్రి పదిన్నరయింది.

శంకర్రెడ్డి అప్పటికే భోంచేసి పడకవేసేశాడు. ప్రయాణ బడలిక ఇంకా తగ్గినట్టు లేదు. నడుం వాల్చగానే నిద్రలోకి జారుకున్నాడాయన.

జ్యోతి బెడ్‌మీద తనువు వాల్చిందే గానీ, కంటిమీద రెప్ప వాలలేదు. తనకు ఎంత ప్రయత్నించినా నిద్ర రావడంలేదు. హాలులో కెళ్ళి టి.వి. ఆన్‌చేసి కూర్చుందామనుకుంది. కాని మనసు ఆ ప్రోగ్రాముల మీద లీనమయ్యేలా లేదు. ఏవో... ఏవో ఆలోచనలు గుననును పట్టిపీడిస్తున్నాయి. తండ్రి రాకతో మరచిపోతున్న ఆలోచనలు మళ్ళీ మనసును అతలాకుతలం చేస్తున్నాయి.

పెళ్ళయ్యాక రెండు మూడేళ్ళు పిల్లలు లేనప్పటికీ అంతగా బాధ అనిపించకపోవచ్చు కాని ఆతర్వాత మాత్రం ఆ బాధ చిన్నదిగా మొదలయి భార్యాభర్తల మధ్య మనస్పర్థలకు కూడా కారణం కావచ్చు వారు విడిపోయేందుకు ఒక ముఖ్యకారణం కూడా అవుతుంది. తన విషయంలోనూ జరిగింది అదే కదా? అయితే ఒక్కటి మాత్రం సిసలైన నిజం. భార్యాభర్తలలో లోపం మగాడిదైతే ఆ మగాడు మౌనంగా ఉండిపోతాడు. ఆ సంసారం ఛిన్నాభిన్నం కాదు. కాని లోపం ఆడదానిదైతే మాత్రం వారిద్దరూ విడిపోయేందుకు ప్రపోజల్ పెట్టేది ఖచ్చితంగా మగాడే. ఒక స్త్రీ సంతానవతి కాలేకపోతే, ఆమె కొంతకాలం తర్వాత తన భర్త రెండో పెళ్ళి చేసుకునేందుకు అంగీకరిస్తుంది. పెద్ద మనసుతో, తనేదో త్యాగం చేస్తున్నానన్న ఫీలింగ్‌తో అతడి పెళ్ళి దగ్గరుండి జరిపిస్తుంది. వారిద్దరి శోభనానికి తనే మల్లెపూల పందిరి సర్దుతుంది. పాలగ్లాసు పక్కన పెడుతుంది. కాని... అదే మగాడు తాను తండ్రి అయ్యే అవకాశం లేకపోతే తన భార్యకు రెండోపెళ్ళి చేయగలడా? తను ఆ ఇంట్లో మొదటి మొగుడుగా ఉండిపోగలడా? ...'

జ్యోతి బెడ్‌మీద లేచికూర్చుని మోకాళ్ళ మీద తలానించింది. ఆలోచనలు సాగుతూనే వున్నాయి.

"ట్రింగ్... ట్రింగ్..."

ఆమె ఆలోచనలనుండి బయటపడింది. ఫోన్ మోగుతోంది. 'ఈ టైములో తనకు ఫోన్ చేసేవాళ్ళెవరబ్బా? ఒకవేళ హాస్పిటల్‌నుండా? ..., ఆమె ఆలోచిస్తూనే ఫోన్ దగ్గరగా నడిచింది. రిసీవర్ చేతిలోనికి తీసుకుని "హలో" అంది.

"హలో జ్యోతి... నేను..."

అవతలి వ్యక్తి ఎవరో గుర్తుపట్టడంతోనే ఆమె చెయ్యి రిసీవర్ చుట్టూ గట్టిగా బిగుసుకుంది. తామిద్దరూ విడిపోయాక అతడు తనకు ఫోన్ చేయడం ఇదే మొదటిసారి.

"అది సరే! ఆరోజు ట్రాఫిక్ సిగ్నల్ దాటాక నేను కారు ఆపితే, నువ్వేంటి కారు ఆపకుండా వెళ్ళిపోయావ్? నీతో కాసేప

యినా మాట్లాడాలనుకున్నాను..."

ఆమెకు అతడితో మాట్లడాలనిపించలేదు. మౌనంగా ఉంది.

"ఎలా ఉన్నావ్? బాగున్నావా? " అతడు తన గొంతులో ఆప్యాయతను పలికించే ప్రయత్నం చేస్తున్నాడు.

పెదవి విప్పకుండా ఉండలేని పరిస్థితి. "బాగానే ఉన్నాను" జవాబు మాత్రం చెప్పింది. ఎదుటి వ్యక్తి క్షేమసమాచారాలేవీ అడగలేదు.

"అంత పెద్ద ఇంట్లో ఒక్కదానివే, ఒంటరిగా..." కొద్ది సెకన్లు ఆగాక అన్నాడు "నాకు చాలా బాధగా ఉంది జ్యోతీ!"

'బాధ ఎందుకు? నువ్వు చేసిన నిర్వాకమేగా' అందామనుకుంది. అసలతడితో మాట్లాడాలనిపించడం లేదు.

"సో వాట్? " అంది కంఠంలో సీరియస్‌నెస్ తెచ్చుకుని.

"నువ్వు గుర్తుకొచ్చినప్పుడల్లా ఒక్కోసారి చాలా బాధనిపిస్తుంది జ్యోతీ. ఆ సమయంలో నీ దగ్గరకు వచ్చేయాలనే అనుకుంటాను. కానీ..."

ఆమెకు నవ్వొచ్చింది. అతడు ఎలా మాట్లాడినా ఆ మాటల వెనుక ఉద్దేశ్యమేమిటో అర్థం చేసుకోలేనంత అమాయకురాలు కాదు తను. అది తన గురించి బాధతో చెపుతున్న మాటలు కావు. ఈ ప్రపంచంలోని ఎక్కువ మంది మగాళ్ళు తమకు అందుబాటులో ఉండి ఉచితంగా దొరికే అందాన్ని, ఆనందాన్ని వదిలేయాలనుకోరు. కాసింత ఆప్యాయత, అభిమానాలు ప్రదర్శించి వాడుకోవాలనుకుంటారు. అప్పుడు తను పట్టుబట్టి ఒకే ఇంట్లో ఇద్దరాడవాళ్ళు ఒకే మగాడికి భార్యలుగా చెలామణి కావడం ఇష్టంలేదంటూ విడాకులు కోరింది కాబట్టి తప్పని సరయి తను విడిపోయేందుకు అంగీకరించాడు. అతడి ఉద్దేశ్యం మాత్రం 'ఇద్దరి పెళ్ళాల ముద్దుల మొగుడి'గా బ్రతకాలనే' ఉండింది. ఆకోరిక నెరవేరలేదు. కాని తనను వదిలేయడం అతడికి ఇష్టం లేనట్టుంది. అందమే కాదు, వెనుక ఉన్న ఆస్తికూడా వృధా చేయడమేననుకుని గాలం వేస్తున్నాడు.

అవతలివైపు నుండి సతీష్ "జ్యోతీ!... ఏమిటీ... ఏం మాట్లాడవేంటి? " అన్నాడు.

"ఏంలేదు! నాన్నగారితో కలిసి షాపింగ్‌కి వెళ్ళి ఇప్పుడే వచ్చాము. బాగా బడలికగా ఉంది..."

"ఓ... ఆయన సిటీలోనే ఉన్నారా? "

"లేదు మొన్ననే వచ్చారు"

"ఇప్పుడు నీ పక్కనే ఉన్నారా? ".

"నిద్రపోతున్నారు".

"అయితే ఆయన్ని డిస్టర్బ్ చేయడం ఎందుకులే? ... ఇంకేంటి విశేషాలు? "

'నాన్నగారు తెచ్చిన ప్రపోజల్ గురించి చెప్పి అతడిని ఉడికిద్దామా? ' అనుకుందామె. 'తను మళ్ళీ పెళ్ళిచేసుకునే ప్రయత్నాలు మొదలయ్యాయని చెబితే అతడి ముఖంలో ఫీలింగ్స్ ఎలా ఉంటాయో? ' ఆ ఫీలింగ్స్ తను చూడాలి. అందుకే ఆమె ఆ ప్రపోజల్ గురించి ఫోన్‌లో చెప్పడం మానేసింది. ఎప్పుడైనా అతడు ఎదురుపడితే, అతడిని హర్ట్ చేసేందుకు ఆ విషయం మాట్లాడాలి...!

"విశేషాలు మాట్లాడేంత ఓపికలేదు. నిద్రొస్తోంది. పడుకోవాలి. రేపు ఎర్లీ అవర్స్ డ్యూటీ ఉంది" చెప్పిందామె.

"సరయితే! బాగా అలసిపోయినట్టున్నావ్. రెస్ట్ తీసుకో! గుడ్‌నైట్!"

ఆమె గుడ్‌నైట్ అనికూడా అనలేదు. అవతలివైపు ఫోన్ పెట్టేయక ముందే తను రిసీవర్ హుక్‌మీద ఉంచేసింది.

★ ★ ★





ఇంటిముందు ఆగిన కారుని మొదట చూసింది యశోదమ్మ. తమ ఇంటికి కారులో వచ్చేవారెవరబ్బా మనసులో అనుకుంది.

కారులో నుండి ముందుగా జ్యోతి దిగింది. కాని ఆమెను గుర్తుపట్టడం యశోదమ్మకు కష్టమయింది. వెనకనే శంకర్రెడ్డి దిగాడు. ఆయనను వెంటనే పోల్చుకునేసింది. అప్పటికే జ్యోతిని గుర్తుపట్టడం జరిగింది. 'ఈ అమ్మాయిలో ఎంత మార్పొచ్చిందో కదా!' అనుకుంటూ వడివడిగా బెడ్ రూంలోకి వెళ్ళింది.

సుధాకర్ ఏదో పుస్తకం చదువుకుంటూ ఉన్నాడు. ఆమె అతడి దగ్గరకెళ్ళి చేతిలోని పుస్తకం లాగేస్తూ చెప్పింది. "ఒరేయ్ సుధా! శంకర్రెడ్డిగారు, జ్యోతి వచ్చేశార్రా!"

"శంకర్రెడ్డిగారా..." అతడికి వెంటనే గుర్తొచ్చింది. కాని ఆయన హఠాత్తుగా అంత ఉదయాన్నే ఊడిపడటం అదోలా అనిపించింది. అతడు లుంగీ సర్దుకుంటూ బెడ్‌రూంలో నుండి ఇవతలికి వచ్చి, వరండాలోకి వెళ్ళాడు. అప్పటికే వారిద్దరూ గేటు తీసుకుని లోపలికి వచ్చేశారు. "రండి... రండి..."

"ఇంతదూరం వచ్చినవాళ్ళం, రాకుండా వెళ్ళిపోంలే" జోక్ పేల్చినట్టుగా నవ్వారాయన.

సుధాకర్ కూడా నవ్వి "మీరెప్పుడొచ్చారు? బాగున్నారా? ఎంతకాలమయిందో మిమ్మల్ని చూసి..." ప్రశ్నల వర్షం కురిపించబోతే ఆయన చేయి చూపించి, ఆగమన్నట్టు సైగచేశాడు.

"ఇన్ని ప్రశ్నలు ఒకేసారి అడిగేస్తే ఎలా జవాబు చెప్పనోయ్" అన్నాడాయన. వెనక నుండి జ్యోతి ఫక్కున నవ్వింది.

సుధాకర్ తన నుదిటిమీద కొట్టుకున్నాడు. అప్పుడే యశోదమ్మ కొంగు భుజం చుట్టూ కప్పుకుని, తలుపు చాటునుండి ఇవతలికి వస్తూ ఆయనకు కనిపించింది. ఆయన ఆమెకేసి ఆప్యాయంగా చూశాడు.

"ఏమ్మా యశోదమ్మా! బాగున్నావా? "

"బాగున్నానండీ" అన్నాక, అడిగింది "మీరెలా ఉన్నారు? "

"ఏదో ఇలా" ఆయన నవ్వారు.

"వదినమ్మ ఆరోగ్యం ఎలా ఉంది? "

ఇప్పుడు బానే ఉందమ్మా"

అప్పటికే వారంతా హాల్లోకి నడిచారు. 'కూర్చోండి" సోఫా చూపించాక చెప్పింది యశోదమ్మ.

వారిద్దరూ సోఫాలో కూర్చుని ఇంటిని పరిశీలనగా చూస్తుంటే, హాల్లో మాటలు వినిపించడంతో అప్పుడే వంటగదిలోనుండి హాల్లోకి వచ్చింది నాగమణి. హాల్లోని సోఫాల్లో కూర్చుని ఉన్న వారిద్దరినీ చూడడంతోనే కొద్దిగా తడబడింది. క్షణంలోనే తేరుకుని జ్యోతిని చూసి పలకరింపుగా నవ్వింది.

నాగమణిని చూశాక శంకర్రెడ్డి అడిగాడు "మీ కోడలా యశోదమ్మా? "

"అవునండీ"

"కుందనపు బొమ్మలా ఉంది"

నాగమణి కొద్దిగా సిగ్గుపడింది. శంకర్రెడ్డిని పరిచయం చేస్తూ యశోదమ్మ ఆమెతో చెప్పింది, "ఈయన జ్యోతి నాన్నగారు". నాగమణి ఆయనకు రెండు చేతులూ జోడించి నమస్కరించింది.

శంకర్రెడ్డి సుధాకర్ వైపు తిరిగి నవ్వుతూ పలికాడు "ఇక ఇప్పుడు నీ ప్రశ్నలకు జవాబు చెపుతానోయ్! అడుగు! అన్నట్టింటాక ఎంతకాలమయిందీ మిమ్మల్నిచూసి అన్నావుకదూ!... నిజమే! నేనూ మిమ్మల్ని చూసి పదిహేనేళ్ళకు పైగానే అయిపోయింది...! ఈ మానవ జీవితాలు చాలా చిత్రంగా ఉంటాయోయ్! ఎవరు, ఎప్పుడు,



ఎలా కలుస్తారో తెలియదు. కలిసిన వ్యక్తులు తిరిగి ఎలా విడిపోతారో తెలియదు. చాలా చిత్రమైన మానవజీవితం! ఏమంటావ్ సుధాకర్? "

తనేం మాట్లాడాలో తెలియనట్టుగా అతడు నిలువుగా తలాడించాడు.

"ఏమయితేనే, ఇంతకాలం తర్వాత మిమ్మల్నిలా చూడగలిగినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది"

యశోదమ్మ జ్యోతి తలమీద ఆప్యాయంగా చెయ్యివేసి నిమిరింది. "ఎప్పుడో చూశాను నిన్ను. అసలు పోల్చుకోవడమే కష్టమయింది నాకు. మీ నాన్నగారిని చూశాక గుర్తుపట్టగలిగాను. చాలా మార్పొచ్చిందమ్మా నీలో... అప్పుడు ఇంటి కొచ్చేటప్పుడు పరికిణీ, ఓణీలలో సన్నగా, చలాకీగా అనిపించేదానివి. కాస్త లావయ్యావు. కాస్త తెల్లబడ్డావనుకో..."

జ్యోతి సిగ్గుపడిపోయింది. "సుధాకర్ కలిసిన మొదటిరోజే మిమ్మల్ని చూడాలనిపించింది. రావాలనుకున్నాను. కానీ బిజీగా ఉండడంతో రాలేకపోయాను. ఇంతలోనే నాన్నగారు రావడం, ఆయన మిమ్మల్ని చూడాలని అనడంతో ఉదయాన్నే ఇలా వచ్చేశాం!".

"మణీ! కాఫీ తీసుకురా" సుధాకర్ చెప్పడంతో నాగమణి కిచెన్ రూంలో కెళ్ళిపోయింది.

జ్యోతి కూడా లేచి వంటగదివైపు నడిచింది. హాల్లో ఆ ముగ్గురే మిగిలారు.

శంకర్రెడ్డి తల్లీకొడుకుల వైపు చూసి కాస్త సంతోషంగా చెప్పాడు. "జనారణ్యం లాంటి ఈ సిటీలో ఒంటరిగా బ్రతుకుతున్న నా కూతురికి మీరు కాస్త దగ్గరయ్యారని తెలిసి నాకు చాలా సంతోషం కలిగింది. ఆ ఒంటరి పిల్లకి మీరయినా ఇక కాస్త తోడుగా ఉండాలమ్మా".

"అవేం మాటలన్నయ్యగారూ. ఒకే ఊరి వాళ్ళం. ఇరుగుపొరుగుగా కలిసిమెలిసి బ్రతికిన వారం. ఏదో కాలవైపరీత్యం మూలంగా విడిపోయాం. అంత మాత్రానే మనుషుల మీద అభిమానాలు చచ్చిపోతాయా? జ్యోతి గురించి మీరిక దిగులు వదిలేయండి. ఇకనుంచి తనూ మా ఇంట్లో ఒక మనిషిగా ఉండిపోతుంది".

"దిగులు కొంత తీరింది. కాని పూర్తిగా తొలగిపోదు కదమ్మా!" ఆయన మాటల్లోని భావం ఆమె గ్రహించింది. కూతురు భవిష్యత్తు గురించిన దిగులు ఆ తండ్రికి ఎలా తప్పుతుంది.

ముగ్గురి మధ్యా మౌనం కొద్దిక్షణాలు రాజ్యమేలింది.

ఈ ముగ్గురూ హాల్లో మాట్లాడుకుంటూ ఉన్నప్పుడే, వంటగదిలో జ్యోతి నాగమణితో మాటలు కలిపింది.

"మీ ఇల్లు చాలా బాగుంది నాగమణీ"

"నాకేమో మీ ఇల్లే నచ్చిందక్కా"

"సరేలే అయితే" నవ్వింది జ్యోతి. "ఇంతకీ వంట ఏం చేస్తున్నావ్? " ఆమె పక్కనే నిలబడి స్టౌకేసి చూసింది.

"రోజూ అయితే ఉదయాన్నే టిఫిన్‌తో పాటు అన్నంకూడా వండేస్తానక్కా. ఆఫీసు కెళ్ళేముందు భోంచేసి, బాక్సుల్లో టిఫిన్ తీసి కెళ్ళిపోతాం. ఈరోజు టిఫిన్‌గా ఉప్మా చేస్తున్నాను"

"నేతి వాసనొస్తోంది. నేతి ఉప్మానా? "

"అవునక్కా"

"పక్కనే పెసరట్టు కూడా ఉంటే, ఈరోజు తృప్తిగా టిఫిన్ లాగించేసేదాన్ని" ఆమె నవ్వుతూ అంది.

"ఇప్పుడయితే మాత్రం ఎంతసేపక్కా! ఒకగంట... పెసరపప్పు నానబోసేసి..."

నాగమణి మాటలు మధ్యలోనే కట్ చేసిందామె. "ఈరోజు త్వరగా హాస్పిటల్‌కి





వెళ్ళాలి. మరోరోజు వచ్చి నీ చేతివంట తృప్తిగా తింటాను".

"అంటే మీరిప్పుడు మళ్ళీ హాస్పిటల్‌కి వెళ్ళాలా? నేను మధ్యాహ్నం వంటకోసమని అన్నీ రెడీ చేస్తున్నాను"

"వద్దమ్మా! ఆదివారం అయినంత మాత్రాన మీకున్నట్టుగా నాకు శెలవు ఉండదు. ఏదయినా పండగ రోజున అందరం కులాసాగా గడుపుదాం. ఈరోజు సాయంత్రం నాన్నగారు ఊరెళ్ళిపోతున్నారు. ఆయన మిమ్మల్నందరినీ చూడాలంటేనూ- ఇలా తీసుకువచ్చాను"

"అంకుల్ ఈరోజే ఊరెళ్ళిపోతున్నారా? "

"అవునమ్మా" అని నాలుగు క్షణాల తర్వాత అడిగింది "మరి మీ ఇల్లంతా తిప్పి చూపించవూ? "

"ఇదిగో వస్తున్నానక్కా" బాణలిలో పోపు వేగిందని చూసి, నీళ్ళు పోసింది. "పదక్కా" అంది వంటగదిలోనుండి బయటకు నడుస్తూ. ఇద్దరూ హాల్లోకి వచ్చారు అటు నుండి బెడ్‌రూంలో కెళ్ళారు. ఎక్కువగా మేమిద్దరమే ఉంటుంటాం. అత్తయ్య ఇక్కడ ఆరు నెలలుంటే, మరో ఆరునెలలు కూతురు దగ్గర ఉంటుంది. అందుకే సింగిల్ బెడ్ రూమ్ ఇల్లు తీసుకున్నాం".

ఆతర్వాత పెరడులోకి వెళ్ళారు.

"ఇల్లు చాలా బాగుంది, సింపుల్‌గా చాల్లే!"

ఇద్దరూ హాల్లోకి వచ్చాక జ్యోతి వారిపక్కనే కూర్చుండిపోయింది. నాగమణి మాత్రం వంటగదిలో కెళ్ళిపోయింది.

పదినిమిషాల తర్వాత ఆమె హాల్లోకొచ్చి చెప్పింది "అత్తయ్యా! టిఫిన్ రెడీ"

"ప్లేట్స్ డైనింగ్ టేబుల్ మీదపెట్టు"

నలుగురూ వచ్చి టేబుల్ ముందు కూర్చున్నారు. నాగమణి వారికి వడ్డిస్తుంటే జ్యోతి అంది "నువ్వూ కూర్చో"

"నేనింకా స్నానం చేయలేదు. స్నానం చేసాక టిఫిన్ చేయడం అలవాటు"

టిఫిన్ తినడం పూర్తయ్యాక జ్యోతి లేచింది "నాన్నా! మిమ్మల్ని ఇంటి దగ్గర డ్రాప్ చేసి హాస్పిటల్‌కి వెళ్తాను."

యశోదమ్మ జోక్యం చేసుకుంటూ అంది "ఆయన చాలాకాలానికి వచ్చారు. మమ్మల్ని కాసేపు మాట్లాడుకోనివ్వు. నువ్వు హాస్పిటల్ నుండి వెళ్ళేప్పుడు ఇలా వస్తే తీసుకెళ్ళి పోవచ్చు".

"ఆ పని చేయమ్మా" అన్నాడు శంకర్రెడ్డి.

జ్యోతి భుజాలెగరేసి "అలాగే" అంది.

ఆమె వెళ్ళిపోతుంటే వీధివాకిలి వరకూ వచ్చిన నాగమణి ఆమెతో చెప్పింది. "అక్కా! పండగ రోజునయితే అందరం కలిసి గడుపుదాం అన్నావు. దీపావళి దగ్గరలోనే ఉంది. ఆరోజున నువ్వు తప్పకుండా మాతోనే గడపాలి. ఇంకేం అభ్యంతరం చెప్పకు"

జ్యోతి నవ్వుతూ అంది "అలాగేలే!".

"అలా తేలికగా తీసిపారేస్తే కాదు. ఆరోజున నేనూ, ఆయన మీ ఇంటికొచ్చి మరీ నిన్ను తీసుకొచ్చుకుంటాం. ఎక్కడికీ వెళ్ళకేం"!

"మీరు రావడం ఎందుకులే నాగమణీ! నేనే పదింటిలోపు ఇక్కడుంటాను. నిజం! తప్పకుండా వస్తాను."

"పదింటిలోపు రాకపోతే మాత్రం మేము అక్కడికి రావలసి ఉంటుంది" బెదిరిస్తున్నట్టుగా అంది నాగమణి.

జ్యోతి కారెక్కి ఇంజన్ స్టార్ట్ చేస్తూ "అలాగే" అంది నవ్వుతూ. నాగమణి చెయ్యి ఊపాక కారు ముందుకెళ్ళిపోయింది.

నాగమణి లోపలికి వచ్చాక శంకర్రెడ్డి

చెప్పారు. "నేనున్నానని నన్ను వదిలి వెళ్ళడం బాగుండదని మీరు మొహమాట పడి మీ ప్రోగ్రాంలు ఏవైనా ఉంటే మాను కోకండి. నేనూ, యశోదమ్మ మాట్లాడు కుంటాం. మూడు గంటలకి అమ్మాయొ స్తుంది. ఐదుగంటలకి ట్రైయిన్‌కి వెళ్ళిపోతు న్నాను" అన్నాడు శంకర్రెడ్డి

"మరో రెండురోజులు ఉండకూడదా బాబాయ్‌గారూ? "

"లేదమ్మా! ఇప్పటికే రెండురోజులయిపో యింది. మీరయితే ఉద్యోగాలకు శెలవు పెట్ట గలరు. మీరు చూడాల్సిన కాగితాలు మరె వరైనా చూస్తారు. కాని రైతు తన పొలాన్ని తనే చూసుకోవాలి"

సుధాకర్ లేచి అన్నాడు "ఈరోజు మాకే ప్రోగ్రాంలూ లేవండి! మీతోనే గడు పుతాం... ఇదిగో ఇప్పుడే స్నానం చేసి వచ్చే స్తాను"

"అలాగే బాబు" అంటూ శంకర్రెడ్డి తల వూపి విశ్రాంతిగా వెనక్కి వాలాడు. సుధా కర్ లోపలికెళ్ళిపోయాడు. నాగమణి డైనింగ్ టేబుల్ శుభ్రం చేస్తోంది.

యశోదమ్మ మాటలు కొనసాగించింది. "జ్యోతి గురించి మావాడు నాకంతా చెప్పా డండీ. బంగారంలాంటి ఆపిల్లబ్రతుకు ఇలా అయిపోయిందేమిటా? అని నేను చాలా బాధపడ్డాను. దేవుడు ఆ పిల్లకు అన్నీ ఇచ్చాడు. కాని ఒకే ఒక లోపం పెట్టి అంతులేని దుఃఖాన్ని కూడా ఇచ్చాడు" చాలా బాధగా పలికిందామె.

"నిజమే! ఇది ఆమెకు ఆ దేవుడు చేసిన ద్రోహమేనమ్మా. లేకపోతే నా చిట్టితల్లికి ఏం తక్కువ? అన్నీ అవసరానికి మించి ఉండికూడా, ఇలా ఒంటరి బ్రతుకు బ్రత కాల్సి వచ్చిందంటే అది ఆ దేవుడు చేసిన ద్రోహమే కదమ్మా. ఆడదానికి అన్ని సంప దలూ ఇచ్చి, సంతాన యోగ్యత లేకుండా చేస్తే చాలు, ఇక ఆ స్త్రీకి ఆ సంపదలేవీ ఆనందాన్నివ్వవు. అంతేకాదు, ఆ స్త్రీ బ్రతుకు దుఃఖమయమే" ఆయన గొంతు గాద్గదికమ యింది.

యశోదమ్మ మరేదో అనబోతుంటే, ఇంటి ముందు కారాగిన చప్పుడయింది. ఆమె తలతిప్పి, అటుకేసి చూసింది.

ఆరడుగుల ఎత్తున్న ఓ యువకుడు కారు దిగి లోపలికొస్తూ కనిపించాడు. ఆ యువ కుడిని ఎక్కడో చూసినట్టనిపించింది గానీ, గుర్తుపట్టలేక పోయిందామె.

అతడు లోపలికొచ్చాక, ఆమె ముందు నిలబడి "హలో ఆంటీ ఎలా ఉన్నారు? " అన్నాడు.

యశోదమ్మ రెండు క్షణాల తర్వాత గుర్తుపట్టింది. "నువ్వు.. నువ్వు మురళివి కదూ? ".

"హమ్మయ్యా! మొత్తం మీద గుర్తొచ్చాన న్నమాట? " అతడు నవ్వుతూ ఆమె పక్కనే కూర్చున్నాడు.

అప్పుడే బాత్‌రూంనుండి టవల్ చుట్టు కుని బెడ్‌రూంవైపు నడవబోతున్న సుధాకర్ అటు చూసి సంబరంగా హాయ్ మురళీ! వాటే సర్‌ప్రయిజ్ విజిట్!... వన్ మినిట్! బట్టలు వేసుకుని వచ్చేస్తాను" అంటూ బెడ్‌రూం వైపు వెళ్ళాడు.

యశోదమ్మ మురళి చేతిని ఆప్యాయంగా చేతిలోకి తీసుకుని "ఎంత కాలమయిం దయ్యా నిన్ను చూసి! అప్పుడెప్పుడో మావాడు విజయవాడలో ఉన్నప్పుడు రోజూ చూసేదాన్ని".

మురళి అప్పుడే ఎదురుగా ఉన్న శంకర్రె డ్డిని చూసి "ఈయన...? " అన్నాడు ప్రశ్నా ర్థకంగా.

"ఈయన పేరు శంకర్రెడ్డిగారు. మేము విజయవాడకు రాకముందున్న పల్లెలో కల




సిమెలసి తిరిగిన మనుష్యులం. ఈయన కూతురు జ్యోతి స్కూల్‌లో మావాడితో కలిసి చదువుకుంది"

అప్పుడే మురళికి సుధాకర్ ఆ డాక్టర్ గురించి చెప్పిన విషయాలు గుర్తొచ్చాయి.

"నమస్తే" చేతులు జోడించాడు.

శంకర్రెడ్డి అతడికేసి తదేకంగా చూస్తూ చేతులు జోడించాడు. అంతలో సుధాకర్ అతడి దగ్గరగా వచ్చి "అయితే, మొత్తం మీద మా ఇల్లు వెతుక్కుంటూ వచ్చావన్న మాట" అన్నాడు.

"వచ్చాను. కానీ ఎక్కువ సేపు ఉండేం దుకు కాదు. మనిద్దరం ఎయిర్‌పోర్ట్ వరకూ వెళ్ళి ఓ వ్యక్తిని రిసీవ్ చేసుకోవాలి. ఆయన్ని గెస్ట్‌హవుస్ దగ్గర దించేసి, మధ్యాహ్నం లంచ్ అయ్యాక ఇక్కడకు వచ్చేద్దాం!".

"ఎవరాయన? " అనుమానంగా అడిగాడు సుధాకర్.

"నా ఫాక్టరీలో ప్రొడక్ట్‌కి సోల్ డిస్ట్రిబ్యూషన్ తీసుకునేందుకు వచ్చిన ఓ కోటీశ్వరుడు.

"సరే వెళ్దాం పదా" సుధాకర్ పైకి లేచి భార్యను పిలిచాడు.

నాగమణి లోపలినుంచి వచ్చాక మురళిని పరిచయం చేస్తూ "నేను అప్పుడప్పుడూ చెబుతూ ఉంటానే మురళీ అని... కాలేజీలో నా బెస్ట్‌ఫ్రెండ్. మన పెళ్ళిలో కూడా పరిచయం చేశాను. మనిషిని మర్చిపోయావేమో!" అన్నాడు.

ఆమె చిరునవ్వుతో "నమస్కారమండీ" అంది.

మురళి కూడా చిరునవ్వుతో మౌనంగానే ప్రతినమస్కారం చేసి, యశోదమ్మ వైపు తిరిగి చెప్పాడు. "ఆంటీ! మరిక మేం బయలుదేరుతాం"

ఆమె తలాడించింది. ఇద్దరూ బయటకు నడిచారు.

★ ★ ★

ఆమె మెట్లు దిగి కారు వైపు నడుస్తుండగా చాలా దగ్గరనుండి వినిపించింది "జ్యోతీ" అని

ఆ సుపరిచిత స్వరానికి ఆమె చప్పున తలతిప్పి అటు చూసింది.

నాలుగడుగుల దూరంలో కారు వెనక వైపు నిలబడి ఉన్నాడు సతీష్. తను అతడిని దాటుకుని వెళ్తూ కూడా గమనించలేదు.

అతడు ఆమె దగ్గరగా నడిచి "ఇంటికేనా? " అడిగాడు.

ఆమె మౌనంగా తలాడించింది.

"మామయ్యగారు ఇంట్లోనే వున్నారా? "

"లేరు. నా ఫ్రెండు ఇంట్లో ఉన్నారు. ఆయనను పికప్ చేసుకునేందుకే వెళ్తున్నాను" అసలు అతడితో మాట్లాడాలనిపించలేదు. కాని అతడు తనకు తాళికట్టాడు. నిన్న మొన్నటి వరకూ కలిసి కాపురం చేసారు... ఒకవేళ శత్రువే పలకరించినా తల తిప్పుకుని పోవడం తనకిష్టం ఉండదు.

"అయితే అలా వెళ్దాంరా. ఐస్‌క్రీమ్ పార్లర్‌లో కూర్చుని కాసేపు మాట్లాడుకుందాం"

ఆమె కొద్దిసేపు తటపటాయించింది. వీలయినంత వరకూ అతడిని దూరంగా ఉంచాలని మనసు కోరుకుంటోంది.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్? "

"అక్కడ నాన్నగారు, నాకోసం ఎదురు చూస్తూ ఉంటారు. వెళ్ళాలి"

"అంత అర్జంటా? "

"నాన్నగారు సాయంత్రం ట్రైన్‌కి వెళ్ళిపోతున్నారు. ఆయనతో కాసేపు మాట్లాడి ట్రైన్ ఎక్కించాలి"

"అలాగా" అన్నాడు అతడు. "సరే, ఇక్కడే కాసేపు మాట్లాడుకుందాం".

'తనతో మాట్లాడే అవసరం ఏముం

టుంది? ' ఆశ్చర్యపోలేదు ఆమె. వయసులో ఉన్న ఒంటరి ఆడదాన్ని, అందులో కాస్తో కూస్తో డబ్బున్నదాన్ని వదులుకోవాలని ఏమగాడు అనుకోడు? అతడు మాజీ మొగుడైనా సరే.

ఆమె నవ్వుతూ భుజాలెగరేసింది. 'అతడి వలలో చిక్కకుండా తనను తాను రక్షించుకోవడమెలాగో ఆమెకు తెలుసు. అందువల్లే మాట్లాడడంలో తప్పు లేదనుకుంది తను.

"ఏమిటి విశేషాలు జ్యోతి? ".

"ఏమున్నాయ్! అంతా మామూలే".

"అది సరే! మామయ్యగారు ఏదయినా పనిమీద వచ్చారా? లేక నిన్ను చూసి వెళ్ళేందుకే వచ్చారా? "

"నాకోసం ఓ సంబంధం తీసుకువచ్చారు"

అతడి చెయ్యి కారు బాడీ మీదనుండి జారింది. అతడు ముందుకు తూలిపడబోయి అతికష్టంమీద నిలదొక్కుకున్నాడు.

"నీకు... నీకు...".

"అవును. అతడూ డాక్టరేనట. అఫ్‌కోర్స్! పెళ్ళయిపోయి ఇద్దరు పిల్లలట. కాని అతని మిసెస్ కారు యాక్సిడెంట్‌లో చనిపోయిందట. అతడికిక పిల్లలతో అవసరం లేదు. నాకూ పిల్లలు పుట్టే అవకాశమూలేదు. అందుకే 'మేడ్ ఫర్ ఈచ్ అదర్'లా ఉంటామని నాన్నగారు చాలా సంబరంగా ఈ సంబంధం తీసుకువచ్చారు" ఆమె అతడి ముఖకవళికలు గమనించసాగింది.

అతడు అసహనంగా పెదవులు కొరుక్కున్నాడు "మరి... మరి నువ్వేమన్నావ్? "

"అనడానికి ఏముంది. నేనూ చాలా రోజులుగా ఈ ఒంటరి జీవితంతో విసిగిపోయి ఉన్నాను. మగాడి తోడు, విలువ ఇప్పుడిప్పుడే తెలిసి వస్తోంది. విడాకులు తీసుకున్న ఆడదాన్నయినా అభిమానంగా చూసే మగాళ్ళు ఈ ఆంధ్రరాష్ట్రంలో చాలా మందే ఉన్నారు. అందులోనూ రెండో మొగుడికి, మొదటి పెళ్ళాం లేకపోతే రెండో పెళ్ళాంమీద అపరిమితమైన ప్రేమ పుట్టుకొస్తుందని చరిత్ర చెప్పిన సత్యం. నేనూ అలాంటి ప్రేమను అనుభవించాలనుకుంటున్నాను. అందులోనూ అతడికి పిల్లలున్నారు కాబట్టి నాకు మంచి టైంపాస్ కూడా..."

తన ప్రతిమాటా అతడి గుండెల్లో బాకులా గుచ్చుకుంటూ ఉంటుందని ఆమెకు తెలుసు. అలా అతడిని ఏడిపించడం తప్పో ఒప్పో తెలియదు గానీ తన మనసులో అతడి పట్ల పేరుకుపోయిన కసి తనతో అలా మాట్లాడిస్తోందని అర్థమయింది.

"అలాగా!... సరే... సరయితే నేను మళ్ళీ కలుస్తాను" అతడు వడివడిగా ముందుకు నడిచాడు. కారు డ్రైవింగ్ సీట్లో కూర్చుని, ఇంజన్ స్టార్ట్ చేసాడు.

ఆమె నవ్వుతూ చెయ్యి ఊపింది. అతడూ చెయ్యిఊపి కారు ముందుకు పోనిచ్చాడు.

సతీష్‌తో అలా మాట్లాడాక, తనకు కాస్త తృప్తిగా అనిపించింది. తన మనసులోని భావాలు, ప్రయత్నాలు తెలుసుకున్నాక అతడు ఇప్పట్లో తనను కలుసుకునేందుకు లేదా మాట్లాడేందుకు ప్రయత్నించకపోవచ్చు

పదిహేను నిమిషాల తర్వాత ఆమె కారు సుధాకర్ ఇంటిముందు ఆగింది.

ఆమె కోసమే ఎదురు చూస్తున్నట్టుఉన్న శంకర్రెడ్డి లేచి ఎదురొస్తూ "వెళ్దామామ్మా" అన్నాడు.

తలూపిందామె.

"వెళ్ళొస్తాం యశోదమ్మా".

యశోదమ్మ తలాడిస్తూనే "కాస్త కాఫీ తాగి వెళ్ళకూడదామ్మా!" అని "అమ్మాయ్ నాగమణీ" అంటూ కేకవేసింది.

నాగమణి లోపలినుంచి వచ్చి జ్యోతిని చూసి చిరునవ్వుతో "రా అక్కా! ఏమిటి లోపలికి రాకుండానే వెళ్ళిపోతున్నావ్? "




అంది.

"లేదు నాగమణి! ఇంటికి వెళ్ళి అటు నుంచి స్టేషన్‌కి వెళ్ళాలి. పెద్దగా టైంలేదు"

"సరే! ఈసారికి వదిలేస్తున్నా! దీపావళికి రావడం మాత్రం మర్చిపోవద్దు!"

జ్యోతి నవ్వి తలాడించింది.

మరునిమిషంలోనే కారు ఆ ఇంటి నుండి దూరమయిపోయింది.

ఆ సాయంత్రం జ్యోతి తండ్రిని ట్రైన్ ఎక్కిస్తూ చెప్పింది.

"మీ మాట కాదన్నానని బాధపడకండి నాన్నా! నేను వాస్తవాలను చూస్తూ చెపుతున్న మాటలు అవి. ఏదేమయినా అతి త్వరలో మిమ్మల్ని ఎంతో కొంత సంతోష పెట్టే నిర్ణయమే తీసుకుంటాను. ప్రామిస్".

ఆయన మెల్లగా తలాడించాడు.

ట్రైయిన్ తండ్రీ కూతుళ్ళను దూరం చేసింది.

మురళి సుధాకర్‌లు ఇంటికి తిరిగొచ్చేసరికి, సాయంత్రం ఐదయింది.

సుధాకర్ ఇంట్లోకి రావడంతోనే తల్లిని అడిగాడు "శంకర్రెడ్డి గారేరి? ".

"వాళ్ళు బయలుదేరి వెళ్ళి గంట దాటిపోయిందిరా!"

"అలాగా" అని ఆగి మురళివైపు తిరిగి చెప్పాడు "కూర్చోరా"

మురళి సోఫాలో కూర్చున్నాడు. సుధాకర్ అతడి పక్కనే కూర్చున్నాడు.

టీ తెచ్చింది నాగమణి. ముగ్గురికీ కప్పులు అందించాక లోపలికెళ్ళిపోయింది.

యశోదమ్మ టీ తాగుతూ అతడిని విజయవాడ విశేషాలు అడగసాగింది. ఇక్కడ అతడు చేస్తున్న బిజినెస్ గురించి కూడా అడిగి కొంత తెలుసుకుంది.

టీ తాగడం పూర్తయ్యాక సుధాకర్ లేచి "పదరా డాబామీదికి వెళ్దాం" అని తల్లివైపు తిరిగి అన్నాడు "అమ్మా! మురళి రాత్రికి ఇక్కడే భోంచెయ్యబోతున్నాడు" చెప్పాడు.

"తనిప్పుడు వెళ్తానన్నా వెళ్ళనివ్వం కదా? " ఆమె నవ్వుతూ అంది. "పదండి పైకి వెళదాం! పైన బట్టలు ఆరేసి ఉన్నాయి. తెచ్చుకుంటాను" అంది యశోదమ్మ బయలుదేరుతూ.

సుధాకర్ రెండు గాద్రేజ్ కుర్చీలతో సహా డాబా పైకి చేరాడు. మిత్రులిద్దరూ కూర్చున్నాకా యశోదమ్మ పొడిబట్టలను సేకరించడం మొదలెట్టింది.

యశోదమ్మ మురళిని అడిగింది "మురళీ! నువ్వింకా పెళ్ళి చేసుకోలేదని విన్నాను".

మురళి నవ్వాడు. జవాబుగా మరేం మాట్లాడలేదు.

అంతలోనే ఆమె అంది "సరేలే! నువ్వు పెళ్ళి చేసుకోలేదు. కాని పెళ్ళి చేసుకున్న వాళ్ళు మాత్రం ఏం సుఖపడుతున్నారులే! మానాడి సంగతి చూస్తే పిల్లా జెల్లా లేకుండా కళాకాంతి లేని కుటుంబమయింది. పాపం! అటు జ్యోతి బ్రతుకు చూస్తే, పిల్లలు పుట్టడం లేదని మొగుడు విడాకులిచ్చాడు. ఈ కాలంలో పెళ్ళి కానివాళ్ళవి ఒక రకం కష్టాలయితే, పెళ్ళి అయినవారివి మరోరకం కష్టాలు".

టాపిక్ డైవర్ట్ చేయడంకోసం మురళి అన్నాడు "ఆ డాక్టర్ నీకు చిన్నప్పటి స్నేహితురాలా? ".

"అవున్రా! ఒకటో తరగతి నుండి పదోతరగతి వరకూ ఒకే స్కూల్‌లో- ఒకే క్లాసులో చదువుకున్నాం. విజయవాడ వచ్చాకే కదా మీరంతా స్నేహితులయింది"

"ఆమె అంటే మీ ఇంట్లో వారందరికీ చాలా అభిమానం ఉన్నట్టుందే? " నవ్వుతూ అడిగాడు.

"అవున్రా! అభిమానం చాలానే ఉంది!



కాని ఆమె బ్రతుకులోని చీకటిని తొలగించాలని మా మనసుల్లో ఉన్నా మేము మాత్రం ఏమీ చేయలేకపోతున్నాం. అగమ్యగోచరంగా ఉన్న ఆమె బ్రతుకును ఒక గమ్యం చేర్చలేకపోతున్నాం".

మురళి ఆసక్తిగా ముందుకు వంగి అన్నాడు. "ఆమె బ్రతుకు అగమ్యగోచరంలా ఉండడమేమిటి? " అని. అంతకు ముందు ఆమె గురించిన వివరాలు అంత ఆసక్తిగా వినలేదు తాను.

సుధాకర్ జ్యోతి గురించి మళ్ళీ పూర్తిగా చెప్పాడు. ఆమె 'ఒంటరి జీవితం... శంకర్రెడ్డి చేస్తున్న పెళ్ళి ప్రయత్నాలు...

అతడు చెప్పడం పూర్తయ్యాక కూడా మురళి కొద్ది క్షణాలు మాట్లాడలేనట్టు మౌనంగా ఉండిపోయాడు.

అతడి ముఖంలోని ఫీలింగ్స్ చూశాక సుధాకర్ బాధగా నవ్వుతూ "ఆమె కథ చాలా బాధాకరంగా ఉంది కదూ? " అన్నాడు.

తలాడించాడు మురళి.

మిత్రులిద్దరూ మాట్లాడుకుంటూ ఉండగానే చీకటిపడింది. కాలం ఎంతగడిచిందో తెలియదు.

నాగమణి డాబా మెట్లెక్కివచ్చి "స్నేహితులిద్దరూ కాలమే మరిచిపోతే పోయారు, కనీసం చలికూడా అనిపించడం లేదా? " అంది నవ్వుతూ.

వారిద్దరూ నవ్వారు.

"ఇక కిందికి వస్తే భోజనాలు చేయొచ్చు" ఆమె చెప్పింది.

వారిద్దరూ పైకి లేచి కుర్చీలు చేతపట్టుకుని కిందికి దిగారు.

భోజనాలయ్యాక మురళి బయల్దేరుతుంటే యశోదమ్మ చెప్పింది "తరచుగా వస్తూ ఉండు బాబూ"

అప్పుడే గుర్తొచ్చినట్టు సుధాకర్ చెప్పాడు. "అన్నట్టు చెప్పడం మరచిపోయాన్రా! దీపావళికి జ్యోతి మా ఇంటికొస్తుంది. ఆరోజు నువ్వూ రారా! ఎందుకంటే నా స్కూల్ మేట్, కాలేజీమేట్ ఇద్దరు స్నేహితులతో ఆరోజు ఆనందంగా గడపాలని ఉంది. జ్యోతిని నీకూ పరిచయం చేస్తాను"

మురళి ఆరుసెకన్ల తర్వాత తలాడిస్తూ "అలాగే వస్తాను" అన్నాడు.

ఎందుకో తెలియదు అతడికి- జ్యోతిని ఓసారి చూడాలనిపిస్తోంది. బహుశ తన మీద తానే జాలిపడే వ్యక్తి, తనలాంటి పరిస్థితిలోనే ఉన్న మరోవ్యక్తిమీద జాలిపడడం, ఆ వ్యక్తిని చూడాలనిపించడం సహజాతి సహజం.

"మీరు తప్పకుండా రావాలి" నాగమణి చెప్పింది.

అతడు సన్నగా నవ్వి "తప్పకుండా వస్తాను" అన్నాడు.

★ ★ ★

దీపావళి!

ఉదయమే తలస్నానం చేద్దామని ఆమె బట్టలు తీసుకుని బాత్‌రూంలో కెళ్లబోతుండగా ఫోన్ మోగింది. రిసీవర్ చేతిలోనికి తీసుకుంది. "హలో" అంది.

అవతలివైపు నుండి సుధాకర్ పలికాడు. "జ్యోతీ! నేను బయలుదేరుతున్నాను. రెడీగా ఉన్నావు కదా? "

"స్నానానికి వెళ్ళబోతున్నాను. అయినా ఇల్లు నాకు కొత్తేంకాదుకదా..."

ఆమె మాటలు మధ్యలోనే కట్‌చేస్తూ అతడు అన్నాడు. "అదికాదు జ్యోతి! అక్కడికి వచ్చి పిలుచుకుని రావడం బాగుంటుందేమోనని"

"నో ఫార్మాలిటీస్ ప్లీజ్... నేనే మరోగంటలో అక్కడికి వచ్చేస్తున్నాను. ఓ.కే!"

"సరే అయితే"

ఆమె ఫోన్ పెట్టేసి నవ్వుకుంది.




సతీష్‌నుండి విడిపోయాక కొద్దిరోజుల క్రితం వరకూ తనకు జీవితం చాలా నిస్సారంగా అనిపించింది. ఏదయినా పండగ వచ్చినా రొటీన్ జీవితంలో మార్పు కనిపించేది కాదు. ఆరోజు డ్యూటీ ఉంటే, డ్యూటీకి వెళ్ళిపోయేది. లేకపోతే పదింటివరకూ బద్ధకంగా నిద్రపోయేది. కాని ఈరోజు తన జీవితంలో కొత్త అధ్యాయం ప్రారంభమయినట్టనిపిస్తోంది. కొంతమంది మిత్రులవల్ల జీవితం ఎలాంటి మలుపులు తిరుగుతుందో ఇప్పుడే అర్థమయింది.

పావుగంటలో స్నానం ముగించుకుని, మరో పావుగంటలో రెడీ అయి కారులో బయలుదేరిందామె.

కారు ఇల్లు చేరేసరికి సుధాకర్ వరండాలోనే కుర్చీలో కూర్చుని ఉన్నాడు. అతడు తన కోసమే ఎదురుచూస్తున్నట్లుంది.

ఆమె కారు దిగి లోపలికి నడుస్తుంటే అతడు ఆమె వెంట ఇంట్లోకి నడిచాడు.

యశోదమ్మ ఆమెను చూసి "వచ్చావామ్మా! రారా... నీకోసమే అందరం ఎదురుచూస్తున్నాం" అంది.

జ్యోతి హాల్లో ఆగలేదు. "నాగమణి ఏం చేస్తోంది? "

"వంటగదిలో ఉందమ్మా. టిఫిన్ రెడీ చేస్తున్నట్టుంది"

జ్యోతి వంటగదివైపు నడిచింది.

అలికిడి కావడంతో తలతిప్పి చూసిన నాగమణి, ఆమెను చూసి "రా అక్కా! ఇప్పుడేనా రావడం? " అడిగింది.

"జస్ట్ ఇప్పుడే..." అంటూ ఆమె పక్కగా వెళ్ళి నిలబడింది. నాగమణి పెసరట్టు మడిచి హాట్‌ప్యాక్‌లో పడేస్తోంది.

"ఒకవేళ నేను జోక్‌గా అడిగానే అనుకో అది చేసేయడమేనా? "

"పెసరట్టూ, ఉప్మా కాంబినేషన్ ఇంట్లోవాళ్ళకి కూడా చాలా ఇష్టమక్కా. నీకూ ఇష్టమేనని తెలిసిన తరువాత చేయకుండా ఎలా ఉంటాను? "

ఆమె సిగ్గుపడింది.

టిఫిన్ చేయడం పూర్తయి అందరూ హాలులోని సోఫాలలో కూర్చున్నప్పుడు సుధాకర్ అన్నాడు "అమ్మా! నేను బయటకు వెళ్ళి టపాసులు పట్టుకొస్తాను. అలాగే మురళికి త్వరగా రమ్మని ఫోన్ చేస్తాను"

"అలాగేరా" అంది యశోదమ్మ.

అప్పుడే గుర్తొచ్చినట్టు అతడు నాగమణి వైపు తిరిగి చెప్పాడు "మణీ! వాడికి గుత్తి వంకాయ కూర అంటే మహాఇష్టం. అలాగే గడ్డపెరుగు లేకపోయినా భోంచేయలేడు. మధ్యాహ్నం భోజనంలో ఆ రెండూ ఉండేలా చూసుకో"

ఆమె తలాడించింది.

అతగాడలా మరో వ్యక్తి ఆహారపు అలవాట్లు కూడా చెప్పేస్తుంటే ఆ వ్యక్తి ఎవరో తెలుసుకోవాలన్న క్యూరియాసిటీ కలిగింది జ్యోతికి. అందుకే "మురళి ఎవరు? " అతడిని అడిగింది.

"చిన్నప్పుడు పల్లెలో నువ్వు నాకు ఫ్రెండ్ పయితే పెద్దయ్యాక వాడు నాకు ప్రాణస్నేహితుడుగా మారాడు. మేమిద్దరం కలిసి బెజవాడ వీధుల్లో పిచ్చిగా తిరిగేవాళ్ళం. కలిసి సినిమాలు చూసేవాళ్ళం. వన్‌బై టూ కాఫీలు తాగేవాళ్ళం. అలాగే వారంలో ఒక రోజయినా నేను వాడింట్లో భోంచేసేవాడిని. ఐదేళ్ళు కలిసి తిరగడంవలన వాడి అలవాట్లన్నీ నాకు బాగా తెలుసు"

అంతలో యశోదమ్మ అంది. "మురళి చాలా మంచివాడమ్మా జ్యోతీ. కోటీశ్వరుల బిడ్డే అయినా కాసింతయినా గర్వం ఉండేది కాదు. బెజవాడలో ఉన్నప్పుడు మా ఇంటికి తరచుగా వచ్చేవాడు. తను వచ్చే సమయానికి నేను మా వాడికి భోజనం పెడుతుంటే తనూ పక్కనే కూర్చుని గోరుము

ద్దలు పెట్టించుకుని తినేవాడు. పాపం! చిన్నప్పుడే తల్లి చనిపోవడంతో తల్లిప్రేమ కోసం తల్లడిల్లిపోతూ కనిపించేవాడు..." ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది.

"అయితే ఈ దీపావళికి నీకు దగ్గరయిన మరో స్నేహితుడిని నాకు పరిచయం చేయ బోతున్నావన్నమాట" నవ్వింది జ్యోతి.

"నా ఆలోచన కూడా అదే. మురళిలాంటి మంచివ్యక్తి ఈ ప్రపంచంలో కోటికొక్కరు మాత్రమే ఉంటారు. అలాంటి వ్యక్తికి స్నేహితుడిగా ఉండడం నిజంగా అదృ ష్టంగా భావించాలి ఎవరయినా"

"అలాగా" అందామె. అతడు చెబుతున్న మాటలవలన ఆమెకు ఆ వ్యక్తిని చూడాలని పించింది.

రెండు నిమిషాల తర్వాత సుధాకర్ చేతి సంచి పట్టుకుని బయటకెళ్లిపోయాడు. మరునిముషం బయట స్కూటర్ స్టార్టయి, శబ్దం మెల్లగా దూరమయింది.

జ్యోతి, నాగమణి కిచెన్‌వైపు వెళ్ళేసరికి, తను హాలులో ఉండి ఏం చేయాలో తోచ నట్టు యశోదమ్మ కూడా కిచెన్‌లో కెళ్ళింది.

నాగమణి గులాబ్‌జామూన్‌కి పొడరు కలుపుతుంటే, గుత్తివంకాయ కోసం వంకా యలు కట్ చేయసాగింది జ్యోతి.

వారిద్దరూ పనులు చేసుకుంటూ ఉంటే యశోదమ్మకూ తనూ ఓ చెయ్యి వేయక తప్పలేదు. ఆమె స్టౌమీద పాయసం కోసం నీళ్ళగిన్నె పెట్టింది. నీళ్ళు వేడెక్కాక సగ్గు బియ్యం పొయ్యాలి. ఆలోపు ఏమీ ఉబుసు పోనట్టు ఆమె జ్యోతి పక్కన చేరి మెల్లగా అంది. "జ్యోతీ! నేనో విషయం అడుగు తాను. నిజం చెబుతావామ్మా? "

జ్యోతి ఆమెవైపు తలతిప్పి అదోలా చూస్తూ "ఏమిటో అడగండాంటీ" అంది. నాగమణి కూడా అత్తగారి వైపు అనుమా నంగా చూసింది.

యశోదమ్మ కాస్త ఇబ్బంది పడుతూనే అడిగింది "నిజం చెప్పమ్మా! నా కోడలికి నిజంగా పిల్లలు పుడతారా? "

జ్యోతి కొద్దిగా తడబడింది. "మీకా అను మానం ఎందుకొచ్చిందాంటీ? " అంది నవ్వేస్తూ.

"ఏడేళ్లుగా పేరుకుపోయిన నిరాశ నన్ను అలా అనుమానపడేలా చేస్తోందమ్మా. ఈ ఏడేళ్లలో ఎన్నో పూజలు చేశాను. ఎందరో దేవుళ్లకి మొక్కాను. ఫలితం లేదు. అసలు దానికి పిల్లలు పుట్టకపోవడానికి కారణం ఏంటి? "

జ్యోతి నాగమణి ముఖంవైపు ఓసారి చూసింది. ఆ తరువాత కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయింది. ఆ తర్వాత పలి కింది "మీ కోడలికి పిల్లలు పుట్టకపోవడానికి కారణం చిన్న శారీరక లోపం. ఆమె గర్భంలో ఫాలోపియన్ నాళాలు మూసుకు పోయాయి"

"అలాంటి సమస్య ఉంటే ఇక పిల్లలు పుట్టే అవకాశం లేదామ్మా? దయచేసి నాకు కాస్త వివరంగా చెప్పు జ్యోతి"

"అవకాశాలు ఉన్నాయి ఆంటీ! నాలా గర్భాశయం మరీ చిన్నదిగా ఉంటే పిల్లలు పుట్టే ఆశ వదులుకోవలసిందే. కాని ఫాలో పియన్ నాళాలు మూసుకుపోతే, గతంలో అయితే ట్యూబో ప్లాస్ట్ శస్త్రచికిత్స చేసే వారు. ఆ శస్త్రచికిత్స ఫెయిలయితే వైఫల్యం ఒప్పుకుని ఇక ఆ ఇల్లాలికి గర్భధారణ అవ కాశం లేదని చెప్పేసేవాళ్ళం. అయితే ఇప్పుడు ఈ సమస్యకు చాలా ప్రత్యామ్నా యాలు వచ్చాయి. ఇన్‌వెట్రో ఫెర్టిలైజేషన్ ద్వారా తన సమస్యను పరిష్కరించవచ్చు. మీరు నామీద భారం వదిలేసెయ్యండి ఆంటీ! ఓ సంవత్సరం లోపే మీ చేతుల్లో ఒక మనవడినో, మనవరాలినో ఉంచే బాధ్యత నాది"

యశోదమ్మకే కాదు. నాగమణికీ ఆ




మాటలు చాలా సంతృప్తినిచ్చాయి.

కొద్దిసేపటి తర్వాత యశోదమ్మ సమస్య గురించి పూర్తిగా తెలుసుకోవాలనే క్యూరియాసిటీతో అడిగింది.

"అసలు ఈ సమస్య నా కోడలికే ఎందుకు వచ్చిందో? గత జన్మలో మనం చేసుకున్న పాపపుణ్యాలే అందుకు కారణం అనుకుంటా"

యశోదమ్మ మాటలకు జ్యోతి నవ్వింది. "మీరు చెప్పే పాపపుణ్యాల గురించి నాకు తెలియదుగానీ ఆంటీ... పిల్లల్ని కనడం మగాడి సామర్థ్యానికో, లేక స్త్రీత్వపు పటుత్వానికో నిదర్శనమనుకుంటే అది పొరపాటు! మనిషికి వచ్చే అన్ని శారీరక రుగ్మతల్లాగే ఇదీ ఓ శారీరక రుగ్మత. కాకపోతే అన్ని శారీరక రుగ్మతలూ ఆ ఒక్క మనిషినే బాధపెడితే, వంధ్యత్వం అనే ఈ రుగ్మత భార్యాభర్తల్లో ఒకరికి ఉంటే, మరొకరు దానివల్ల పీడితులవుతున్నారు. మీకింకో విషయం తెలుసా... నేనూ నిన్ననే ఓ సైన్స్ మాగజైన్‌లో చదివాను. ఈ దేశంలో క్షయవ్యాధి కోటి యాభైలక్షలమందిని పీడిస్తోంది. మూర్ఛవ్యాధి ఎనభైఐదు లక్షల మందిని బాధిస్తోంది. కానీ ఈ వంధ్యత్వం ఒక కోటీ అరవైలక్షల దంపతులు అంటే మూడుకోట్ల ఇరవైలక్షల మంది వ్యక్తులను తీరని వ్యధకు గురిచేస్తోంది..."

యశోదమ్మ చాలా ఆశ్చర్యపోయింది.

"అంటే ఆ కోటి అరవైలక్షల దంపతులకు ఇక పిల్లలు పుట్టే అవకాశం ఎంత మాత్రమూ లేదా?"

"అదే పొరపాటు. ఎనభైయ్యవ దశకంలో నిస్సంతుల సంఖ్య ఇంతగా ఉండేది కాదు. వాతావరణ కాలుష్యం, పెరిగిన ఫ్యాషన్లు, టెన్షన్స్ తెచ్చిన విపరీతం మనిషిని అంతర్గతంగా ఇంత బలహీనపరచి వారి సంఖ్య ఈరోజుకి ఇంతగా పెంచింది. అయితే మనిషి మేధస్సు ఎప్పటికప్పుడు పరిష్కారాలు కనుక్కొంటూ వచ్చింది. నేడు వంధ్యత్వానికి ఎన్నో చికిత్సా విధానాలు వచ్చాయి. ఎ.ఇ. హెచ్., ఎ.ఇ.డి., ఐ.వి.ఎఫ్., జి.ఐ.ఎఫ్.టి., జడ్.ఐ.ఎఫ్.టి. అనేవి నేడు 'ఇన్‌ఫెర్టిలిటీని' రూపుమాపడానికి ఉపయోగించే నూతన చికిత్సా విధానాలు. ఇవేవీ ఈ దేశంలో పదిహేనేళ్ల క్రితం లేవు"

"నిజమే జ్యోతి! మా కాలంలో అయితే పిల్లలు పుట్టకపోవడం అన్నది ఒక శారీరక లోపంగా అనుకునేవాళ్ళమే కాదు. ఎంతో పాపం చేసుకున్న ఆడదాన్ని దేవుడలా శిక్షిస్తాడని మా పెద్దలు చెప్పేవాళ్లు."

"మీ కాలంలో ఉండే మూఢనమ్మకం ఆంటీ అది! లోపం పురుషుడిలోనూ ఉంటుందంటే ఆనాడు నమ్మేవారు కాదు. పురుషుల్లో వీర్య ఉత్పాదన తక్కువగా ఉండడం, లేదా అసలు లేకపోవడం, అవయవాలకు ఏర్పడిన నష్టం కారణంగా వీర్యం బయటకు రాలేకపోవడం, వీర్యంలోని జీవకణాలు సక్రమంగా ఈదలేకపోవడం, వీర్యం అసాధారణంగా ఉండడం... లాంటి వాటివల్ల స్త్రీలు సంతానం పొందలేకపోతారు"

వారలా మాట్లాడుకుంటూ ఓ గంట గడిచేసరికి సుధాకర్ రావడం కనిపించింది. అతడు హాల్లో వారికోసం చూసి ఆపై వంట గది దగ్గరగా వెళ్ళాడు. ఆ ముగ్గురూ వంట చేయడం చూసి నవ్వుతూ అన్నాడు. "అమ్మా! మనింటికొచ్చిన గెస్ట్ చేత కూడా వంట చేయిస్తున్నావా?" చేతిలోని టపాసులను తల్లికి అందించాడు.

"మేము హాయిగా హాల్లో కూర్చో తల్లీ అంటే, తనే బలవంతంగా కల్పించుకుని పనిచేస్తోందిరా"

అతడు ఈసారి జ్యోతితో అన్నాడు, "జ్యోతీ! నీకెందుకీ శ్రమ?"

"ఇది నా సొంతిల్లులా భావిస్తున్నాను. తప్పేంటి? అందులోనూ మీ ఫ్రెండ్ వస్తా

డంటున్నారుకదా! చాలా వంటకాలు చేయా ల్సివస్తోంది. వీళ్ళిద్దరే కష్టపడుతుంటే చూడ లేక నేనూ చెయ్యివేశాను"

అతడు మరేం మాట్లాడలేదు.

అప్పుడే గుర్తొచ్చినట్లుగా యశోదమ్మ సుధాకర్‌ని అడిగింది. "మరి మురళి ఎప్పు డొస్తున్నాడు? "

"మరో పదినిమిషాలలో బయలుదేరుతా డట" అతడు చెప్పి వంటగదిలో నుండి బయటకు నడిచాడు. హాల్లో కూర్చుని ఏదో మాగజైన్ చదువుకుంటూ ఓ అరగంట గడి పాడు. అప్పుడు ఇంటిముందు కారు ఆగింది. అతడు అటు చూస్తే మురళి కారు దిగి లోపలికొస్తూ కనిపించాడు.

సుధాకర్ ఎదురెళ్లి "రావోయ్‌రా! నీ కోసమే ఇంట్లో వారందరి ఎదురుచూపులు" అంటూ అతడి చెయ్యి తన చేతిలోకి తీసు కున్నాడు.

"ఆంటీ ఎక్కడ? "

అప్పటికే అతడి రాక తెలియడంతో వంటగదిలోని ఆడవాళ్లు ముగ్గురూ హాల్లోకి వచ్చారు.

యశోదమ్మ, నాగమణిలతోపాటు ఉన్న జ్యోతిని అప్పుడే అతడు తొలిసారి చూడడం. చూడ్డంతోనే ఆమె ఎవరో అర్థమ యింది మురళికి. ఒక్కొక్కరిని చూస్తే తొలి చూపులోనే ఏదో అభిమానం లాంటిది కలు గుతుందంటే అందుకు రీజన్ ఉండదు. బహుశ ఆమెమీద మురళికి అలాంటి అభి మానం కలగడానికి అంతకుముందు సుధా కర్ చెప్పిన మాటలు కొంత కారణం కావ చ్చేమో!

జ్యోతి కూడా అతడికేసి చూసింది. ఆర డుగులకు రెండంగుళాలు తక్కువగా ఉండొచ్చు అతడి ఎత్తు. వెనక్కు దువ్విన నొక్కుల జుట్టు, విశాలమైన నుదురు,





సూటిగా గుండెల్లోకి చూస్తున్నట్లు కనిపించే చూపులు... నిర్లక్ష్యంతో కూడుకున్న విలక్ష ణమైన అందం ఇతడిది అనిపించిందా మెకు.

సుధాకర్ వారిద్దరికేసి ఓసారి చూసి "మురళీ! ఈమె డాక్టర్ జ్యోతి. నా చిన్న నాటి స్నేహితురాలు..." అంటూ అతడికి చెప్పాక ఆమెవైపు తిరిగి పలికాడు "...జ్యోతి! నీకు చెప్పానే మురళి అని... కాలేజీలో నా ప్రాణస్నేహితుడు..."

ఆమె తలాడించి చేతులు జోడించింది "నమస్తే"

అతడు అప్రయత్నంగానే చేతులు జోడించి "నమస్తే" అన్నాడు.

"ఈరోజు నాకెంతో సంతోషంగా ఉంది జ్యోతి" అన్నాడు సుధాకర్ ఆమెతో.

"ఎందుకు? " ఆమె సుధాకర్‌వైపు అదోలా చూసింది.

"నా కత్యంత ఇష్టలయిన మిత్రులిద్దరితో ఈ పండుగ జరుపుకోవడం సంతోషించే విషయం కాదా మరి"

"ఓహో! అదా" నవ్వింది జ్యోతి.

"అవును మరి! మీ ఇద్దర్నీ చూస్తుంటే, కాలం ఒక్కసారి వెనక్కు వెళితే ఎంత బాగుణ్ణో కదా అనిపిస్తుంది. మధురమైన బాల్యం, మరచిపోలేని అనుభూతుల కాలేజీ జీవితం- మరోసారి అనుభవించగలిగితే బాగుణ్ణని వయసొచ్చాక ప్రతిమనిషీ ఎప్పుడో ఒకప్పుడు కోరుకుంటాడు"

"అది నిజం" అన్నాడు మురళి. అలా అంటూనే ఆమెవైపు ఓరగా చూశాడు అతడు.

గుండ్రటి ముఖంమీద కదలాడే ముంగు రులు చామంతి పువ్వును ముద్దాడాలని ప్రయత్నించే తుమ్మెదలను గుర్తుకు తెస్తు న్నాయి. విశాలమైన నేత్రాలు, నవ్వితే డింపుల్ ఏర్పడే బుగ్గలు, చిన్ని నోరు... 'ఆ ముఖంలో ఏదో... ఏదో తెలియని ప్రత్యేక

ఆకర్షణ ఉంది' మనసులోనే అనుకున్నాడు మురళి. "ఈమె ముఖంలోకి చూస్తుంటే అనస్థీషియా లేకుండానే ఆపరేషన్ చేయించుకోవచ్చేమో" అలా అనిపించడంతోనే అతడి పెదాలమీద చిరునవ్వు కదలాడింది.

అప్పుడే అతడి పెదాలమీద చిరునవ్వు చూసిన సుధాకర్ "ఏమిత్రా- నీలో నువ్వే నవ్వుకుంటున్నావ్? " అన్నాడు.

సుధాకర్ మాటలతో ఈ లోకంలోకి వచ్చాడు మురళి. "ఏమీలేదు" అన్నాడు.

వారలా మాట్లాడుకుంటుండగా యశోదమ్మ వచ్చి చెప్పింది. "భోజనం వడ్డించేయనా? "

"నీదే ఆలస్యం"

వారు ముగ్గురూ సోఫాల్లోంచి లేచారు.

డైనింగ్ టేబుల్ ముందు ఆ ముగ్గురితో పాటు యశోదమ్మ కూర్చుంది. నాగమణి వారికి వడ్డించాక తర్వాత తింటానంటే జ్యోతి ఒప్పుకోలేదు. నాగమణి వారితో కూర్చోక తప్పలేదు.

తన కిష్టమైన వంటకాలు ఉండడంతో మురళి తృప్తిగా భోంచేశాడు. తన సొంతింట్లోనే పండుగరోజు పిండివంటల భోజనం తిన్నట్లుగా ఫీలయింది జ్యోతి.

భోజనాలయ్యాక సాయంత్రం వరకూ ఏం చేయలా అని ఆలోచిస్తే- మాట్నీషోకి సినిమాకెళితే బాగుంటుందనిపించింది.

"టి.వి. ఛానల్స్ పెరిగాక ఇంట్లోనే సినిమాలు చూస్తుండడంతో నేనూ, నాగమణీ ఈమధ్య థియేటర్లకి వెళ్ళడం మానేశాం! ఈ రోజు వెరైటీగా అందరం కలిసి వెళదాం" అంటూ సుధాకర్ తల్లి ముఖంలోకి చూశాడు.

"మీరు నలుగురూ వెళ్ళిరండిరా. సినిమా పూర్తిగా చూస్తే నాకు తలనొప్పి వచ్చేస్తుంది"

వారు నలుగురూ ఎంత బలవంతపెట్టినా ఆమె సినిమాకి వచ్చేందుకు ఒప్పుకోలేదు. అలా అని తన కోసం వారు ఆగిపోయేందుకు కూడా ఒప్పుకోలేదు.

నలుగురూ సినిమాకి బయలుదేరారు. అలవాటు ప్రకారం సుధాకర్ స్కూటర్ వైపు నడవబోతుంటే జ్యోతి నవ్వింది "ఏంటీ! మా ముగ్గుర్నీ స్కూటర్ వెనుకే సర్దుకోమంటావా? "

నాలుక్కరుచుకున్నాడు సుధాకర్. అది చూసి నాగమణి నవ్వింది.

"పదండి" అంటూ జ్యోతి తన కారువైపు నడిచింది. మురళి కొద్దిగా సంశయించినా వెంటనే అడ్జెస్టయి, ఆమె కారువైపు నడిచాడు. జ్యోతి డ్రైవింగ్ సీట్‌లో కూర్చోగా నాగమణి ఆమె పక్కనే కూర్చుంది. మురళి, సుధాకర్‌లు వెనక కూర్చున్నారు.

థియేటర్ ముందు కారాగాక సుధాకర్ కౌంటర్ వైపు వెళ్ళి టికెట్స్ పట్టుకొచ్చాడు. కారు స్టాండ్‌లో పెట్టాక ముగ్గురూ థియేటర్ లోపలికి వెళ్లారు.

పండుగరోజు కావడంతో జనం బాగానే వచ్చారు. ఫస్ట్‌షోకి మాత్రం అంతగా రాకపోవచ్చు.

థియేటర్ లోపల సీట్లలో కూర్చున్నాక నాగమణి గమనించింది పక్కనే కూర్చున్న జంటను. ఆ అమ్మాయి చేతిలో ఏడాదిలోపు వయసున్న బాబు ఉన్నాడు. ఆ పిల్లాడిని చూస్తుంటే చాలా ముద్దొస్తున్నాడు. ఆమెను చూసి చేతులు చాపి కేరింతలు కొడుతున్నాడు. ఆ అమ్మాయి కూడా అది గమనించింది.

నాగమణి చేతులు చాచింది. ఆ పసివాడు ఆమె చేతులలోనికి ఎగబ్రాకుతుండడం గమనించిన వాడి తల్లి పిల్లాడిని నవ్వుతూ ఆమెకు అందించింది. "జాగ్రత్తండీ! మీ బట్టలు తడిపేస్తాడేమో"

"ఫర్వాలేదు" ఆ పిల్లాడిని రెండు చేతుల మధ్య ఇరికించుకుని, ముద్దు పెట్టుకుంటూ గుండెలకు హత్తుకుంటూంటే అదో రకమైన ఆనందోద్వేగం కలిగింది. పసిపిల్లల్ని ముద్దు చేయడంలోనే ఒక ఆనందం ఉంది. వారి చిరునవ్వులో ఒక రిలాక్సేషన్ ఉంది. అందువల్లే ఇతరులతో ఎంతో ముభావంగా ఉండే వ్యక్తయినా, పసిపిల్లల ముందు తనూ పసివాడుగా మారిపోతాడు. ఇతరుల పిల్లలతోనే అంతటి ఆనందాన్ని పొందగలిగి నప్పుడు ఇక ఆ పిల్లలు తన రక్తం పంచుకు పుట్టిన వారయితే? ఆమె స్త్రీ హృదయం బాధగా మూలిగింది.

సినిమా పూర్తయింది. వాళ్లు పైకి లేస్తు న్నప్పుడు నాగమణి ఆ బాబుని తల్లికి ఇవ్వ లేక ఇస్తున్నట్టు గమనించిన సుధాకర్ మనసు బాధగా మూలిగింది.

నలుగురూ హాలు బయటకు నడిచారు.

జ్యోతి, నాగమణి, సుధాకర్- ముగ్గురూ పార్కింగ్ ప్లేస్‌వైపు నడుస్తుంటే మురళి చెప్పాడు. "మీరు కారు తీసుకురండి. నేను ఓ ఫోన్‌చేసి వచ్చేస్తాను" అంటూ థియేటర్ బయట ఉన్న టెలిఫోన్ బూత్‌వైపు నడి చాడు. వారు ముగ్గురు ముందుకి నడి చారు.

జ్యోతి కారుడోర్ తీస్తూ ఎవరో తనవైపే చూస్తున్నట్టనిపించి అటుకేసి చూసింది. ఆమె కళ్లు కాస్త పెద్దవయ్యాయి.

సతీష్...

మారుతీ ధవుజండ్ కారు పక్కనే నిల బడి ఉన్నాడు. తానూ సినిమాకి వచ్చినట్టు న్నాడు. అతడి పక్కనే పాతికేళ్లలోపు ఆ యువతి... ఆమెను చూడడం అదే మొద టిసారి. సతీష్ భార్య అందంగానే ఉంది. మనసులోనే అనుకుంది. అదే క్షణం మన సులో ఏదో తెలియని కసి లాంటిది బయ లుదేరింది.

నాగమణి అప్పటికే కారులో కూర్చుంది. సుధాకర్ కారులో కూర్చోబోతూ ఉన్నాడు. ఆమె యధాలాపంగా వేసినట్టు అతడి భుజం మీద చెయ్యి వేసింది. ఆమె కోరుకు న్నట్టే సతీష్ అతడికేసి పరిశీలనగా చూశాడు. సతీష్ ముఖం వెలవెలబోవడం గమనించింది. ఆమెకు చాలా సంతృప్తిగా అనిపించింది. ఎంతలేదన్నా ప్రతి మనిషి లోనూ కొంత ప్రతీకారేచ్ఛ ఉండితీరుతుంది. తనను హింసించినవాడిని కొంతయినా బాధ పెట్టాలని అనుకోవడంలో అసహ జత్వం ఏమీలేదు. ఆమెలోని ఆ మానవ సహజ ప్రతీకారేచ్ఛ కొంత చల్లారాక ఆమె కారెక్కి విసురుగా ముందుకు పోనిచ్చింది.

★ ★ ★

ఆకాశంలో చీకటి పరుచుకుంది.

ఆ చీకటిని చీల్చుతూ వెలుగుతున్న దీపాల వరుస జీవిత సత్యమేదో చెబుతున్న ట్టుంది.

'జీవితంలోని నిరాశాంధకారాన్ని పారదో లాలంటే ఆశా జ్యోతులను వెలిగించుకో వాలి'

ఏ పండుగలోనూ రాని ఉత్సాహం, మరే పండుగలోనూ లేని సంబరం దీపావళి పండుగలోనే ఉందేమో! నాగమణి డాబా పిట్టగోడ మీద ప్రమిదలు పెడుతోంది.

దగ్గరలో టపాకాయల మోత వినిపించ డంతో డాబాకు మరో చివర నిలబడి ఉన్న జ్యోతి చెవులు రెండూ గట్టిగా మూసు కుంది. ఆమెకు పక్కనే నిలబడి ఉన్నారు సుధాకర్, మురళీలు. ఆమె అవస్థ చూసి చిన్నగా నవ్వుకున్నారు. అదే సమయంలో ఓ తారాజువ్వ వెలుగులు చిమ్ముతూ ఆకా శంలోకి ఎగిరింది.

ప్రమిదలు పెట్టడం పూర్తయిపోవడంతో నాగమణి కిందికి వెళ్లిపోయింది.

పది నిమిషాల తర్వాత ఆమె ప్లేట్ నిండుగా పిండివంటలతో వారి ముందుకు వచ్చింది. "పండుగపూట వట్టి మాటలేకాదు,




తిండి మాటలూ ఉండాలి" అంది.

"అంటే? "

"తింటూ మాట్లాడుకోవడం అన్నమాట" నవ్వాక చెప్పింది.

"మీరు త్వరగా కిందికొస్తే టపాసులు కాల్చడం అనే పని మొదలెట్టచ్చు"

"ఇదిగో పది నిముషాల్లో వచ్చేస్తాం" చెప్పాడు సుధాకర్.

మరో పది నిముషాలు అవీ ఇవీ మాట్లాడుకున్నాక వారు కిందికి వెళ్లారు.

సుధాకర్ టపాసులు తెచ్చి వరండాలో ఉంచాడు.

"అమ్మాయ్ జ్యోతి! ఈ బాంబులు కాల్చు" అందించింది యశోదమ్మ.

"అమ్మో బాంబులే! నాకు భయం బాబు" అంది జ్యోతి కళ్లు పెద్దవిచేసి.

మగవాళ్లిద్దరూ పెద్దగా నవ్వారు. వాళ్లిద్దరూ హీరోల్లా ఒకరి తర్వాత ఒకరు బాంబులు కాల్చడం మొదలెట్టారు. ఆడ వాళ్లు చెవులు మూసుకుంటుంటే వాళ్లిద్దరూ నవ్వుకోవడం చూసి నాగమణి ఉక్రోషంగా జ్యోతిచేత బాంబులు కాల్పించింది.

చివరికామె యశోదమ్మను కూడా వదల్లేదు.

నవ్వులతో తుళ్లింతలతో ఆ రాత్రి చాలా పొద్దుపోయేవరకూ గడిపేశారు ఆ ఐదుగురూ. భోజనం చేశాక సెలవు పుచ్చుకుని జ్యోతి, మురళీలు ఎవరిళ్లకు వాళ్లు చేరుకున్నారు.

ఆ రాత్రి పడుకుంటే జీవితం మొత్తం మీద అంత అద్భుతమైన దీపావళి మళ్లీ తమకు రాదేమోననిపించింది ఇద్దరికీ.

★ ★ ★

రెండు నెలలు గడిచినా తను వాడిన మందులు సత్ఫలితాన్ని ఇవ్వకపోవడంతో నాగమణి ఓ రోజు జ్యోతికి ఫోన్ చేసి ఆ విషయం చెప్పింది.

"అయితే ఐ.వి.ఎఫ్ తప్పదన్నమాట, మీరిద్దరూ రేపు సాయంత్రం ఓసారి ఇంటికి రండి మాట్లాడుకుందాం" అందామె అవతల వైపునుంచి.

"అలాగే" అని ఫోన్ పెట్టేసింది నాగమణి.

ఆ సాయంత్రం వారిద్దరూ జ్యోతి ఇంటి కెళ్లేసరికి ఆమె ఇంటి తలుపు సగం తెరుచుకుని ఉంది. ఇంటికెవరో వచ్చినట్టున్నారు.

కాలింగ్‌బెల్ మీద చెయ్యి ఉంచబోయిన సుధాకర్ సరిగ్గా అప్పుడే లోపలినుండి మగ గొంతు వినిపించడంతో ఆగిపోయాడు.

"జ్యోతీ! మనం విడాకులు తీసుకుని ఉండొచ్చు కానీ మనిద్దరం కలిసి కొంత కాలం కాపురం చేశాం. భార్యాభర్తల సంబంధం అంత సులభంగా తెగిపోయేది కాదు"

సుధాకర్, నాగమణి ముఖముఖాలు చూసుకున్నారు.

"నిజమే! అంతసులభంగా తెగిపోయేది కాదు. కానీ చాలా చాలా సులభంగా తెంచేసుకున్నది నువ్వేకదా!" జ్యోతి గొంతు స్పష్టంగా వినిపిస్తోంది.

నాగమణి ఏం చేద్దామన్నట్టు భర్తకేసి చూసింది. సుధాకర్ ఆలోచనలో పడ్డాడు.

"నేను ఏ పరిస్థితుల్లో రెండోపెళ్లి చేసుకున్నానో నీకు తెలియదూ? అమ్మానాన్నలు మనమల కోసం పరితపించిపోతుంటే వారి బాధ చూడలేక ఇష్టం లేకపోయినా మరో పెళ్లి చేసుకున్నాను" మగగొంతు అంటోంది.

"పాపం" జ్యోతి గొంతు వెక్కిరింతగా పలికింది "అంతే తప్ప కొత్త అందాలమీద మోజు, వచ్చే కట్నంమీద ఆశతో రెండో పెళ్లి చేసుకోలేదంటావ్"

"నువ్వు నమ్మినా, నమ్మకపోయినా అది

నిజం"

"నేను టీనేజ్ అమ్మాయిని కాదు మిస్టర్ సతీష్! మగాడు ఏం చెప్పినా నమ్మేసి ప్రతి సారీ మోసపోవడానికి! అయినా ఇప్పుడు నాతో సంబంధం పెట్టుకోవలసిన అవసరం నీకేముంది? మంచోచెడో ఒకరినుండి మరొకరం చట్టపరంగా విడిపోయాం. ఇప్పుడు నేను మళ్లీ నీతో సంబంధం కొనసాగిస్తే చట్టం దృష్టిలో నా విలువేమిటో తెలుసా? "

అవతలివైపు కొద్దిక్షణాలు నిశ్శబ్దం.

"ఉంచుకున్నది. యస్! ఒకసారి విడాకులు తీసుకున్న ఆడది మొగుడు మళ్లీ పెళ్లి చేసుకున్నాక అతడితో సంబంధం కొనసాగిస్తే మొదటిపెళ్లాం హోదాకాదు దక్కేది 'ఉంచుకున్నది' అనే పిలుపే దక్కుతుంది. ఇలాంటి సందర్భాలలో చట్టం వాడే పదం ఇంకా ఘోరంగా ఉంది"

నాగమణి భర్త చెవిలో గుసగుసలాడింది "మనం... మనం వెళ్లిపోదామా? "

అతడు ఆగమన్నట్టు చేత్తో సైగ చేశాడు.

అవతలి వ్యక్తి గొంతు ఈసారి సర్కాస్టిగ్గా పలికింది.

"అయితే నువ్వు అన్నీ చట్టప్రకారం చేస్తున్నావన్నమాట. ఏ తప్పుడు పనీ చేయట్లేదా? "

ఆ క్షణం జ్యోతి ముఖంలో ఎలాంటి భావాలు కదలాడుతుంటాయో ఊహించుకో సాగాడు సుధాకర్.

"నేనేం తప్పు చేశాను"

"ఈమధ్య కాలంలో నేను చాలాసార్లు చూశాను. ఎవరినో వెంటేసుకుని తిరుగుతున్నావ్. దీపావళి రోజున నీ ప్రవర్తన మరీ మితిమీ౯ంది. పిల్లి పాలుతాగుతూ కళ్లు మూసుకుని తనను ఎవరూ చూడలేదనుకుంటుందట"

"కాదు! పచ్చకామెర్ల వానికి లోకమంతా పచ్చగా కనిపిస్తుందట" జ్యోతి గొంతు చాలా తీవ్రంగా విన్పించింది.

సుధాకర్ పెదవులు బిగబట్టాడు. దీపావళి రోజు అంటే అతడు ఎవరిని మనసులో ఉంచుకుని అంటున్నాడో అర్థమయిపోయింది. నాగమణి కూడా భర్తకేసి జాలిగా చూసింది. అతడు గొణిగినట్టు అన్నాడు "మనం.. మనం వెళ్లిపోదామా? "

"ఉండడం మంచిదేమోననిపిస్తోంది నాకు"

"ఎందుకని"

"ఇద్దరూ ఆవేశంమీద ఉన్నారు. నన్నడిగితే ఇలా ఉండిపోవడమో, వెళ్లిపోవడమో కన్నా కాలింగ్‌బెల్ కొడితే వారి ఆవేశాలు చల్లబడతాయేమో"

ఆ ఆలోచన అతడికి నచ్చింది. చప్పున కాలింగ్‌బెల్ నొక్కాడు. లోపల ఒక్కసారిగా మాటలు ఆగిపోయాయి. పది సెకన్లు తరువాత విసురుగా తలుపు తీసిన జ్యోతి వారిని చూసి,

"రండి... రండి! మీరొస్తారని అనుకుంటూనే ఉన్నాను" అతికష్టంమీద చిరునవ్వు ముఖం మీదకు తెచ్చుకున్నదని అర్థమయిపోతూనే ఉంది వారికి.

వారిద్దరూ లోపలికి అడుగుపెట్టారు. వెనువెంటనే అటు చూశారు. అతడిని చూడడం అదే మొదటిసారి. అతడిని చూస్తుంటే వారిద్దరికీ కంపరం లాంటిది కలిగింది. ఈమధ్య వరకూ ఈ దేశంలో డాక్టర్లంటే గౌరవభావం ఉండేది. 'వైద్యో నారాయణో హరి' అంటూ వైద్యుడిని ప్రాణదాతగాను, దేవుడిగానూ గౌరవించారు. కానీ ఇప్పుడిప్పుడే డాక్టర్లలో వ్యాపారి పుట్టుకొస్తున్నాడు. అతడు దొరికిన పేషంట్‌ని జలగలా పట్టి అతడి రక్తం చివరిబొట్టువరకూ పీల్చి జీవశ్చవంలా మిగుల్చుతున్నాడు. ఇతగాడిని చూస్తుంటే వారికి జలగ లాంటి డాక్టరే కనిపిస్తున్నాడు. అంతకు




మించి సంస్కారహీనుడని మాటలలోనే తెలిసిపోయింది. లేకపోతే కట్టుకున్న భార్యను తనే వదిలేసి తిరిగి ఈనాడు మరొ కరితో తిరుగుతోందని ఆరోపించడం సంస్కారహీనులకు మాత్రమే సాధ్యమవుతుంది.

సుధాకర్ అతడికేసి అదోలా చూడడం, అతడూ సుధాకర్‌కేసి తీక్షణంగా చూడడం జ్యోతి గమనించింది. సతీష్ ఉంటే ఇబ్బందికరమైన పరిస్థితులు ఎదురవుతాయని అనుకుందో ఏమో అతడివైపు తిరిగి చెప్పింది. "ఆల్‌రైట్ మిస్టర్ సతీష్! మనం మరోసారి మాట్లాడుకుందాం. నేను నా పేషెంట్‌తో మాట్లాడాలి"

అతడు ఏదో అనేందుకు నోరు తెరిచాడు. వెంటనే మనసు మార్చుకున్నట్టు సుధాకర్ వైపు ఓసారి సీరియస్‌గా చూసి బయటకు వెళ్లిపోయాడు.

కొద్దిక్షణాలపాటు అందరూ మౌనంగా ఉండిపోయారు. అప్పుడు జ్యోతి చిన్నగా నిట్టూర్చి వారివైపు చూసి నవ్వుతూ "కూర్చోండి" అంది.

వారు కూర్చోలేదు. సుధాకర్ అడిగాడు "మీవారా? "

ఆమె తడబడలేదు. నెమ్మదయిన స్వరంలో చెప్పింది "ఒకప్పుడు". చెప్పాక అప్పుడే ఆలోచనలోకి వచ్చినట్టు అడిగింది "ఊహించారా? "

అతడూ వెంటనే చెప్పాడు "మేం వచ్చి చాలాసేపయింది"

అప్పుడు తడబడిందామె, "ఎంత ఎంతసేపయింది వచ్చి? "

"భార్యాభర్తల సంబంధం గురించి అతడు చెప్పడం మొదలు పెట్టినప్పుడు..."

ఆమెకు అర్థమయిపోయింది. అతడు పూర్తిగా విన్నాడు. ఆ విషయం అర్థం కావడంతోనే ఆమె నీరసంగా సోఫాలో కూర్చుండిపోయింది. నాగమణి ఆమె దగ్గరగా వెళ్లి పక్కనే కూర్చుంది. ఆమె చేతిని తన రెండు చేతుల మధ్యకు తీసుకుంది. ఆ స్పర్శలో ఎంతో ఆప్యాయతుంది. 'నువ్వేమిటో నాకు తెలుసు' అన్న భరోసా ఉంది. సుధాకర్ కూడా వారి ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు.

ముగ్గురి మధ్యా నిశ్శబ్దం చాలా గాఢంగా పేరుకుంది. ఆ నిశ్శబ్దాన్ని ఛేదించే ధైర్యం ఆ ముగ్గురిలో ఎవ్వరికీ లేకపోయింది.

క్షణాలు... నిముషంగా మారాక చివరికి జ్యోతే అంది, "విడాకులు తీసుకున్నాక కూడా సతీష్ నన్ను వదిలేలా లేడు" ఆమె గొంతు గాద్గదికమయింది.

"ఇంతకాలం పట్టించుకోని వ్యక్తి, ఇప్పుడే తొందరపడుతున్నట్టుంది. కారణం..." అతడు అర్థోక్తిగా ఆగాడు.

'మరేంకాదు. నాన్న వచ్చినప్పుడు సతీష్ అడిగితే నాకు మరో సంబంధం తెచ్చాడని, నేను మరో పెళ్లి చేసుకోబోతున్నానని అన్నాను. అప్పటివరకూ అతడికి నేను ఎప్పటికయినా తన మనిషే అనే నమ్మకం ఉండేది. నేను చేజారిపోతున్నానని తెలియడంతోనే అతడు తొందరపడడం మొదలుపెట్టాడు. అందులోనూ మనమంతా కలసి సినిమాకెళ్లడం, ఆ తర్వాత మరెప్పుడయినా రోడ్డుమీద కలుసుకుని మాట్లాడుకోవడమో చూసి ఉంటాడు. అనుమానం బలపడింది. అందుకే నన్ను పట్టులోకి తీసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. కానీ నేను చాలా మొండిదాన్నని అతడికీ తెలుసు"

నాగమణి కాస్త కోపంగా పలికింది, "ఏమిటో ఈ మనిషి! వద్దనుకుని ఒంటరిగా వదిలేశాడు. అలా అని అవతలివ్యక్తి తన మానాన తను బతుకుతున్నా చూడలేకపోతున్నాడు!"

"మనిషి కాదమ్మా మగాడు! అందులోనూ మొగుడు అనే పోస్ట్ దక్కించుకున్న వాడు!

తన భార్యను బానిసలా భావించే వాడు. అతడికి పడక సుఖానికి, బిడ్డల్ని కని పెట్ట డానికి భార్య కావాలి. ఆ రెండింటిలో ఏ ఒక్కటి నిర్వహించలేకపోయినా అతడు ఆ బానిసను తప్పించి మరో బానిసను ఆ పని కోసం తెచ్చుకుంటాడు. ఆ మొదటి బాని సను తన నుండి దూరం చేసినా ఆమె మీద తనకు అధికారం ఉందని అనుకుం టూనే ఉంటాడు. ఆమె మనసులోనే అను కుంది. పైకి అనలేకపోయింది.

వారిద్దరూ తామొచ్చిన పని మరచిపో యారు. ఆమెను ఓదార్చడంలోనే వారికి చాలా సమయం గడిచిపోయింది. చివరికి ఆ రాత్రికి ఆమె భోంచేస్తుందో లేదోనని దగ్గ రుండి మరీ కొసరి కొసరి తినిపించింది నాగమణి.

వారిద్దరూ బయలుదేరుతున్నప్పుడు జ్యోతి చెప్పింది, "ఈ రోజు మరే విష యాలూ మాట్లాడే మూడ్‌లోలేను. మనం రేపు మరోసారి కలుసుకుని ట్రీట్‌మెంట్ గురించి మాట్లాడుకుందాం"

"అలాగే" అనేసి వచ్చేశారు నాగమణి, సుధాకర్‌లు.



లంచ్ అవర్ అయిపోయాక లెడ్జర్ ముందేసుకుని ఆ రోజు వచ్చిన ఫిక్సెడ్ డిపాజిట్లు ఎంట్రీ చేస్తోంది నాగమణి. బ్యాంక్ బిజినెస్ అవర్స్ అయిపోయాక కస్ట మర్స్ ఎక్కువగా లోపలికి రావడమంటూ ఉండదు. ఎవరయినా వస్తే కొత్త పాస్‌బు క్‌ల కోసమో, లేక తయారుచేసి ఉంచిన డి.డి.లు తీసుకెళ్లడం కోసమో వస్తారు. అందువల్లే బ్యాంక్ మొత్తం చాలా నిశ్శ బ్దంగా ఉంది.

ఆమె తన పనిలో మునిగిపోయి ఓ గంట గడిచి ఉంటుందేమో "హలో నాగ మణి" అంటూ పరిచిత కంఠం వినిపించ డంతో ఆమె అటుకేసి చూసింది.

క్యాష్‌కౌంటర్ ముందు నిలబడి తనకేసే చూస్తోంది జ్యోతి.

ఆమె చప్పున లేచి "రండక్కా" అంటూ ఆహ్వానించింది.

జ్యోతి ఆమె దగ్గరగా వచ్చాక చెప్పింది "హాస్పిటల్ నుండి ఇంటికెళ్లిపోతూ, చప్పున నువ్వు గుర్తొచ్చి ఇలా వచ్చాను. నిన్న మనం మిస్ అయిన విషయం గురించి మాట్లాడదామనుకుంటున్నాను"

"మీరిప్పుడు అర్జెంట్‌గా వెళ్లిపోవాలా అక్కా? "

"ఇంటికెళ్లడమే! అంత అర్జెంటేమీ లేదు. నీ పని పూర్తి కానివ్వు. ఆ తర్వాత బయట కెళ్లి మాట్లాడుకుందాం"

"ఇదిగో, ఈ పది ఎంట్రీలు వేసేశాక మేనేజర్‌ని పర్మిషన్ అడిగి వచ్చేస్తాను"

"అలాగే" అంది జ్యోతి చిరునవ్వుతో.

ఆమె తన పని చేసుకుంటూనే మధ్యలో గుర్తొచ్చి అడిగింది. "అక్కా! మీరింతకీ లంచ్ చేశారా? "

"ఇంటికెళుతున్నాగా! అంతా రెడీగానే ఉంటుంది"

"అంటే చెయ్యలేదన్నమాట! అయ్యో!" బాధను వ్యక్తం చేసింది నాగమణి. "త్వరగా ముగించేస్తాను. బయటికెళ్లాక ఏదయినా హోటల్‌కెళ్దాం"

"నా గురించి ఆలోచించకుండా ముందు పని కానివ్వు"

అన్నట్టుగానే ఆమె పదినిముషాలలో ఎంట్రీలు పూర్తిచేసి వడివడిగా మేనేజర్ రూంలోకి వెళ్లింది. రెండు నిమిషాల తర్వాత జ్యోతి దగ్గరకొచ్చి "పదక్కా" అంది. జ్యోతి లేచాక ఆమె తన బ్యాగ్ భుజానికి తగిలించుకుని అనుసరించింది.

జ్యోతి కారు స్టార్ట్‌చేసి ఓ హోటల్ ముందు ఆపింది. ఇద్దరూ లోపలికెళ్లారు.

"చెప్పక్కా! ఏం తీసుకుంటావ్? "




"నువ్వు నాకు ఇప్పించడమా?" అని నవ్వి "సరే! నీ ఇష్టమొచ్చిన ఐటమ్ ఏదో ఒకటి చెప్పు. మరీ హెవీగా మాత్రం ఉండ కూడదు"

నాగమణి తలాడించింది. సప్లయిర్ వచ్చాక చెప్పింది "ఒక ప్లేట్ ఇడ్లీ, ఒకప్లేట్ వడ, ఒక వెజిటబుల్ బిర్యానీ"

"హెవీగా వద్దంటే అన్ని ఐటమ్స్‌కి ఆర్డరి స్తావేమిటి?"

"అందులో ఒక ఇడ్లీ, ఒక వడ నేను తిన బోతున్నాను కాబట్టి" అంటూ నవ్వింది నాగమణి.

సప్లయర్ ఇడ్లీ, వడ తెచ్చి వారి ముందు ఉంచాడు. నాగమణి ఒక వడ, ఒక ఇడ్లీ అటుఇటు, ఇటుదటు ట్రాన్స్‌ఫర్ చేసింది. "తినక్కా"

జ్యోతి నిశ్శబ్దంగా తినడం మొదలుపె ట్టింది.

"ఇప్పుడు చెప్పండి. నిన్న నాకు చెప్పదల చుకున్న విషయం ఏమిటి?"

జ్యోతి నెమ్మదిగా తలాడించింది. ఆ తర్వాత చెప్పింది. "నేను మొన్న డాక్టర్ భవానిగారితో నీకేసు గురించి మాట్లాడా నమ్మా! మెడిసిన్స్ పనిచేయలేదు. సో! నీకు 'ఇన్‌వెట్రో ఫెర్టిలైజేషన్' ద్వారా ప్రిగ్నెన్సీ కలిగించే ఏర్పాటు చేయాలనుకుంటున్నాం"

ఆమెకు జ్యోతి పరిచయమయ్యాక మెడి కల్ సైన్స్ గురించి కొంత కొంతగా అర్థమ వుతూ ఉంది. అందువల్లే ఆమె జ్యోతి పలి కిన పదాలకు భయపడిపోకుండా 'ఇన్‌వెట్రో ఫెర్టిలైజేషన్ అంటే ఏమిటక్కా?" అని అడ గగలిగింది.

"భర్తలో ఎలాంటి లోపం లేక భార్య గర్భాశయంలోగానీ ఫాలోఫియన్ ట్యూబ్స్ లోగానీ లోపం ఉంటే ఆ స్త్రీ అండాన్ని ఆ పురుషుడి వీర్యాన్ని ఓ టెస్టట్యూబ్‌లో సంయోగపరచి అవి సంయోగం చెందాక ఆ పిండాన్ని స్త్రీ గర్భాశయంలో ప్రవేశపెడ తారు. సుధాకర్‌వైపు నో ప్రాబ్లమ్. మరి నీ గర్భాశయంలో ఫాలోఫియన్ ట్యూబ్స్ మూసుకుపోవడంతో గర్భధారణా శక్తి లేకుండాపోయింది. అందువల్ల పిండాన్ని గర్భాశయంలో ప్రవేశపెడితే ప్రాబ్లమ్ సాల్వ్ అవుతుంది"

నాగమణికి ఈసారి కాస్త భయమేసింది. "అక్కా! నా విషయంలో ఈ... ఈ ప్రయోగం సక్సెస్ అవుతుందంటావా?"

"సక్సెస్ అయ్యేందుకు ఇరవై ఐదు శాతం అవకాశం ఉంది"

"ఖర్చు?"

"డోన్ట్‌వర్రీ అబౌట్ ది మనీ"

సప్లయర్ వెజిటబుల్ బిరియాని తెచ్చి టేబుల్‌మీద పెట్టాడు. బిర్యాని మంచి వాసనతో పొగలు చిమ్ముతోంది. నాగమణి ఆ ప్లేట్ ఆమెవైపు పెడితే "అమ్మో! నేనింత తినగలనా? నువ్వు కొంచెం తీసుకో" అంది జ్యోతి.

"వద్దక్కా! లంచ్ తీసుకుని గంటే అయింది. ఇప్పుడు మీకు కంపెనీ కోస మంటూ ఒక వడ, ఒక ఇడ్లీ లాగించేశాను. హెవీ అయిపోయింది. చేతులు అడ్డం పెట్టింది.

"పోనీ రెండు స్పూన్‌లు తీసుకో" బలవం తంగా కాస్త బిర్యానీ ఆమె ప్లేట్‌లో వేసిం దామె.

"అయితే ఈ విషయం మావారితో చెబు తాను"

"అలాగే వీలయితే తనను రేపోసారి కల వమను" ఆమె తలాడించింది.

బిరియానీ తినడం పూర్తయ్యాక "కాఫీ చెప్పనా అక్కా" అడిగింది నాగమణి.

"కాఫీ వద్దు చెల్లెలా! చాలాకాలం తర్వాత చిన్నపిల్లలా ఐస్‌క్రీం తినాలనిపిస్తోంది. ఇప్పించగలవా?" నవ్విందామె.

ఆమె మాట తీరుకి తనూ నవ్వి "తమరు మమ్మల్ని మణులడిగారా, మాణిక్యాలడిగారా? కేవలం ఐస్‌క్రీములడిగారు. ఇప్పించెదనుగాక" నాగమణి ఆమెను అనుసరిస్తూ మాట్లాడింది.

ఇద్దరూ నవ్వుకున్నారు. సప్లయిర్ వచ్చాక రెండు వెనీలా ఐస్‌క్రీమ్స్‌కి ఆర్డరిచ్చింది నాగమణి.

"థాంక్స్" చిన్నగా అంది జ్యోతి. ఆమె మనసులో ఒక నిశ్చింతలాంటిది కదలాడింది.

ఐస్‌క్రీమ్ తినడం పూర్తయ్యాక సప్లయిర్ బిల్లు తీసుకొచ్చి టేబుల్‌మీద పెట్టి వెళ్లిపోయాడు. నాగమణి హేండ్‌బ్యాగ్‌లోంచి డబ్బులు ప్లేట్‌లో వేసేలోపే జ్యోతి వంద రూపాయల కాగితం, బిల్లూ సప్లయిర్ చేతిలో పెట్టేసింది.

అది చూసి "అదేంటక్కా! నన్ను టిఫిన్ ఇప్పించమని, మీరు బిల్లు ఇచ్చేస్తున్నారు? " వారించబోయిందామె.

జ్యోతి నవ్వి చెప్పింది "అదే నేను బిల్లు పే చేస్తానని ముందుగా చెప్పాననుకో, నువ్వీ మాత్రం కూడా కంపెనీగా తినవు అందుకే అలా..."

ఆమెకు అర్థమయింది "పోండక్కా" అంది చిరుకోపం తెచ్చుకుంటూ.

"ఇక వెళ్దామా? " అంటూ జ్యోతి పైకి లేచాక, ఆమెను అనుసరించింది నాగమణి.

ఇద్దరూ కారుని సమీపిస్తుండగా అడిగింది "నీకు మెన్సెస్ డేట్ ఏది? "

చెప్పింది నాగమణి.

"అయితే రేపు ఉదయం నుండే నువ్వు హాస్పిటల్‌కి వస్తూ ఉండాలి"

"ఎందుకక్కా"

"అండోత్పత్తి కోసం హార్మోన్ ఇంజక్షన్ ఇవ్వాలి"

నాగమణి తలాడించి చెప్పింది "రేపు ఉదయం బ్యాంక్‌కి వెళ్లేముందు మీ దగ్గరకు వస్తాం. ఇంజక్షన్ తీసుకోవడం పూర్తయ్యాక బ్యాంక్‌కి వెళ్తాను"

"ఇంకో విషయం. పిండాన్ని నీ గర్భంలో ప్రవేశపెట్టాక నువ్వు కొన్ని రోజులు రెస్ట్ తీసుకోవటం అవసరం. ఎందుకంటే ఇది సహజ సిద్ధమయిన పునరుత్పత్తి కాదు. బస్సుల్లో వత్తిడి, విపరీతమైన శ్రమ... ఫర్టిలైజేషన్ జరగకుండా పోయేందుకు కూడా అవకాశం ఉంది. కాబట్టి ఓ పది రోజులు... జస్ట్ టెన్‌డేస్ నువ్వు బెడ్ రెస్ట్ తీసుకుంటే మంచిది. ఇది నా పర్సనల్ సజెషన్"

"దాన్దేముందక్కా! ఓ పది రోజులు బ్యాంక్‌కి శలవుపెట్టేస్తాను"

జ్యోతి ఆమెను బస్టాప్‌లో డ్రాప్ చేసేటప్పుడు నాగమణి అడిగింది "ఇంటికి రండక్కా"

"ఈ రోజు సాయంత్రం డాక్టర్‌భవానిగారి హాస్పిటల్‌లో కన్సల్టేషన్ అవర్స్ ఉన్నాయి. వెళ్లాలి. మరి ఉంటాను! బై!" కారు ముందుకు వెళ్లిపోయింది.

నాగమణి బస్సుకోసం ఎదురుచూస్తూ జ్యోతిని తలచుకుని అనుకుంది 'జ్యోతక్కా! నీ చేతిచలువ వలన నేను తల్లినయి, నాకో బిడ్డ లభిస్తే చాలు...ఎన్ని జన్మలైనా ఎత్తి నీ రుణం తీర్చుకుంటాను'.

★ ★ ★

మెన్సెస్ అయ్యాక పద్నాలుగోరోజు నుంచీ రోజూ నాగమణిని అబ్జర్వ్ చేస్తోంది డాక్టర్ జ్యోతి. రెగ్యులర్‌గా టెంపరేచర్ చెక్ చేస్తూ ఓవరీస్ ఫాలికల్‌ని మానిటర్‌చేసి ఓ రోజు లేప్రోస్కోపి ఆపరేషన్‌ద్వారా ఎగ్స్‌ని బయటకు తీసి వాటిని టెస్ట్‌ట్యూబ్స్‌లో ఉంచింది. ఆ తరువాత సుధాకర్ స్పెర్మ్‌ను కలెక్ట్ చేశారు.

టెస్ట్‌ట్యూబ్‌లోని ఎగ్స్ పూర్తిగా పెరిగే





దాకా ఆగి, సేకరించిన స్పెర్మ్‌లోంచి ఏక్టివ్ స్పెర్మ్‌టోజోని వేరుచేసి దాన్నిఅండానికి జత చేసింది. అండం, వీర్యంలోని జీవకణం కలుసుకుని ఫర్టిలైజేషన్ జరగాలి.

నలభైఎనిమిది గంటలపాటు జరిగే ఈ తతంగం రిజల్ట్స్ కోసం ఆ దంపతులే కాదు, డాక్టర్ జ్యోతి కూడా చాలా టెన్షన్‌గా ఎదురుచూసింది.

"ఫర్టిలైజేషన్ తప్పనిసరిగా జరిగి తీరు తుందికదా? " కాస్త భయంగానే అడిగింది నాగమణి.

"నీకు చెప్పే ఉంటాను! ఛాన్సెస్ ట్వంటీ ఫైవ్ పర్సంట్ మాత్రమే"

"ఒకవేళ..." అడగలేక అడిగిందామె "...ఫెయిలయితే? "

"మళ్ళీ నెలదాకా ఆగి, మరోసారి ట్రై చేయడమే"

"ఇన్‌క్యూబేటర్‌లో పిండోత్పత్తి జరిగితే, ఇక పూర్తిగా సక్సెస్ అయినట్టేనా? "

"సెవంటీఫైవ్ పర్సంట్ సక్సెస్ అయినట్టే"

"మరి మిగిలిన ట్వంటీఫైవ్ పర్సంట్? "

"ఒక్కోసారి పిండాన్ని రిజెక్ట్ చేయడంతో గర్భస్రావం జరిగే అవకాశం ఉంది"

"అప్పుడు కూడా మళ్ళీ మళ్ళీ ట్రై చేయొచ్చా? "

"చేయొచ్చు"

దేవుడు ఉన్నాడో లేడో తెలియదుగానీ, ప్రతిమనిషీ జీవితం మొత్తంమీద ఏదో సమయంలో ఆయనను తలచుకోకుండా ఉండలేడు. మానవశక్తి అంతమయినచోట దైవశక్తి తలంపుకు వస్తుంది. పిండాన్ని గర్భంలో ప్రవేశపెట్టడం మనిషి సాధించగ లిగాడు. కాని ఆ పిండం నిలిచి శిశువుగా మారడమన్నది అదృష్టంమీద ఆధారపడి ఉంది. మనిషి అదృష్టాన్ని నమ్మడం అంటే, మరో 'అతీత శక్తి'ని నమ్మడమే అవుతుంది.

యశోదమ్మ ఆ అతీతశక్తికి ఎన్నెన్నో మొక్కులు మొక్కేసింది. ఆ మొక్కులు తీర్చే బాధ్యత కొడుకూ, కోడలిమీద పడే సింది. అంతేకాదు, ఆరోజు చాలా హుషా రుగా కొడుకుతో మాట్లాడింది.

"చూశావట్రా! మనిషి ఏదయినా ప్రయత్నం చేస్తేనే పనులు సానుకూల పడ తాయి. ఆరోజు నేను అడ్రస్ తెచ్చివ్వబట్టి, మీరు హాస్పిటల్‌కి వెళ్ళబట్టి, మీకు మన జ్యోతి పరిచయం కాబట్టి మన ప్రయత్నం ఇక్కడిదాకా వచ్చింది. ఇక ఆ దేవుడు కూడా చల్లని చూపు చూస్తే... మన ఇంట్లోకి కాస్త కళాకాంతి వస్తాయి"

సుధాకర్ నిజమేనన్నట్టు తలాడించాడు. తన తల్లి ఆమాత్రం కోప్పడకుండా ఉంటే, తాము హాస్పిటల్‌కి వెళ్ళడం జరిగిఉండేది కాదు.

మరునాడు జ్యోతి వారింటికొచ్చి చాలా సంతోషంగా చెప్పింది, "మీరు నాకిప్పుడు స్వీట్ తినిపించాలి"

ఆమె ముఖంలోని ఆనందం చూడడం తోనే తొలిప్రయత్నం సక్సెస్ అయిందని వారందరికీ అర్థమయిపోయింది.

"నువ్వు శుభవార్త చెపితే, స్వీట్ ఏంటి తల్లీ, నువ్వు కోరింది ఏదయినా ఇచ్చేస్తాను" ఆనందం పట్టలేక తనేం మాట్లాడుతోందో అర్థం కాకుండా హామీలిచ్చేస్తోంది యశో దమ్మ.

"ప్లీజ్ చెప్పక్కా! సక్సెసా? " నాగమణి ఆమె చెయ్యి పట్టుకుని ఉత్సుకతగా అడి గింది.

సుధాకర్ మాత్రం క్యూరియాసిటీని అణ చుకుని ఆత్రంగా ఆమె ముఖంలోకి చూస్తు న్నాడు.

జ్యోతి వారందరి ముఖాల్లోకి ఒకసారి చూశాక చెప్పింది "సక్సెస్! పిండోత్పత్తి జరి

గింది. స్పెర్మ్‌ని ఎగ్‌లైక్ చేసింది"

అందరి ముఖాలు ఆనందంతో వెలిగిపో యాయి. సుధాకర్ నాగమణికేసి చూశాడు.

అరనిమిషం తరువాత నాగమణి ఆనం దాన్ని అతికష్టంమీద దాచుకుని వంటగది లోకి వెళ్లి స్వీట్ తీసుకువచ్చి ముందుగా జ్యోతి నోట్లో ఉంచింది. ఆ తర్వాత సుధా కర్‌కి, అత్తగారికి అందించింది. ఆ ముగ్గురూ జ్యోతి నోట్లో స్వీట్ ఉంచి ఉక్కిరి బిక్కిరయ్యేలా చేశారు.

ఆ క్షణం నాగమణికి అనిపించింది 'కేవలం పిండోత్పత్తి జరిగితేనే ఇంతగా ఆనందం కలుగుతోందే, రేపు నవమాసాలూ మోసి ఓ బిడ్డకు జన్మనిస్తే కలిగే ఆనందం ఎంత గొప్పదో కదా!' బహుశ తను తాళికట్టించుకుని ఇల్లాలయ్యే శుభవేళకన్నా, ఓ బిడ్డకు జన్మనిచ్చి తల్లయ్యేవేళ స్త్రీ అపరి మితానందం పొందుతుందేమో! బిడ్డకు జన్మనివ్వడంలో అంత ఆనందం ఉంది కాబట్టే ప్రతి స్త్రీ మాతృమూర్తి కావాలని అంతగా ఆరాటపడుతుంది.

పిండాన్ని తన గర్భంలో ఎప్పుడెప్పుడు ప్రవేశపెడతారోనని ఎదురుచూడసాగింది నాగమణి. తను గర్భవతి అయితే... పిండం తన గర్భంలో శిశువుగా మారుతూ ఉంటే తల్లిగా తను పొందబోయే ఆనందం తలచుకుని సంతోషపడిపోయిందామె.

ఆమె ఊహ వాస్తవరూపం ధరించేందుకు ఎక్కువకాలం పట్టలేదు. టెస్ట్‌ట్యూబ్‌లో కొన్నిరోజులు పిండం పెరిగాక దాన్ని నాగ మణి గర్భంలోకి హిస్టిరోస్కోపీ ద్వారా ప్రవే శపెట్టింది డాక్టర్ జ్యోతి.

ఆ తతంగం పూర్తయ్యాక జ్యోతి ఆ ముగ్గుర్నీ విడివిడిగా అడిగింది "నీకు మగ పిల్లాడు కావాలా? ... ఆడపిల్ల కావాలా? "

యశోదమ్మ వెంటనే జవాబిచ్చేసింది "నాకు మనుమడే కావాలి తల్లీ!"

యశోదమ్మ అభిప్రాయం తెలుసుకున్నాక ఆమె సుధాకర్‌ని అదే ప్రశ్న అడిగింది. సుధాకర్ జవాబు చెప్పడానికి అరనిమిషం ఆలోచించాడు.

"వాస్తవంగా నాకు ఆడపిల్లలంటేనే ఇష్టం. కాని ఓ మగబిడ్డ ఉండితీరాలి. ఇద్దరికీ అవ కాశం ఉంటే ఓ ఆడపిల్లని, ఓ మగపిల్లవా డిని కోరుకుంటాను"

"ఆ ఒకే బిడ్డ ఆడపిల్లయితే బాధపడా ల్సిన అవసరమేముంది? " అడిగింది జ్యోతి.

"ఆడపిల్ల ఉంటే- మన పిల్లకాదు, ఆడపిల్ల అని ఆ పదంలోనే తెలిసిపోతుంది. ఆడపిల్ల మనతో ఓ ఇరవై సంవత్సరాలు మాత్రమే ఉంటుంది. ఆ తర్వాత ఆమె భర్తతో కలిసి వెళ్లిపోతుంది"

అతడి మాటలు కట్ చేస్తూ అంది జ్యోతి. "ఈ కాలంలో మగపిల్లలు కూడా ఉద్యోగం రాగానే తన భార్యాబిడ్డలతో కలిసి, తల్లిదండ్రులను వదిలి దూరంగా వెళ్లి పోతున్నారుకదా!"

"వెళ్ళిపోతున్నారు నిజమే! కాని తల్లిదం డ్రులను వదిలి వెళ్లిపోయే సంఖ్య పాతిక శాతం ఉండొచ్చు. మిగిలిన డెబ్బయ్ ఐదు శాతం ఇప్పటికీ తల్లిదండ్రులను ఆదరంగానే చూస్తున్నారు. కాని ఆడపిల్లలు డెబ్బయ్ ఐదుశాతం కాదు, ఐదుశాతం కూడా తల్లిదం డ్రులతో కలిసి ఉండే అవకాశం లేదుకదా?"

అతడి వాదనలోనూ కొంత నిజమున్నట్టు గ్రహించింది ఆమె. చివరిగా నాగమణిని అడిగింది "మరి నీకు ఎవరు కావాలి? "

అప్పటికే ఆలోచించుకుని, సిద్ధమై ఉన్న ట్టుగా నాగమణి జవాబు చెప్పేసింది "నాకూ మగపిల్లవాడే కావాలి"

"ఎందుకమ్మా? "

"మావారి ఆలోచనే నాది కూడా"





జ్యోతికి బాధనిపించలేదు. ఇది లోకసహజమేమో! మగవారు మాత్రమే కాదు, ఆడవారు కూడా 'మగసంతతినే' కోరుకుంటారు. ఎక్కువమందికి మొదటి ప్రిఫెరెన్స్ మగపిల్లాడే అవుతాడు. మరో అవకాశం లేదని తెలిస్తే, ఖచ్చితంగా మగపిల్లాడే పుట్టాలని వేయిదేముళ్లకి మొక్కుకుంటారు.

యశోదమ్మ అడిగింది. "ఇప్పుడు మా ఇంట్లోకి మగపిల్లాడు రాబోతున్నాడో, ఆడపిల్ల రాబోతుందో చెప్పగలవామ్మా? "

జ్యోతి తల అడ్డంగా ఆడించింది "ఇప్పుడే ఎలా చెప్పగలం? "

"మగపిల్లాడు పుట్టే అవకాశం ఉందా? " ఈసారి ఆమె కాస్త ఆశగా అడిగింది.

"అదీ మనం చెప్పలేం. సైన్స్ ప్రకారం- స్త్రీ పురుషులలో ఎక్స్, వై క్రోమోజోముల కలయికమీద శిశువు సెక్స్ ఆధారపడి ఉంటుంది. స్పెర్మ్ సెల్స్‌లో సగం 'ఎక్స్' క్రోమోజోములు, మిగిలిన సగం 'వై' క్రోమోజోములు వుంటాయి. స్త్రీ అండంలో కేవలం 'ఎక్స్' క్రోమోజోములు మాత్రమే ఉంటాయి. ఎక్స్ క్రోమోజోమ్ గల సెల్‌తో స్త్రీ అండం కలిస్తే ఎక్స్ ప్లస్ ఎక్స్ వలన ఆడపిల్ల పుడుతుంది. ఒకవేళ వై క్రోమోజోము గల వీర్యకణం అండంతో కలిస్తే ఆ ఎక్స్ ప్లస్ వై వలన మగపిల్లవాడు పుడతాడు. సో! కొడుకు లేదా కూతురు పుట్టడమన్నది పూర్తిగా అదృష్టం మీద ఆధారపడి ఉంటుంది" చెప్పింది జ్యోతి.

అంతలో సుధాకర్ అన్నాడు, "ఏమో! ఫ్యూచర్‌లో మన సైన్స్ ఇంకా డెవలప్పయి క్రోమోజోముల కలయికను కూడా లేబ్‌లో నిర్ధారించి, ఆడపిల్ల కావాలంటే ఆడపిల్ల, మొగపిల్లాడు కావాలంటే మొగపిల్లాడిని పుట్టించగలరేమో!"

"నిజమే! ఒక్కోసారి మానవ మేధస్సు సాధించలేనిదేమీ లేదనిపిస్తుంది. భవిష్యత్తులో అలా కూడా జరగచ్చు" జ్యోతి అంది.

ఆ నలుగురూ ఆరోజు చాలా ఆనందంగా గడిపారు.



అదేరోజు రాత్రి జ్యోతికి సతీష్‌నుండి ఫోన్ వచ్చింది.

అవతలివైపు అతడి గొంతు వినడంతోనే, కాసింత చిరాకుని మనసులో నుండి బయటకు అవతలి వ్యక్తికి అర్థం అయ్యేలా వ్యక్తం చేసి "ఏంటీ...? ఏం కావాలి? " అంది.

"నాకేం అవసరం లేదు. కాని నువ్వేం చేస్తున్నావో అన్నది ఇన్‌వెస్టిగేషన్ చేసి మరీ తెలుసుకుంటున్నా" అవతలివైపు అతడు అదోలా నవ్వాడు.

ఆమె ఆ నవ్వు పట్టించుకోకుండా "ఇంతకీ ఏం తెలుసుకున్నావ్? " అడిగింది.

"ప్రస్తుతం నీ ప్రియుడి పెళ్లానికి కడుపు తెప్పించే ప్రయత్నంలో ఉన్నట్టు తెలుసుకున్నాను"

ఆమె చేతివేళ్లు రిసీవర్ చుట్టూ బిగుసుకున్నాయి. మనిషి ఎంత పెద్ద చదువులు చదివినా సంస్కారవంతంగా మాట్లాడడం చేతకాదని, సతీష్‌లాంటి మనిషిని చూసినప్పుడే తనకు అర్థమయింది. ఆరేళ్ల వైవాహిక జీవితంలో అది మరింత బలపడింది.

"సుధాకర్ నాకు చిన్ననాటి స్నేహితుడు"

అతడు అదోలా నవ్వాడు "కాలానికి అను గుణంగా వరుసలూ మారుతుంటాయి మేడమ్"

అప్పుడడిగిందామె "మిస్టర్ సతీష్! మనం విడిపోయాం! నీ గురించి నేను ఆలోచిం చటం కూడా లేదు. మరి నా గురించి ఇంతగా శ్రమపడి విషయసేకరణ చేయవ లసిన అవసరమేంటో నాకర్థం కావడంలేదు"

"ఎంతయినా నువ్వు నా మాజీ భార్యవి. నీ అందం, ఆస్తి నా సొంతంగా భావించిన వాడిని... ఒకవేళ విడిపోవచ్చు కాని నావి అనుకున్నవి, మరొకరు దోచుకుంటుంటే బాధగా అనిపిస్తుంది. 'బాధపడి నువ్వేం చేయగలవ్?' అని నువ్వు నన్ను ప్రశ్నిం చొచ్చు శారీరకంగా మిమ్మల్నిద్దరినీ ఏమీ చేయలేకపోవచ్చు అయితే నిన్ను మాత్రం మానసికంగా అప్పుడప్పుడు ఇలా హింసి స్తూనే ఉంటాను" అతడు చాలా కసిగా పలి కాడు.

ఆమెకు నవ్వొచ్చింది. 'రోగి కోరిందీ, వైద్యుడు చెప్పిందీ అదే' అన్నట్టు- తన మన సులోని కోరిక కూడా అదే! అతడు సుధాక ర్‌కి తనకూ మధ్య ఏదో సంబంధం ఉందని భ్రమపడాలి. ఆ భ్రమతో బాధపడాలి.

"ఆల్‌రైట్ మిస్టర్ సతీష్! అప్పుడప్పుడూ ఫోన్ చేస్తూ ఉండండి" ఆమె ఫోన్ పెట్టే సింది.

ఆ క్షణం అవతలివైపు సతీష్ ముఖం ఎలా మారిపోయి ఉంటుందో ఊహించు కుంది. ఆ ఊహే ఆమెకు ఎంతో సంతోషం కలిగించింది.

ఎందుకో తెలియదు, ఆ రాత్రి ఆమె చాలా ప్రశాంతంగా నిద్రపోయింది.

★ ★ ★

ఇన్‌వెట్రో ఫెర్టిలైజేషన్ కేసుల్లో అబార్షన్ జరిగేందుకు ఎక్కువగా అవకాశం ఉన్నం దున, డాక్టర్ జ్యోతి తన పేషంట్ నాగమ ణిని కాస్త జాగ్రత్తగా చూసుకోసాగింది. ప్రతిరోజూ వారింటికెళ్లి ఆమెతో కాసేపు మాట్లాడి 'ప్రోబ్లెమ్ ఏమయినా ఉందా?' అంటూ అడిగేది. అదంతా ఆమె పర్సనల్ ఇంటరెస్ట్‌తోనే చేసేది.

డ్యూటీ అవర్స్ అయిపోయాక ఆమె ఎక్కువగా ఆ ఇంట్లోనే గడపడం మొదలు పెట్టింది. నాగమణితో మరింత చనువుగా మసలుకుంటోంది మధ్య. ఆమెకు ఆ ఇంట్లో చాలా ప్రశాంతత లభించేది. తను పోగొట్టు కున్న ఆనందమేదో ఇప్పుడిప్పుడే తిరిగి దొరుకుతున్నట్టనిపించసాగింది.

యశోదమ్మ కాసేపు ఆమెతో గడిపి, ఆ తర్వాత తన గదిలో కెళ్ళిపోయి పురాణాలు చదువుకునేది. జ్యోతి, నాగమణి అప్పుడ ప్పుడూ డాబామీద కుర్చీవేసుకుని కూర్చుని చాలా విశేషాలు చెప్పుకునేవారు.

అలా ఓరోజు వారిద్దరూ డాబామీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండగా టాపిక్ 'మాతృత్వం'మీదకు మళ్ళింది.

"ఈ ప్రపంచంలో ఏ స్త్రీ అయినా తన జీవితంలో ఒక్కసారి కనీసం ఒక్కసార యినా 'తల్లి' కావాలని కోరుకుంటుంది కదక్కా" అంది నాగమణి.

"అవునమ్మా! ముఖ్యంగా ఈ దేశంలోని స్త్రీ తల్లి కావడానికి అత్యంత ప్రాధాన్యత ఇస్తుందేమోననిపిస్తుంది. అందుకోసం ఆమె ఎన్నెన్నో పాట్లు పడుతుంది. తల్లి కావాలనే కోరికతో కొందరు ఆడవాళ్లు చేసే విపరీత చేష్టలు అసలు మన ఊహకు అందనంత విచిత్రంగా ఉంటాయి. మేము డాక్టర్స్‌మి కాబట్టి మెడికల్ జర్నల్స్‌లో కొన్ని కేసులు చదువుతాం. తెలిసిన డాక్టర్ల అనుభవాలు కొన్ని మాకు పాఠాలుగా మారుతుంటాయి"

"అలాగా"

"తల్లి కావాలనే కోరికతో తప్పు చేసి ఆ




తర్వాత ఆత్మహత్య చేసుకున్న ఓ అమాయ కురాలి విషాదగాథ విన్నప్పుడు నా మనసు ఎటో వెళ్ళిపోయింది" జ్యోతికి ఆ యువతి గుర్తురావడంవల్ల కాబోలు, ముఖంలో విషాదం కమ్ముకుంది.

"ఏం జరిగిందక్కా" నాగమణి కుర్చీలో ముందుకు వాలింది.

"ఇక్కడే ఏదో పల్లెటూరు ఆ అమ్మా యిది. పెళ్ళయిన మూడేళ్లవరకూ పిల్లలు లేకపోవడంతో మొదట డాక్టర్‌కి చూపించు కోకుండా ఏవేవో నాటు మందులు వాడింది తాను. ప్రయోజనం లేకపోయింది. అప్పుడే ఆమె తన చిన్ననాటి మిత్రురాలికి తన బాధ చెప్పుకుందట. అప్పుడు తెలివైన ఆ స్నేహితురాలు 'ఒసే! పిల్లలు పుట్టకపోవడా నికి లోపం నీదయి ఉండదు. నీ మొగుడి దయి ఉంటుంది. పదిరోజులు మొగుణ్ణి మార్చి చూడు' అంటూ సలహా ఇచ్చిందట. 'బిడ్డ' కావాలనే విపరీతమైన కోరికతో తనేం చేయబోతోందీ అని ఆలోచించే జ్ఞానం లేకనే ఆమె తప్పటడుగు వేసింది. కొద్ది కాలం గడిచినా ఆమెకు పిల్లలు పుట్టలేదు. ఇంతలో మొగుడు ఆమెను వెంటబెట్టుకుని హాస్పిటల్‌కి వచ్చాడు. పరీక్ష చేసిన డాక్టర్లు 'లోపం' ఆమెలోనే ఉందనీ, ఆమెకు పిల్లలు పుట్టే అవకాశం చాలా చాలా తక్కువని తేల్చి చెప్పారు. దాంతో ఆమెలో 'తప్పు చేశా నన్న ఫీలింగ్' రోజురోజుకూ పెరిగిపో యింది. 'లోపం' పెళ్ళాంలో ఉందని తెలిసీ, ఆమెను ఎప్పటిలానే మంచిగా చూసుకుం టున్న భర్తకు, తను అన్యాయం చేశానే అని అతడి ముఖంలోకి సరిగా చూడలేకపో యేది. అలా 'అంతర్మథనం'లో తననుతాను సమర్థించుకోలేక చివరికి ఆమె ఓ రోజు ఆత్మహత్య చేసుకుని చనిపోయింది"

'ఎంత విషాదకర సంఘటన' మనసు లోనే అనుకుందామె. కొద్దిక్షణాలు తనేం మాట్లాడలేకపోయింది.

"చాలా చిత్రమైన విషయాలు తెలియచే స్తున్నారక్కా!"

"చిత్రమైనవే కావచ్చు. కాని ఆ చిత్రమ యిన విషయాల వెనుక ఆడదాని మనసు ఉందమ్మా. మాతృమూర్తి కావడం స్త్రీకి ప్రకృతి ఇచ్చిన వరం. కాని ఏ కారణాలవల ననో ఆ 'వరం' తనకు లభించకుంటే ఆ స్త్రీ ఆ 'వరం' దక్కించుకునేందుకు ఇంచు మించు తపస్సు లాంటిది చేస్తోంది. తపస్సు కూడా కాదమ్మా... ఘోరమైన తపస్సు అన్నది సరయిన పదమేమో ననిపి స్తుంది నాకు"

"అవునక్కా" అందినాగమణి.

కొద్దిసేపటితర్వాత జ్యోతి అంది" ఆలోచి స్తుంటే ఈ నిస్సంతు సమస్య ఈనాటిదికా దనిపిస్తుంది. పురాణకాలంలోనే ఒకమహా రాజు తనకు సంతానం కోసం పుత్రకామేష్టి యాగం చేశాడు. మరో మహారాజు తను తండ్రయ్యే అవకాశంలేకపోవడంతో తన ఇద్దరి భార్యలకు యముడు, ఇంద్రుడు, అశ్వనీ దేవతల ద్వారా పుత్రుల్ని కన్నాడు..."

జ్యోతి మాటల్ని మధ్యలోనే కట్ చేసింది నాగమణి "వారు దేవతలేకావచ్చు. కాని పరపురుషుల ద్వారా తనభార్యలు బిడ్డల్నిక నడానికి పాండురాజు అంగీకరించడం ఏదోలా అనిపిస్తుందికదక్కా"

"భారతం ఒక కల్పనో లేకొకనాటి చరిత్రో తెలియదుగానీ, ఒకప్పుడు స్త్రీకి ఇన్ని శృంఖ లాలు లేవన్నది మాత్రం నిజం. అదే పురా ణంలో పాండురాజు భార్య కుంతి తనకో డలు ఐదుగురు భర్తలు కలిగి ఉండడాన్ని సమర్థించింది. మరోవైపు శ్రీకృష్ణుడు గోకు లంలోని గోపికలందరితో సరసాలాడు తున్నా నాటిజనం పెద్దగా పట్టించుకోలేదు. ఈ సంబంధాలకు పవిత్రత ఆపాదించడం అన్నది పక్కన పెట్టినప్పటికీ, ఆనాటి ఆడది నేటి స్త్రీ అంతగా బంధితురాలు కాదు అన్నది నిజం. అంతెందుకు మనకు తెలిసిన

చరిత్రలో కూడా ఈ కుటుంబవ్యవస్థ ఏర్పడకముందు మాతృస్వామ్యం ఉండేది. అప్పుడు స్త్రీ తనకు ఇష్టమొచ్చిన పురుషునితో శృంగారకేళి జరిపి బిడ్డల్ని కనడం చేసేది. ఆవిధంగా ఆమె ప్రకృతి తనకు ప్రసాదించిన వరాన్ని సద్వినియోగం చేసుకునేది"

జ్యోతి మాటలకునాగమణి కాస్త ఇబ్బంది పడుతూ "కాని అక్కా! నాటికన్నా నేడున్న సంప్రదాయమే మంచిదేమోనని అనిపిస్తోంది నాకు. స్త్రీ పురుషులు కట్టుబాట్లు, వావివరుసలు లేకుండా ఎవరంటే వారితో... ఏదోలా ఉంది" అంది.

ఆమె నిలువుగా తలాడించింది. "అదీ నిజమే! అందుకే ఆ వ్యవస్థలో నుండి ఈ వ్యవస్థ పుట్టుకొచ్చింది. కాని ఈ వ్యవస్థలో కూడాకొన్ని లోపాలు లేకపోలేదు"

"ఎలాంటి లోపాలక్కా? "

"సంతానవతి కాలేనిస్త్రీని మగాడు వదిలేసి, మరో పెళ్లి చేసుకోవడంలాంటివి... స్త్రీ అంటే పిల్లల్ని కనే యంత్రంలా మగాడు భావించడం లాంటివి..."

నాగమణి మరేం మాట్లాడలేదు. మౌనంగా ఉండిపోయింది. జ్యోతి అలా ఎందుకన్నదో అర్థమయింది. ఆమె అలా మరో మూడ్‌లోకి జారిపోయి సాలోచనగా ఆకాశంలోకి చూడటం గమనించి, ఆమెను హుషారు పరిచేందుకు టాపిక్‌ని డైవర్ట్ చేసింది.

"మనం మళ్ళీ ఓసారి సినిమా ప్రోగ్రాం పెట్టుకుంటే ఎలా ఉంటుంది? " అంది నాగమణి.

"బాగానే ఉంటుంది" నవ్వింది జ్యోతి. "ఎప్పుడెళ్దాం"

"మా వారిని అడిగి ఓరోజు ఫిక్స్ చేస్తాను. ముందురోజు మీకు చెబుతాను"

"అలాగే"

ఆరోజుకి అలా ఆ టాపిక్ ముగిసింది.

★ ★ ★

మురళి కారును స్టేషన్‌నుండి క్లాక్‌టవర్ వైపు పోనిస్తూ యధాలాపంగా అటు చూశాడు. అతడికి కనిపించిన దృశ్యం అతన్ని చప్పున బ్రేక్ నొక్కేలాచేసింది. కారు కీచుమన్న చప్పుడుతో ఆగింది. వెనుకే వేగంగా వస్తున్న మోటార్ సైకిలిస్ట్ కారును గుద్దుకోబోయినంత పనిచేసి ఎలాగోలా తప్పించి డ్రైవింగ్ సీట్లో ఉన్న అతడికేసి తీక్షణంగా చూస్తూ నోట్లోనే ఏదో తిట్టుకుంటూ ముందు కెళ్ళిపోయాడు.

మురళి కారుని రోడ్డు అంచుకుపోనిచ్చి ఆపాడు. కారు దిగి, డోర్‌వేసి, రోడ్డుదాటి ఆవలివైపుకు వెళ్ళాడు. అక్కడ తన కారు బోనెట్ పైకెత్తి ఏదో చూస్తోంది డాక్టర్ జ్యోతి.

మురళి ఆమె దగ్గరగా వెళ్ళి "నమస్తే డాక్టర్" అన్నాడు.

ఆమె చప్పున తలతిప్పి చూసింది. అతడిని చూడడంతోనే ఆమె పెదవులు విచ్చుకున్నాయి. ఈ మధ్యకాలంలో వారిద్దరూ ఒకటీ, రెండుసార్లు సుధాకర్ ఇంట్లోనే కలుసుకున్నారు. అలా కలుసుకుంటున్నప్పుడల్లా తనను చూడగానే మురళి కళ్ళలో అదో రకమయిన మెరుపు కదలాడడం ఆమె గమనిస్తూనే ఉంది.

"నమస్తే..." అంటూనే ఆమె కాసింత ఆశ్చర్యంగా "మీరు... ఇక్కడ...? " అంది.

"స్టేషన్‌నుండి వస్తున్నాను. మా ఫ్యాక్టరీ జనరల్ మేనేజర్ ఊరు వెళుతుంటే సెండాఫ్ చెప్పేందుకు వచ్చాను. అక్కడి నుండి వస్తుంటే మీరు కనిపించారు"

"అలాగా" అందామె.

అతడు కారువైపు తలతిప్పి "ఏమిటి? కారు ట్రబులిచ్చిందా" అడిగాడు.





"అవునండి" అందామె.

మురళి కారు ఇంజన్‌ని రెండు నిమిషాలు పరిశీలించాక చెప్పాడు. "ఏదో మేజర్ ప్రాబ్లమ్‌లా ఉంది. మెకానిక్‌ని పిలవడం అవసరమనుకుంటాను"

ఆమె ముఖంలో కాసింత అనీజీనెస్ కదలాడింది. బానెట్ వేసేశాకామె అటునిటు ఆటోకోసం చూస్తుంటే అతడు అడిగాడు. "మీరిప్పుడు ఎక్కడికి వెళుతున్నారు? "

"హాస్పిటల్‌కి. ఈరోజు నాగమణికి చిన్న టెస్ట్ చేయాలి"

"ఎలాంటి టెస్ట్? "

"చాలా ఇంపార్టెంట్ టెస్ట్ అది. ఆమె గర్భం పిండాన్ని ఏక్సెప్ట్ చేయడం జరిగిందా లేదా అన్నది తెలియజేసే టెస్ట్"

"ఐసీ" అన్నాడు మురళి. "అంటే మీ ప్రయత్నం ఫలించిందో లేదో తెలిసేరోజన్న మాట ఇది"

ఆమె నవ్వింది. అతడు ఆమె నవ్వును ఆప్యాయంగా చూశాడు. అప్పటికే అతడు ఓ నిర్ణయానికి వచ్చినట్టు "అయితే ఓ పని చేద్దాం. మిమ్మల్ని హాస్పిటల్ దగ్గర డ్రాప్ చేస్తాను. దారిలో మెకానిక్‌కి కారు తాళాలిచ్చి, ఈ ప్లేస్ చెప్పేస్తే రిపేర్ చేసి కారు డెలివరీ ఇచ్చేస్తాడు... ఏమంటారు? ".

జ్యోతి అతడి వైపు కాస్త ఇబ్బందిగా చూసి "మీకు శ్రమ కలిగిస్తున్నానేమో" అంది.

"భలేవారే! నా స్నేహితుడికి చిన్ననాటి స్నేహితురాలు మీరు. మీకు హెల్ప్ చేయడం నా కర్తవ్యంగా భావిస్తాను. అయినా ఫ్రెండ్స్ మధ్య మొహమాటాలు బాగుండవు. కనుక నాకు ఇబ్బందేమోనని మీరు ఇబ్బంది పడకండి" అన్నాడు చిరునవ్వుతో.

ఆమె తన కారుడోర్స్ లాక్ చేసింది.

అతడు కారు ఫ్రంట్ డోర్ తెరిచాక కూర్చుంది. కారు ముందుకు కదిలింది.

కారు డ్రైవ్ చేస్తూనే అతడు ఓరగా ఆమెను చూశాడు. ఎందుకో తెలియదు. ఆమెను చూస్తుంటే ఓ అపురూపమైన భావం మనసులో కదలాడి తనువంతా పులకరించేలా చేస్తుంది. అంతేకాదు, ఏదో.. మరేదో చెప్పాలనిపిస్తుంది... కాని చెప్పలేని అశక్తుడయిపోతున్నాడు... ఎందుకని.?

రెండు నిమిషాల తర్వాత కారు మెకానిక్ షాపు ముందు ఆగింది. ఆమె మెకానిక్‌ని పిలిచి కారు తాళాలిచ్చి, తన విజిటింగ్ కార్డు చేతిలో పెట్టింది.

అక్కడనుంచి కదిలి హాస్పిటల్ దగ్గర కారు ఆగాక అతడు ఆమెతో అన్నాడు. "మరో రెండు గంటల తర్వాత నేను మీకు ఫోన్‌చేస్తాను. నాకు గుడ్‌న్యూస్ చెప్పండి".

"గుడ్ న్యూస్ చెప్పగలననే అనుకుంటున్నాను".

అతడు కారు ముందుకు పోనిచ్చాడు.

ఆమె హాస్పిటల్ లోపలికెళ్ళింది.

మరో పావుగంట తర్వాత యశోదమ్మ, నాగమణి, సుధాకర్‌లు హాస్పిటల్‌కి వచ్చారు. ఆమె నాగమణిని థియేటర్‌లోకి తీసుకెళ్ళి పరీక్ష చేసింది.

వారంతా భయపడుతున్నట్టుగా గర్భం పిండాన్ని రిజెక్ట్ చేయడం జరగలేదు. అంటే అబార్షన్ జరిగే సూచనలేవీ కనిపించలేదు.

డాక్టర్ జ్యోతి చిరునవ్వుతో చెప్పిన విషయం విని అంతా హేపీగా ఫీలయ్యారు.

మరో పదినిమిషాల తరువాత మురళి దగ్గరనుండి ఫోన్ వచ్చింది. సుధాకర్ అతడికి ఆ గుడ్‌న్యూస్ చెప్పాడు. మురళికూడా హేపినెస్ ఫీలయ్యాడు.

అయితే పూర్తిగా రిలాక్స్ అయిన వారి మూడ్‌ను జ్యోతి మాటలు భంగపరిచాయి.

"ఇంకో టెస్టు మిగిలిపోయింది సుధాకర్! ఓ పదిరోజుల తరువాత నాగమణిని హాస్పిటల్‌కి తీసుకురావలసి ఉంటుంది" అంది జ్యోతి.

"ఇంకో టెస్టంటే...?" కొద్దిగా కంగారుగా అడిగాడతను.

"యామ్నియో సెంటిసెస్ అనే టెస్ట్ అది. గర్భాశయంలోని ద్రవాన్ని తీసి ఎనాలిసిస్ చేస్తాం. గర్భంలోని బేబీ ఆరోగ్యంగా ఉందా లేక అవకరంగా ఉందా అన్నది తెలుసుకుంటాం...."

ఆమె మాటలు మధ్యలో కట్ చేస్తూ అడిగాడు సుధాకర్ "ఒకవేళ బేబీ ఆరోగ్యంగా లేకపోతే..." పూర్తిగా అనలేక ఆగిపోయేడు.

"ఒకవేళ... అఫ్‌కోర్స్! అలా ఉండదనే ఆశిద్దాం... అవకరంగా ఉంటే అబార్షన్ చేస్తాం" చాలా కాజువల్‌గా చెప్పినట్టు చెప్పాలనే ప్రయత్నించి విఫలమయిందామె.

సుధాకర్ మొహంలో ఓ బాధావీచిక కదలాడడమేకాదు, కాస్త టెన్షన్ కూడా కనిపించిందామెకు.

"టెన్షన్ పడాల్సిన అవసరం లేదు సుధాకర్! ఇట్సే కాజువల్ టెస్ట్. ప్రొసీజర్ ప్రకారం మేము చేసే పరీక్ష అది. అంతే!"

సుధాకర్ వాళ్ళు ఇంటికి వెళ్ళిపోయారు. యశోదమ్మ మళ్ళీ దేవుడికి మొక్కుకుంది.

పదిరోజుల తర్వాత సుధాకర్ నాగమణిని హాస్పిటల్‌కి తీసుకెళ్ళాడు.

టెస్టులన్నీ అయ్యాక జ్యోతి అతడితో చెప్పింది. "బేబీ ఆరోగ్యంగా ఉంది. మరి కొద్ది నెలల్లో..."

ఆతరువాత మాటలు అతడు వినలేదు. అప్పటికే ఊహల్లోకి వెళ్ళిపోయాడు.

మరికొద్ది నెలల తర్వాత-- నాగమణి మగపిల్లాడికి జన్మనిచ్చింది.

★ ★ ★

"రేయ్ కన్నా... రేయ్ చిన్నా.." శంకర్రెడ్డి రెండునెలల పసికందును ఎత్తుకుని ముద్దులాడుతున్నాడు.

యశోదమ్మ, సుధాకర్, నాగమణి ఆయనకేసే చూస్తున్నారు. ఆయన ఆ పిల్లవాడిని ముద్దులాడుతూ చాలా ఆనందపడిపోతున్నాడు. ఆ ఇంట్లో అడుగు పెట్టినప్పటి నుండీ ఆయన వాడిని వదల్లేదు. రెండు చేతులలో వాడిని ఉంచుకునే ఇతరులతో మాట్లాడుతున్నాడు.

చాలా సేపటి తర్వాత ఆయన యశోదమ్మ వైపు తిరిగి "మొత్తానికి అదృష్టవంతురాలవు యశోదమ్మా! ముద్దులొలికే మనుమడిని సంపాదించావ్" అన్నాడు.

"ఇదంతా మీ కూతురి చేతి చలవేనండీ" అంది అభిమానంగా.

చాలా రోజుల తర్వాత ఆయన మళ్ళీ హైదరాబాద్‌కి వచ్చారు. సంక్రాంతికి కూతుర్ని తీసుకెళ్ళాలని ఆయన కోరిక. ఆ ఉదయమే ఆయన తను వచ్చిన పని ఆమెకు చెప్పేశాడు. ఆయన ఊహించినట్టుగానే ఆమె 'నేనా పల్లెకు రాలేను నాన్నా' అనేసింది. 'ఎందుకనమ్మా' అని ఆయన అడగలేదు. కారణం ఊహించగలడు. ఊరంతా జ్యోతి వంటి అదృష్టవంతురాలు మరెవ్వరూ లేరు అనుకునే వారు ఒకప్పుడు. ఆరోజుల్లో ఆమెకేసి అభిమానంగానూ, కాసింత భయంగానూ చూసేవారు. అదే ఇప్పుడు ఆమె పల్లెకు వస్తే? ... జాలి చూపులు, పరామర్శలు ఎదుర్కోవలసి వస్తుంది. అందుకే జ్యోతి ఆ పల్లెకు రావడానికి ఇష్టపడదని ఆయనకు తెలుసు.

ఆ మధ్యాహ్నం అందరూ భోజనానికి కూర్చున్నప్పుడు ఆయన సుధాకర్ వైపు చూస్తూ అడిగాడు. "అమ్మాయిదంటే లాంగ్ లీవ్ అనుకో, మరి నువ్వూ బ్యాంక్‌కి వెళ్ళలేదేంటోయ్"





"ఈరోజు నుండి మేము స్ట్రయిక్ నోటీసు ఇచ్చాం. అందువల్ల ఈరోజు బ్యాంక్‌కి వెళ్ళ నవసరం లేదు"

"స్ట్రయిక్ ఎందుకు? "

"మాకు జీతాలు పెంచాలని"

ఆయన వెంటనే అన్నాడు "ఇది చాలా అన్యాయమోయ్. ఒక్కొక్కరు నెలకు ఐదు వేలకు తగ్గకుండా జీతాలు తీసుకుంటు న్నారు. ఇంకా జీతం పెంచాలని కోరడం నాకు మాత్రం అన్యాయమనే అనిపిస్తుంది"

"అన్యాయమెలా అవుతుంది? మా శ్రమకు తగిన ఫలితాన్నే కోరుకుంటున్నాం మేం" సుధాకర్ నవ్వుతూ అన్నాడు.

భోజనాలు పూర్తికావస్తుండగా యశో దమ్మ శంకర్రెడ్డివైపు చూస్తూ మెల్లగా అంది. "మీరు ఏమీ అనుకోనంటే ఒక మాట"

శంకర్రెడ్డి ఆమె వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"మన..మన జ్యోతికి మళ్ళీ పెళ్ళి చేస్తే ఎలా ఉంటుంది? "

సుధాకర్, నాగమణి ఆమెకేసి చిత్రంగా చూశారు. ఈ కాలం ముసలివాళ్ళు కాస్త ఉదారంగానే ఆలోచించగలుగుతున్నారు. మొత్తం మీద సమాజంలో మార్పు వస్తూ ఉంది. మనసులోనే అనుకున్నారు.

శంకర్రెడ్డికి మాత్రం నవ్వొచ్చింది. క్రితం సారి తను హైదరాబాద్ వచ్చిన కార్యమే మిటో ఆమెకు తెలియదు కాబోలు అనుకు న్నాడు. 'తనెప్పుడో ఆ ప్రయత్నాలు చేసా నని, తనకు తానే ఆ ప్రయత్నాలు జరగ కుండా ఆపుచేసిందని ఎలా చెప్పడం? ...

ఆయన తను జ్యోతి రెండోపెళ్ళి కోసం చేసిన ప్రయత్నాలన్నీ ఆమెకు వివరించాడు. యశోదమ్మ ఆసక్తిగా విన్నది. అంతా విన్నాక ఆమె అంది "అయితే ఇప్పటి వరకూ మీరు పిల్లలున్న తండ్రినే జ్యోతికి భర్తగా వెతికారన్నమాట"

ఆమె ఏమన్నదో ఆ ముగ్గురికీ అర్థం కాలేదు. అప్పటికే వారంతా ప్లేట్స్‌లో చేతులు కడిగేసుకుంటున్నారు. శంకర్రెడ్డి నాగమణి అందించిన నేప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ "మీరేమంటున్నారో అర్థం కావడంలేదు యశోదమ్మా? "అన్నాడు.

"మీరనేదాన్ని బట్టి జ్యోతి రెండోపెళ్ళి మగాడిని పెళ్ళి చేసుకునేందుకు ఇష్టపడటం లేదు. ఆ తండ్రికి, పిల్లలకు మధ్య తను దూరం పెంచుతానేమోనని భయపడు తోంది. ఆ భయంలో ఓ అర్థముంది. అలా కాకుండా మొదటి పెళ్ళివాడితోనే ఆమె పెళ్ళంటే తను ఒప్పుకునే అవకాశం ఉంది"

"ఈ ప్రపంచంలోని ఏ మగాడయినా తనకు కాబోయే భార్య అనాకారి అయితే అడ్జస్ట్ కాగలడు. ఆస్తి లేకపోయినా తన 'అదృష్టం' అంతేలే అని సరిపెట్టుకోగలడు. ఒకవేళ అంగవైకల్యం ఉన్నప్పటికీ సర్దుకు పోగలడు. కాని..తన కాబోయే భార్య 'తల్లి కాలేదు' అని తెలిస్తే మాత్రం ఆలోచిస్తాడు. ఒకవేళ ఆ కుర్రాడు కాసింత విశాలభావాలు కలిగిన వాడయినా అతడి తల్లిదండ్రులు మాత్రం అలాంటి పెళ్ళికి ఎట్టిపరిస్థితు ల్లోనూ అంగీకరించరు గాక అంగీకరిం చరు... అసలు 'తల్లికాలేని ఆడదాన్ని ఇల్లా లి'గా తెచ్చుకునే మగాడు ఈ ప్రపంచంలో ఉంటారంటే నేను మాత్రం నమ్మలేను" శంకర్రెడ్డి నిట్టూర్చాడు. ఆ నిట్టూర్పులో ఎంతో వేదన ఉంది.

"నేననుకోవడం మీరు ప్రయత్నించడం లేదు" అంది యశోదమ్మ

"ఫలితం ఉండదని ముందుగానే తెలిసి పోయాక ప్రయత్నించడం వృథా కదా యశోదమ్మా"

"మీరు ప్రయత్నించకుండానే ఫలితాల గురించి ఆలోచిస్తున్నారు. నేను అనుకో



వడం 'తల్లి కాలేని ఆడదాన్ని' 'ఇల్లాలి'గా చేసుకునేందుకు..."

యశోదమ్మ మాటలు మధ్యలోనే ఆపు చేసి అన్నాడు శంకర్రెడ్డి "... ఇల్లాలు అన్నది మొదటి పెళ్ళికి ..."

"అవును! మొదటి పెళ్ళికే!" రెండోపదాన్ని నొక్కి, మరీ పలికాక చెప్పింది యశోదమ్మ "... సిద్ధపడే మగాళ్ళు ఈ దేశంలో చాలా మంది ఉన్నారు"

శంకర్రెడ్డి ఆమెవైపు మెచ్చుకోలుగా చూసి "నీ ఆశావాదానికి అభినందించగలను కాని నువ్వు తప్పుగా ఆలోచిస్తున్నావన్నది మాత్రం ఖచ్చితంగా చెప్పగలను" పలికాడు.

"అలా అయితే జ్యోతి పెళ్ళి బాధ్యత నేనే తీసుకుంటాను"

ఆ ముగ్గురూ చప్పున ఆమెకేసి చూశారు. ఆమె యథాలాపంగా అనడంలేదని, ఒక నిర్ణయానికి వచ్చి పట్టుదలగా పలుకుతోం దని అర్థమయిందివారికి.

శంకర్రెడ్డి కాస్త సంతోషపడినా, అంత లోనే సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్టు "అది కాదు యశోదమ్మా! ఇలాంటి సమయంలో జ్యోతి గురించి పూర్తిగా తెలిసాక కూడా ఏ కుర్రాడయినా పెళ్ళికి ముందుకొచ్చినా, అది ఆమె మీద ప్రేమతో అయివుండదు. ఆస్తి కోసమో, అందంకోసమో అయివుంటుంది. అవి చేజిక్కాక అతడు ఈమెను బాధపెట్ట డమో లేక విడాకులిచ్చేసి దూరం చేసేయ డమో చేస్తాడు...'

"అన్నీ ముందుగా మీరే ఆలోచించుకుని, అడుగు ముందుకు వేయలేకపోతున్నారు. నన్నూ కాస్త ప్రయత్నించి చూడనివ్వండి"

శంకర్రెడ్డికి ఈసారి కళ్ళలో నీళ్ళు తిరి గాయి. "ప్రయత్నించమ్మా! మీ ప్రయత్నం ఫలించి నా చిట్టితల్లికి ఏ కొంత మేలు జరి గినా నాకన్నా ఆనందపడే వ్యక్తులు ఈ ప్రపంచంలో మరెవరుంటారమ్మా... ప్రయ త్నించండి"

ఆయన కంట నీరు చూసేసరికి మిగిలిన ముగ్గురి కళ్ళూ చెమర్చాయి. ఆ తండ్రికి కూతురి పట్ల ఎంత ప్రేముందో ఆ క్షణమే వారికి అర్థమైంది. సుధాకర్ ఆయన చెయ్యి పట్టుకుని ఆప్యాయంగా నొక్కి వదిలాడు.

మరో గంట తర్వాత జ్యోతి వచ్చింది "నాన్నా బయల్దేరుదామా!" అంది వచ్చీరావ డంతోనే!

"అప్పుడే ఎక్కడికక్కా! ముందు భోంచెయ్యి"

ఆమె అభ్యంతరం పెడుతున్నా వినిపిం చుకోకుండానే, ప్లేట్లలో అన్నం వడ్డించేసి ఆమెను కుర్చీలో కూలేసింది నాగమణి. ఇక తప్పని సరయి భోంచేయసాగింది జ్యోతి.

యశోదమ్మకు తమ సంభాషణ జ్యోతికి చెప్పాలనిపించింది. కాని అది సరైన సమయం కాదని ఊరకుండిపోయింది.

జ్యోతి భోంచేసాక తండ్రిని తీసుకుని వెళ్ళి పోయింది.

★ ★ ★

లాంగ్ లీవ్ తర్వాత బ్యాంక్ కి వెళ్ళడం మొదలుపెట్టింది నాగమణి.

ఆరోజు బ్యాంక్ లో వర్క్ చేసుకుంటూ ఉండగా, ఆమెకు జ్యోతి నుండి ఫోన్ వచ్చింది. "సాయంత్రం బ్యాంక్ అయిపోవ డంతోనే భవాని గారి హాస్పిటల్ కి ఆటోలో వచ్చెయ్యి. నీతో ఓ రెండుగంటలు పనిబ డింది"

"ఏం పనక్కా? "

"షాపింగ్! ఎల్లుండి నా పుట్టినరోజుకి బట్టల సెలక్షన్ కి నిన్ను తీసుకుని వెళదా మని"

"కానీ... ఇంటి దగ్గర బాబు..." గొణి గింది నాగమణి

"తల్లీ! నేను తల్లిని కాలేకపోవచ్చు కాని బిడ్డకోసం తల్లిపడే ఆరాటం నాకు తెలుసు.





నేనడిగింది నా కోసం రెండుగంటలు మాత్రమే..." నవ్వుతూనే అంది జ్యోతి.

"కనీసం అత్తయ్యకు చెప్పకుండా... ఆమె నాకోసం ఎదురు చూస్తూ ఉంటుందేమో? "

"నేనింతకు ముందే సుధాకర్‌కి ఫోన్ చేసి, సంగతేమిటో చెప్పి నీ విషయంలో పర్మిషన్ కూడా తీసుకున్నాను. సో! నువ్వు నిస్సంకోచంగా రావచ్చు!" అభయం ఇచ్చింది జ్యోతి.

"అలాగే! అయితే కాస్త ముందుగానే బయలుదేరుతాను"

"ఎదురు చూస్తుంటాను మరి!" జ్యోతి ఫోన్ పెట్టేసింది.

బ్యాంక్ అవర్స్ అయిపోయాక నాగమణి ఆటోలో హాస్పిటల్‌కి వెళ్ళింది. ఆమె జ్యోతి కన్సల్టింగ్ రూంలోకి వెళ్ళేసరికి ఓ పేషెంట్‌కి ఏవో సలహాలు చెబుతూ కనిపించింది జ్యోతి.

నాగమణిని చూసి పలకరింపుగా నవ్వి పక్కనే ఉన్న కుర్చీ చూపించింది. ఆమె కుర్చీలో కూర్చున్నాక ఎదురుగా ఉన్న యువతికేసి చూసింది. ఇరవై ఐదేళ్ళుంటాయేమో ఆమెకు. ఆమె పక్కనే ఉన్న వ్యక్తికి ముప్ఫయ్ ఐదేళ్ళు ఉండొచ్చు. భార్యాభర్తలయి ఉంటారు అనిపించింది.

మరో నిమిషం తర్వాత వారిద్దరూ లేచి డాక్టర్‌కి నమస్కరించి వెళ్ళిపోయారు.

వారు వెళ్ళాక జ్యోతి ఆమె వైపు తిరిగి "వన్ మినిట్! చాయ్ తాగి కాస్త రిలాక్సయి వెళదాం" చెప్పింది. తలాడించింది నాగమణి.

జ్యోతి కుర్చీలో నుండి లేచి పక్కనే ఉన్న ఫ్లాస్క్ అందుకుంది. రెండు కప్పుల్లో టీ వంపాక, ఆమె కొకటి అందించి, తనొకటి ఉంచుకుంది.

టీ తాగుతుండగా నాగమణి అడిగింది "ఇప్పుడు వెళ్ళిపోయిన జంట... వారికి కూడా పిల్లలు లేరా? "

"ఆ అమ్మాయి ఇద్దరు పిల్లల తల్లి. అతనికి మాత్రం పిల్లలు లేరు. అతడి భార్య నాలాగే... ఆమెకు ఎట్టిపరిస్థితుల్లోనూ పిల్లలు పుట్టే అవకాశం లేదు"

నాగమణికి చాలా ఆశ్చర్యంగా అనిపించింది. "అంటే... వారిద్దరూ భార్యాభర్తలు కాదా? "

"కాదు"

"మరి హాస్పిటల్‌కి కలిసి రావడం.. ఆమె కడుపులోని బిడ్డకు తనే తండ్రిలా అతడి హావభావాలు...? "

"అందులో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. నిజంగానే ఆమె కడుపులో పెరుగుతున్న బిడ్డకు తండ్రి అతడే"

నాగమణి వికారంగా ముఖంపెట్టింది. ఆమె ముఖంలోని ఫీలింగ్స్ చూశాక, జ్యోతి నవ్వుతూ అంది "ఏంటి అలా ముఖం పెట్టావ్? అదేదో అక్రమసంబంధం అనుకుంటున్నావా? కాదు! అది సక్రమ సంబంధమే"

ఈసారి నాగమణి మరింత ఆశ్చర్యపోయింది. "భార్యాభర్తలు కాదంటున్నావ్? మరి ఈమె కడుపులోని బిడ్డకు అతడే తండ్రి అని చెబుతున్నావ్! అయినా అక్రమ సంబంధం కాకపోవడమేమిటి? "

"అదే నేటి సైన్స్ ప్రగతి" జ్యోతి టీ కప్పు పక్కన పెట్టింది. లేచి "వెళ్తూ మాట్లాడుకుందాం పదా"

నాగమణి ఆమెను అనుసరించి బయటకు నడిచింది. ఆమె ఎక్కి కూర్చున్నాక జ్యోతి కారును ముందుకు పోనిచ్చింది.

కారు కొద్దిదూరం సాగాక "చెప్పక్కా" అంది నాగమణి, ఉత్సుకతను భరించలేనట్టు.

"చెబుతున్నాను" జ్యోతి డ్రైవింగ్ మీదే

కాన్సన్ట్రేషన్ చేస్తూ, తల తిప్పకుండానే చెప్పడం మొదలుపెట్టింది. "పురాణాలలోని చాలా విషయాలకు ప్రస్తుతం మనం సైంటిఫిక్ రీజన్ ఇవ్వలేక పోవచ్చుగానీ, సైన్స్ డెవలప్ అయ్యేకొద్దీ వాటిలోని చాలా అంశాలు నిజాలవుతున్నాయి. ఆ కాలంలోనే వారు అంత మేధస్సు ఉపయోగించి, అన్ని వింతలు సృష్టించారా అన్నది ఇప్పుడిప్పుడే ఆశ్చర్యం కలిగిస్తున్న విషయం. రైట్ సోదరులు విమానం కనిపెట్టకముందే, రామాయణంలో పుష్పకవిమానం గురించిన ప్రస్తావన ఉంది. అలాగే నేటి టెస్ట్ట్యూబ్ బేబీల తయారీ, నాడు మహాభారత కాలంలో వ్యాసమహర్షి నూటొక్కమందిని కుండలలో తయారు చేయడానికి భిన్నంగా ఏమీలేదు... పురాణంలో కుంతి తన శీలం చెడిపోకుండానే దేవతల అంశతో బిడ్డల్ని కన్నదీ అంటే 'అదెలా సాధ్యం?' అని నిన్నా మొన్నటి విమర్శకులు వెక్కిరించేవారు. కానీ అటువంటి అంశాలు నిజాలవుతున్న ఈ కాలంలో నాటి కుంతికి ప్రతిరూపమే ఆ అమ్మాయి...!"

"వివరంగా చెప్పక్కా!"

"అదే చెబుతున్నాను... సైన్స్ ఈ మధ్యనే గిఫ్ట్ అనే పద్ధతిని కనుగొంది. గిఫ్ట్ అంటే గామిట్ ఇంట్రో ఫాలోపియన్ ట్రాన్స్ఫర్... భర్త వీర్యంలో జీవకణాలు ఉండీ, భార్య ఎట్టి పరిస్థితుల్లోనూ గర్భవతి అయ్యే అవకాశం లేనప్పుడు, ఆ భర్త వీర్యాన్ని, ఆ భార్య అండాన్ని ఇన్వెట్రో ఫెర్టిలైజేషన్ ద్వారా సంయోగపరచి 'ప్రత్యామ్నాయ మాత'గా అంగీకరించిన మరో యువతి గర్భంలో ప్రవేశపెడతారు. ఇప్పుడు నువ్వు చూసిన ఆ వ్యక్తి సంతానోత్పత్తికి అన్ని విధాలా అర్హుడు. అయితే అతడి భార్యది నాలాంటి కేసే. కాని వారికి వారి అంశతోనే ఓ బిడ్డ కావాలనిపించింది. వారి కోరిక విని నేను ఈ గిఫ్ట్ పద్ధతి గురించి వివరించాను. దాంతో అతగాడి భార్య చెల్లెలయిన ఈ అమ్మాయి తన గర్భంలో బిడ్డను పెరగడానికి అంగీకరించింది. ఆ అమ్మాయి భర్తకూడా సహృదయతతో అర్థం చేసుకుని ఇందుకు అంగీకరించాడు..."

'ఇలాంటి పద్ధతి కూడా ఒకటి ఉందా' మనసులోనే అనుకుంది నాగమణి. 'మరొకరి బిడ్డను తన భార్య గర్భంలో పెరగడానికి అంగీకరించే భర్తలూ తయారవుతున్నారంటే మగవారిలో సంకుచిత స్వభావం మెల్లమెల్లగా తగ్గిపోతోందేమో! పరిస్థితులను బట్టి కూడా మనిషి తనను తాను మార్చుకుంటాడు. తన ఆలోచనా విధానంలో మార్పు తెచ్చుకుంటాడు.

కారు ప్యాట్నీ సెంటర్లోని ఓ బట్టల దుకాణం ముందు ఆగింది. ఇద్దరూ కారు దిగి లోపలికి నడిచారు.

జ్యోతి చీరలు చూపిస్తుంటే వాటిలో తనకు నచ్చినవి సెలక్ట్ చేయసాగింది నాగమణి. నాలుగు చీరలు కొనుగోలు చేసింది జ్యోతి.

వాటిలో ఒకటి విడిగా ప్యాక్ చేయమంటుంటే "అదెవరికక్కా" అనుమానంగా అడిగింది నాగమణి.

"ఇంకెవరికి? నీకే" నవ్వింది జ్యోతి.

నాగమణి మొహమాటపడిపోయింది. "వద్దక్కా! నాకిప్పటికే చాలా చీరలున్నాయి"

"నాకు మాత్రం లేవా?"

అప్పటికే వారిద్దరూ కారును సమీపించారు. సేల్స్ బాయ్ వారి వెనకే చీరల ప్యాక్ పట్టుకొచ్చాడు.

కారు స్టార్ట్ చేసిం తరువాత జ్యోతి అడిగింది "నాగమణి! ఐస్ క్రీం పార్లర్కి వెళదామా?"

నాగమణి తల అడ్డంగా ఆడించింది.





"వద్దక్కా! నాకు జలుబు చేస్తే కష్టం! బాబుకి నా పాలేకదా! ఆ తర్వాత వాడు దగ్గడం, అత్తయ్య నామీద కోప్పడడం... అవన్నీ ఎందుకు? కొద్ది రోజులు కాస్త జాగ్రత్తగా ఉంటే సరిపోతుంది. పోనీ నువ్వు తీసుకో అక్కా"

జ్యోతి భుజాలెగరేసింది "నాకు వద్దులే! ప్యారడైజ్‌కి వెళ్ళి ఎగ్‌పఫ్స్ తీసుకుందాం! చాలా రుచిగా ఉంటాయి" అంటూ కారుని ముందుకు పోనిచ్చింది.

ఏ సీ రెస్టారెంట్‌లో కూర్చున్నాక అంది జ్యోతి "బిడ్డల్ని కని, పెంచడానికి తల్లి ఎన్నో సుఖాలు త్యాగం చేస్తుంది. ఆ త్యాగం వెనుక ఏ స్వార్థమూ ఉండదు అంటారు. కానీ అందులో నిజం ఉంటుందంటావా? "

నాగమణి ప్రశ్నార్థకంగా చూసింది "నీకెందుకలా అనిపిస్తోందక్కా? "

"అదికాదు నాగమణి! పెళ్ళయ్యాక దంపతులు పిల్లల్ని కనడానికి ఎందుకు ఇష్టపడతారు? మగవాడు తన మగతనాన్ని నిరూపించుకోవడానికీ, ఆడది తనూ సంతానవతి కాగలననీ లోకానికి చాటి చెప్పడానికీ మాత్రమే కాదనుకుందాం. స్త్రీకి మాతృత్వంలో ఒక ఆనందం ఉంది. మగవాడు తన బిడ్డల్ని పోషించి పెద్ద చేయడంలో ఒకసంతృప్తి ఉంది. అయితే ఈ ఆనందం, సంతృప్తి వెనుక దంపతులకు ఓ స్వార్థం ఉందని నేననుకుంటాను. అది... పిల్లలు పెరిగి పెద్దయ్యాక, వయసుడిగిన తమను ఆదరించి అభిమానంగా చూసుకోవాలనేది"

"అది తల్లిదండ్రుల స్వార్థమెందుకవుతుందక్కా? అది బిడ్డల బాధ్యత"

"బాధ్యత అంటే- మనం పెంచి పెద్ద చేశాం కనుక వారు మనల్ని తిరిగి చూసుకోవాలనడం..."

ఆమె మాటలు మధ్యలోనే కట్ చేస్తూ "వారిని పెంచి పెద్దచేశాం కాబట్టి, వారు మనల్ని తిరిగి చూడాలనడం లేదు. అలా ఆశించడం ప్రతిఫలాపేక్ష అవుతుంది. తల్లిదండ్రులూ, బిడ్డలకు మధ్య సంబంధం ప్రతిఫలాపేక్షతో కూడుకున్నది కాదు. పిల్లల్ని పెంచడం పెద్దల బాధ్యతయితే, పెద్దల్ని వార్థక్యంలో చూసుకోవడం పిల్లల బాధ్యత" చెప్పింది నాగమణి.

జ్యోతి కొద్ది క్షణాలు మౌనంగా ఉన్నాక తలాడించి చెప్పింది "అది బాధ్యతగా ఫీలవడమో, స్వార్థమో తెలియదు గానీ, పిల్లల నుండి పెద్దలు వార్థక్యంలో ప్రేమను ఆశిస్తారు కదూ? కానీ నేనీ మధ్య పరిశీలించిందేమిటంటే- చాలామంది తల్లిదండ్రుల విషయంలో వారు బిడ్డల నుండి ఆశించింది వారికి దక్కడంలేదని"

"అదేంటి? " కాస్త ఆశ్చర్యంగా అడిగింది నాగమణి.

"ఈ మధ్య పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న 'హోమ్ ఫర్ ఏజ్డ్'లు చూసాక, పిల్లల్ని కని, పోషించి, పెద్దవారిని చేయడంలో, వారి నుండి ఆప్యాయతలు ఆశించడంలో అర్థం లేదనిపిస్తోంది. పెళ్ళయ్యాక ఉద్యోగం కోసం దూరప్రాంతాలకు వెళ్ళిపోయి ఆచోట స్థిరపడిపోయే బిడ్డల్ని చూస్తే ఈ రక్తసంబంధంలోని మమకారం కొంతకాలం తర్వాత వారిపట్ల బాధగా మారుతుందేమోననుకుంటున్నాను"

నాగమణి బదులు పలకలేదు. ఆమె వైపు జాలిగా చూసింది. 'అందని ద్రాక్ష పుల్లన' అన్న సామెత గుర్తొచ్చింది. తనకు అందని దానిపట్ల, పొందలేని దానిపట్ల వైరాగ్యం పెంచుకోవడంలో, తప్పులేదు. కాని అంత చిన్న వయసులోనే వైరాగ్యంగా మాట్లాడటమే బాధాకరమయిన విషయం.".

కారు ఇంటిముందు ఆగుతుండగా చూసారు వారిద్దరూ- ఇంటిముందు ఆగి వున్న మరోకారును. నాగమణి వెంటనే



గుర్తుపట్టి అన్నది "ఆయన ఫ్రెండ్ మురళి వచ్చినట్లున్నారు"

జ్యోతి చిరునవ్వు నవ్వుతూ తలూపింది ఔనన్నట్లుగా. మురళిని కలుసుకోబోతున్నం దుకు ఎంతో ఉత్సాహం వచ్చినట్టుగా అని పించిందామెకు.

నాగమణితోపాటు లోపలికి అడుగుపెడు తున్న జ్యోతిని చూడగానే సోఫాలో కూర్చుని మాట్లాడుతున్న మురళి లేచి నిల బడ్డాడు. "హలో డాక్టర్! హౌ ఆర్ యు!" అన్నాడు కళ్లలో కాంతి నింపుకుని.

"ఫైన్! మీరెలా ఉన్నారు" అడిగింది జ్యోతి నిండుగా నవ్వుతూ.

"సూపర్ఫైన్! రండి కూర్చోండి! ఏమిటి విశేషాలు" అన్నాడు సోఫాలో కూర్చుంటూ.

జ్యోతి సోఫాలో కూర్చుంటూ చెప్పింది, "ఇప్పుడు తీరుబడిగా మాట్లాడుకునేంత ఓపిక లేదు. ఓ చిన్న విషయం చెప్పి బయ లుదేరుతాను. ఎల్లుండి నా బర్త్డే. మీరంతా మా ఇంటికి భోజనానికి రావాలి!"

"మైగాడ్! అదంత చిన్న విషయమా! మీరు పిలవడమూ మేము రాకపోవడ మూనా! ఏరా సుధాకర్? "

"తప్పకుండా వస్తాం జ్యోతి" అన్నాడు సుధాకర్.

"అమ్మని కూడా తీసుకురావాలి"

"అలాగే"

జ్యోతి అందరిదగ్గరా సెలవుతీసుకుని బయలుదేరింది. నాగమణి కారు వరకూ వచ్చింది. కారులోంచి ఒక ప్యాకెట్ తీసి నాగమణికి ఇచ్చి జ్యోతి చెప్పింది. "ఎల్లుండి నా బర్త్డేకి ఈ చీరకట్టుకుని రా"

"అలాగే అక్కా"

కారు కనుమరుగయ్యే వరకూ గేటు దగ్గరే నిలబడ్డాక లోపలికెళ్ళింది నాగమణి.

ఆ రాత్రి-

ఆమె కళ్ళు మూసుకుంది. ఆమె కళ్ళ ముందు కొద్దిగంటలముందు తను హాస్పిట ల్లో చూసిన 'బావా మరదళ్ళు' కదలా డారు. 'ఒకరి అండం, మరొకరి స్పెర్మ్, ఇంకొకరి గర్భం...' చాలా సేపు ఆమె ఆ విషయం గురించే ఆలోచించింది.

'జ్యోతిని తల్లినిచేస్తే ఎలా ఉంటుంది? '

కాసింత పెద్దమనసు చేసుకుంటే, ఆమెనూ మాతృమూర్తిని చేయడం అసాధ్యం కాదుకదా?

చాలా సేపటితర్వాత ఓ నిర్ణయానికి వచ్చాక చాలా సంతృప్తిగా అనిపించింది. ఆ సంతృప్తితో ఆమె ప్రశాంతంగా నిద్రపో యింది.



డాక్టర్ భవానీతో ఓ ఏ.ఐ.డి. కేసు గురించి చర్చిస్తూ రిస్ట్వాచ్వైపు చూసుకుంది జ్యోతి. ఆరు గంటలు కావస్తోంది.

"ఎనీ అర్జెంట్ వర్క్" అడిగింది డాక్టర్ భవాని.

"నో డాక్టర్! జస్ట్టైమ్ తెలుసుకునేందుకే చూశాను" అంటూ ఆమెకేసి చూసి నవ్వింది.

డాక్టర్ భవానీకి నలభైలోపే ఉండొచ్చు తెల్లటి తెలుపు. కాస్త లావుగా ఉంటుంది

అనేగానీ, ఆ వయసులో కూడా ఆకర్షణీయంగానే ఉంటుంది. విపరీతమయిన మేకప్‌తో తన వయసు మరో ఐదేళ్ళు తగ్గేలా చేసుకోవడంలో కొంత సఫలీకృతురాలయిందనే చెప్పాలి.

విదేశాలలో 'ఇన్‌ఫెర్టిలిటీ'మీద స్పెషలైజేషన్ చేసి వచ్చాక, హైదరాబాదులో ఆ ఇన్‌ఫెర్టిలిటీ హాస్పిటల్ ప్రారంభించింది. ప్రారంభంలో రోజుకు ఐదారుగురు మాత్రమే వచ్చేవారు. ఇప్పుడు పేషంట్స్ సంఖ్య ఇరవైనుండి యాభై మధ్యకు పెరిగింది. ఆ హాస్పిటల్‌కి విపరీతమయిన లాభాలు రావడం మొదలయింది.

డాక్టర్ భవాని ఆ కేసు గురించి తిరిగి కంటిన్యూ చేసింది.

ఎ.ఐ.డి. కేసులో అపరిచిత దాత ద్వారా కృత్రిమ గర్భధారణ జరుగుతుంది. అపరిచిత దాత వీర్యాన్ని మహిళ గర్భసంచిలో ప్రవేశపెడతారు. భర్తలోని వంధ్యత్వం నయంకానప్పుడు, జన్యుపరమైన వ్యాధికి అవకాశం ఉన్నప్పుడు ఈ విధానం అనుసరిస్తారు.

వీర్యదానం రానురాను అత్యధికుల్లో ఆమోదయోగ్యంగా మారుతోంది. తన భర్త 'అంశ'తో కాకుండా, మరొకరి వీర్యంతో బిడ్డను కనడం నేటి మహిళ పాపంగానో, లేదా తప్పుగానో భావించడంలేదు. స్త్రీకి 'మాతృత్వం'మీద ఉండే కోరికను చంపుకోలేనప్పుడు, భర్తను సంప్రదించి ఇద్దరూ పరస్పరం అంగీకరించాకే ఈ పద్ధతిద్వారా బిడ్డను కనడం జరుగుతుంది.

అసలు స్త్రీ పురుషుల్లో తల్లిదండ్రులు కావాలనే కోరికకు పరాకాష్టగా ఈ పద్ధతిని పేర్కొనవచ్చని అనిపిస్తుంటుంది జ్యోతికి. తన భర్తను తప్ప మరో పురుషుడిని స్పర్శించడానికి కూడా ఇష్టపడని ఆడది, ఎవడో ముక్కూ ముఖం తెలియని మగాడి అంశను తన గర్భంలో పెంచడమేమిటి? పరాయిమగాడు తన భార్యవైపు కన్నెత్తి చూసినా భరించలేని మగాడు, ఆ పరాయి మగాడి సహకారంతో తన భార్య బిడ్డను కనడానికి ఆమోదం తెలియజేయడమేమిటి? జీవితంలోని అసంబద్ధతకు నిదర్శనంలా లేదూ? ... అసంబద్ధత కాదు. భార్యాభర్తల్లో ఏ ఒక్కరి 'అంశ'తోనయినా బిడ్డ జన్మిస్తే చాలు అని తన జీవిత భాగస్వామికోసం మరో భాగస్వామి చేసే మహోన్నత త్యాగానికి నిదర్శనం ఇది. ఆడది కడుపు పండడంకోసం, మగాడు బిడ్డ కోసం తప్ప మరేవిధంగానూ ఇంతగొప్ప త్యాగం చేయలేరు. అది నిజం.

నేడు విదేశాల్లోనేకాదు, ఇండియాలో కూడా ప్రతిపెద్ద నగరంలోనూ వీర్య బ్యాంకులున్నాయి. ఆర్థికంగా నిమ్న తరగతికిచెందిన వారేకాదు, డాక్టర్లలాంటి మంచి ప్రొఫెషన్‌లో ఉండేవారు కూడా ఈ బ్యాంకులకు తమ వీర్యాన్ని అమ్ముకుంటున్నారు. ఈ బ్యాంకుల్లో వీర్యదాతలకు ఎయిడ్స్, సుఖరోగాలు, జన్యు సంబంధ రోగాలు లేవని నిర్ధారించుకున్న తర్వాత, వారి రక్తగ్రూపులనూ, ఐ.క్యూ స్థాయిని పరీక్షించుకుని వీర్యనమూనాలను స్వీకరిస్తారు.

ఎ.ఐ.డి. కేసు అనగానే జ్యోతి మదిలో ఈ విషయాలన్నీ మెదిలాయి.

"ఇదిగోండి రిపోర్ట్స్" డాక్టర్ భవాని రిపోర్ట్స్ ఆమె ముందుకు తోసింది. జ్యోతి ఆ రిపోర్ట్స్ తీసుకుని పరీక్షిస్తుండగా భవాని చెప్పింది. "రేపు ఆ పేషెంట్ మీ దగ్గరకొస్తుంది. తనకి రేపే పదమూడోరోజట. సో! స్పెర్మ్ బ్యాంక్‌కి ఇన్‌ఫర్మేషన్ పంపించాను కూడా"

"కేసు నేను చూసుకుంటాను డాక్టర్"

"థ్యాంక్యూ"

ఆమె లేవబోతుంటే అప్పుడే ఫోన్ మ్రోగింది. డాక్టర్ భవానీ చేతిలోకి తీసు

కుని మాట్లాడుతోంది. అదే సమయంలో జ్యోతి డోర్ తీసుకుని అవతలికి వెళ్ళబో తోంది.

"జ్యోతి"

ఆమె తల తిప్పి చూసింది.

"ఫోన్ నీకే"

ఆమె కనుబొమలు ముడివడ్డాయి. ఆ హాస్పిటల్‌కి, తనకి ఫోన్ వచ్చే అవకాశమే లేదు మరి? ఆమె ఫోన్ అందుకుని "హలో" అంది.

అవతలివైపు నుండి వినబడుతున్న మాటలకు ఆమెముఖంలో రంగులు మారడం మొదలుపెట్టాయి. అంతా విన్నాక ఆమె "ఏ హాస్పిటల్" అడిగింది.

జ్యోతి రిసీవర్ పెట్టాక, ఆమెముఖంవైపు అదోలా చూస్తూ, "ఎనీ ప్రాబ్లమ్" అడిగింది డాక్టర్ భవాని.

"ప్రాబ్లమ్..." ఆమె కొద్దిక్షణాలు మౌనంగా ఉన్నాక చెప్పింది. "... సతీష్‌కి యాక్సిడెంట్ అయిందట"

సతీష్ ఎవరో భవానీకి తెలుసు "మేజర్? " ఆమె గొంతులో ఆదుర్దా ధ్వనించింది.

అప్పటికి సర్దుకుందేమో, ఈసారి జ్యోతి చాలా ప్రశాంతంగా జవాబు చెప్పింది. "ట్వంటీ ఫోర్ అవర్స్ గడిస్తేగానీ, రిజల్ట్ చెప్పలేం అంటున్నారట... పాపం!"

"ఏ హాస్పిటల్‌లోనో కనుక్కున్నావా? "

తలాడించింది జ్యోతి.

భవాని లేస్తూ "పదయితే వెళ్దాం" అంది.

"నేను ఇక్కడి నా కేసులన్నీ చెకప్ చేశాక, సాయంత్రం వీలయితే వెళ్తాను"

డోర్ తీసుకుని వెళ్ళిపోతున్న జ్యోతి కేసి డాక్టర్ భవాని విభ్రాంతిగా చూసింది.




చాలాసేపటి తర్వాత ఆమె అనుకుంది ఆడదాని హృదయం వెన్నలాంటిదే. కాని కష్టపెడితే ఆ హృదయం పాషాణం కన్నా గట్టిగా మారిపోతుంది!

ఆమెకు జ్యోతి గురించిన వివరాలు పూర్తిగా తెలుసు.

★ ★ ★

ఆ సాయంత్రం జ్యోతి హాస్పిటల్‌కి వెళ్ళింది.

సతీష్ స్పృహలో లేడు. 'ఇంటెన్సివ్ కేర్ యూనిట్'లో బ్లడ్ ఎక్కిస్తున్నారు. ఆమెకు తెలిసిన డాక్టర్లే కావడంతో లోపలికి వెళ్ళి చూడగలిగింది. అతడికి వళ్ళంతా కట్లే ఉన్నాయి. ఎందుకో తెలియదు అతడిని చూస్తుంటే జాలి కలగలేదు.

ఆమె డాక్టర్లతో ఓ పేషంట్ వివరాలు అడిగినంత కాజువల్‌గానే మాట్లాడింది. మేజర్ యాక్సిడెంట్. ఇంకా కొన్ని ఎక్స్‌రేలు తీయవలసి ఉంది. బ్లడ్ ఫుల్‌ఫిల్ చేశాక, ఆ తర్వాత మిగిలిన ప్రాబ్లమ్ గురించి చెకప్ చేయాలి. కొన్ని రకాల డామేజీలు ఎక్స్‌పెక్ట్ చేస్తున్నారు వారు.

జ్యోతి ఐ.సి.యూ నుండి బయటకొచ్చాక, మిసెస్ సతీష్‌తో మాట్లాడింది. "యాక్సిడెంట్ ఎలా జరిగింది? "

"టాంక్‌బండ్‌మీద జరిగిందట. ఆయన ముందు వెళ్తున్న సిటీబస్సుని ఓవర్‌టేక్ చేయబోతుంటే, ఎదురుగా వస్తున్న కార్పొరేషన్ వేన్ కొట్టింది. మారుతీ కారు కావడంతో కారు చిత్తయిపోయి మనిషికి..." ఆమె ఏడుస్తోంది.

జ్యోతి మౌనంగా ఉంది. చిత్రంగా ఆమె కంట కన్నీరు రాకపోవడమే కాదు, బాధాకరమైన ఫీలింగ్ కూడా కలగలేదు.

"ఇంతకీ డాక్టర్లు ఏమంటున్నారు? " చాలాసేపటి తర్వాత ఆమె ఏడుపు ఆపుకుని అడిగింది.

డాక్టర్లు చెప్పిన వివరాలు ఆమెకు

చెప్పింది జ్యోతి. ఆమె తిరిగి ఏడవడం మొదలుపెట్టింది. ఆ అమ్మాయిని చూస్తుంటే జ్యోతికి బాధనిపించింది. ఆప్యాయంగా తన చెయ్యి ఆమె భుజంమీద వేసి అడిగింది "మీ మమ్మీ డాడీలకు, తెలిసిన వారికి ఇన్‌ఫాం చేశావా? "

ఆమె నిలువుగా తలూపింది. "ఈ విషయం తెలియగానే హాస్పిటల్‌కి వచ్చాను. చాలాసేపు ఏమీ తోచలేదు. తేరుకున్నాక డాడీకి ఫోన్ చేశాను. ఆయన వరంగల్‌నుండి బయల్దేరి ఉంటారు. ఈసరికి వచ్చేయాలి. కానీ ఇంకా రాలేదు..." ఆమె అరనిముషం తర్వాత కంటిన్యూ చేసింది. "... డాడీకి ఫోన్ చేశాక మీరే నాకు గుర్తొచ్చారు. ఇక్కడి డాక్టర్లని అడిగితే ఓ డాక్టర్ మీ ఫోన్ నెంబర్ ఇచ్చారు. మిమ్మల్ని పిలవడం ధర్మమనిపించింది"

జ్యోతి ఆమెవైపు చప్పున చూపు మరల్చింది.

ఈసారి ఆమె కాస్త తడబడి చెప్పింది "...మీరు తోడు ఉంటే నాకూ కాస్త ధైర్యంగా ఉంటుందనుకున్నాను. ఈ సిటీలో నాకు పరిచయస్తులెవరూ లేరు"

సతీష్ మమ్మీడాడీలు కడపలో ఉన్నారు. వారికి అక్కడ చాలా బిజినెస్‌లున్నాయి. అతడి అన్నదమ్ములు ఆ చోటనే ఉన్నారు.

"మీ మామయ్యగారికి ఫోన్ చేశావా? "

"చేశాను... వారు కూడా బయల్దేరి ఉంటారు"

కొద్దిక్షణాలు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం తర్వాత జ్యోతి అడిగింది. "మీదేవూరు? "

"వరంగల్. డాడీ ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్‌లో ఇంజనీర్"

అర్థగంట తరువాత యాభైఏళ్ళ బట్టతల వ్యక్తి కంగారుగా లోపలికి రావడం చూసింది జ్యోతి. ఆయన చూపులు తన ఎదురుగా ఉన్న అమ్మాయిమీద నిలిచాయి. అటుగా వచ్చాక, మిసెస్ సతీష్ రెండు భుజాలు పట్టుకుని "కీర్తీ! ఏమయిందమ్మా? అల్లుడిగారికేమయింది? " అడిగాడు ఆదుర్దాగా. ఆయన ఎవరో అర్థమయింది జ్యోతికి. ఆయన అడిగే తీరు చూస్తే కన్న కూతురు పట్ల ఓ తండ్రి చూపించే ఆప్యాయత కనిపించింది. పాపం! ఆడపిల్లల తల్లిదండ్రులు! వారి మీద ఆమెకు అపరిమితమయిన జాలేసింది.

ఆ అమ్మాయి తండ్రికేదో ఏడుస్తూ చెబుతోంది. ఆ తండ్రి కూతుర్ని ఓదారుస్తున్నాడు.

జ్యోతికి ఈసారి ఎంట్రన్స్ నుండి తమవైపు వస్తున్న సతీష్ మిత్రులు కనిపించారు. ఒకప్పుడు వారికి తన చేతులతో అతిథి మర్యాదలు చేసింది. కాని ఇప్పుడు...? ఆమెకు వారికి కనిపించడం ఇష్టంలేకపోయింది.

ముఖం తప్పించి, ముందుకు పోబోతుంటే వెనక నుండి ఆర్ద్రతతో కూడుకున్న పిలుపు వినిపించింది "అక్కా"

ఆమె చప్పున తల తిప్పి అటుకేసి చూసింది. మిసెస్ సతీష్ తనకు దగ్గరగా వచ్చింది. "వెళ్ళిపోతున్నావా అక్కా... ప్లీజ్! కాసేపు ఉండకూడదూ? "

"నేను రేపు ఉదయం వస్తాను"

"కానీ ఇక్కడ...? "

"మీ డాడీ... ఇంకా అతని కో-డాక్టర్స్ ఉన్నారు గా... నో ప్రాబ్లెమ్... అంతగా అవసరమనుకుంటే ఇంటికి ఫోన్ చెయ్యి" ఆమె తన బ్యాగ్‌లో నుండి విజిటింగ్ కార్డ్ తీసి ఇచ్చింది.

అప్పటికే అతడి మిత్రులు వారిదగ్గరగా వచ్చారు.

"హలో డాక్టర్! సతీష్‌కి ఎలా ఉంది? "

"ఐ.సి.యులో ఉన్నారు. వెళ్ళి చూడండి"

వారంతా డాక్టర్లే! లోపలికి వెళ్ళేందుకు

కష్టం కాబోదు. వారంతా అటుగా నడిచారు. వారు పదడుగులు వేశాక జ్యోతి బయటకు నడిచింది.

మర్నాడు ఆమె తిరిగి హాస్పిటల్‌కెళ్ళాక డాక్టర్లు కొన్ని రిపోర్ట్స్ చేతిలో పెట్టారు. ఆ రిపోర్ట్స్ చూడడంతోనే ఆమె షాక్‌తింది.

డాక్టర్స్ రూంలోనుండి బయటకొచ్చి తిన్నగా సతీష్ రూమ్‌లోకెళ్ళింది.

అప్పటికే అతడికి తన పొజిషన్ గురించి పూర్తిగా తెలిసినట్టుంది. ఎంతయినా డాక్టర్ కదా!... అతడు సిగ్గుతో తలొంచుకోవడం గమనించింది.

కొద్దిసేపు మౌనంగా నిలబడింది. అతడు ఇప్పట్లో తనతో మాట్లాడలేడని ఆమెకు అర్థమయింది. చాలాసేపటి తర్వాత కీర్తి అంది "కూర్చో అక్కా"

జ్యోతి అతడిమీదనుండి ఆమెవైపుకు చూపు మరల్చింది. ఒకరోజు ముందు తను ఆమెవైపు భావరహితంగా చూసింది. కాని ఈరోజు తన చూపుల్లో జాలి కురుస్తోందని తనకే అర్థమౌతోంది.

ఆమెవైపు చూస్తూనే చెప్పింది "నాకు పని ఉంది. నేను వెళ్ళొస్తాను"

జ్యోతి బయటకు నడుస్తుంటే కీర్తి అనుసరించింది. డోర్‌దాటాక "అక్కా" అంది. ఆమె తిరిగి చూసింది.

"అక్కా! డాక్టర్లు నాకేం చెప్పట్లేదు. వారి చూపులూ, మాటలూ చూస్తుంటే నాకు తెలియకుండా కొన్ని విషయాలు దాస్తున్నారే మోననిపిస్తోంది. ప్లీజ్! నువ్వయినా నాకు నిజం చెప్పక్కా. ఆయనకు... ఆయనకు ప్రమాదమేం లేదు కదా? "

"ప్రాణాలకు మాత్రం ప్రమాదం లేదు"

"మరి? " కీర్తి కన్‌ఫ్యూజింగ్‌గా ఆమెకేసి చూసింది.

జ్యోతి మనసులో ఏమూలో కాస్త కసి పెరుగుతూ వచ్చిందేమో! భార్యా భర్తలలో ఒకరిలో ఏదో లోపం ఉండొచ్చు. సరిదిద్దుకోలేని ఆ లోపాన్ని జీవిత భాగస్వామి దాచి పెట్టాలి. తన గొప్పకోసం ఒకరు మరొకరి లోపాన్ని లోకానికి చాటిచెపితే ఆ మరొకరికి తన లైఫ్ పార్ట్‌నర్‌మీద ప్రేమ కలగదు. అసహ్యమేస్తుంది. సతీష్ తనపట్ల అలాగే ప్రవర్తించాడు. ఆమె గొడ్రాలు అన్న విషయం లోకానికి ఎలుగెత్తి మరీ చాటాడు. కాని ఇప్పుడు... ఆ అవకాశం తనకొచ్చింది. ఉపయోగించుకోకుండా ఉండడం సాధ్యమా?

ఆమె కీర్తివైపు జాలిచూపులు ప్రసరింపచేస్తూ ప్రశ్నించింది "మీకు పిల్లలు కలిగారా? "

"లేదు" వెంటనే జవాబు వచ్చింది.

"పోనీ ఇప్పుడు నువ్వు ప్రెగ్నెంట్...? "

"కాదు" ఆ అమ్మాయికి ఆ ప్రశ్నలకు అర్థం కొంత బోధపడిందేమో ఈసారి భయంగా జవాబు చెప్పింది.

ఇద్దరిమధ్య కొద్దిక్షణాలు నిశ్శబ్దం.

ఆ నిశ్శబ్దం భరించలేనట్టు ఆ అమ్మాయి అడిగింది "ప్లీజ్ అక్కా! ఈ టెన్షన్ నేను తట్టుకోలేను... నిజం చెప్పు"

జ్యోతి చాలా ప్రశాంతంగా చెప్పింది. "మీవారివలన నీకు ఇక ఎట్టిపరిస్థితుల్లోనూ పిల్లలు పుట్టే అవకాశం లేదు. హీఈజ్ నౌ అన్‌ఫిట్"

కీర్తి పట్టుకోసం గోడను గట్టిగా పట్టుకుంది. ముఖం మాత్రం భావరహితంగా మారింది. ఏ ఆడదయినా తన భర్త గురించి అలాంటి మాట విన్న క్షణం, ఎంతగా షాక్ తింటుందో అర్థంచేసుకోగలదు కాబట్టే ఆ అమ్మాయికేసి జాలిగా చూసింది జ్యోతి.

ఆడది తల్లి కాకపోతే మగాడు విడాకులిచ్చేస్తాడు. మరి తల్లిని చేయలేని అసమర్థ





డయిన మగాడిని ఆడది వదిలేయగలిగితే ఎంత బాగుణ్ణు.

ఆ అమ్మాయికి ఆ మాటే చెప్పాలనిపించింది. కానీ ఇప్పటికే సగం చచ్చిన పాములా మారిన సతీష్‌ని పూర్తిగా చంపడం ఆమెకిష్టంలేకపోయింది.

ఆమె తల దించుకుని అక్కడినుండి వచ్చేసింది.



ఆరోజు సాయంత్రం ఆరుగంటలకల్లా జ్యోతి ఇంట్లో హాజరయ్యారు నాగమణి, సుధాకర్‌లు. యశోదమ్మతోపాటు ఆటోలో వచ్చారు వారు. ఆమె చేతుల్లో బాబు నిద్రపోతున్నాడు.

వారిని సాదరంగా ఆహ్వానించి కూర్చోబెట్టాక జ్యోతికి వారు జన్మదిన శుభాకాంక్షలు తెలియజేశారు. సుధాకర్ తన చేతిలోని బొకే ఆమెకు అందించాడు. తానిచ్చిన శారీనే నాగమణి కట్టుకురావడం గమనించిన జ్యోతి మెచ్చుకోలుగా ఆమెవైపు చూసి కళ్ళెగరేసింది. బాబుని బెడ్‌మీద పడుకోబెట్టింది.

"నిండునూరేళ్ళు చల్లగా బతుకమ్మా" తనకు పాదాభివందనం చేసిన జ్యోతిని ఆశీర్వదించింది యశోదమ్మ. సతీష్ యాక్సిడెంట్‌కి గురయిన విషయం అప్పటికింకా వారికి తెలీదు. ఆ విషయం వివరంగా జ్యోతి తెలియజేసింతరువాత వారంతా సిన్సియర్‌గా బాధపడ్డారు.

వారలా ఫీలవడం చూసి జ్యోతి తమాషాగా నవ్వి చెప్పింది, "మీరంతా అతడి గురించి ఇంతగా బాధపడుతున్నారు. నాకు మాత్రం కాస్త కూడా బాధనిపించలేదు"

ఆమెకేసి అదోలా చూశారు వారంతా. వారి చూపులు గమనించిందామె.

"... ఏమిటీ? మొగుడు వెన్నుపూస విరిగి హాస్పిటల్ బెడ్‌మీద ఉంటే 'నాకేం బాధలేదు' అంటుందే ఇది. 'ఇది మనిషా? రాక్షసా?' అని అనుమానమొచ్చిందా మీకు? ..." ఆమె పెదాలు నవ్వుతూనే ఉన్నాయి.

వారు మాత్రం చప్పున తలలు అడ్డంగా ఆడించారు.

"...మీ మనసులోని భావమేమిటో తెలియదుగానీ, నా మనసులోని మాట నిర్మొహమాటంగా చెప్పాను. మీరు నా గురించి ఏమనుకున్నా ఫర్వాలేదు"

అప్పుడు పలికింది యశోదమ్మ "అనుకునేందుకు ఏముందిలేమ్మా! ఆ మొగుడు నీ మనసు ఎంతగా బాధపెట్టి ఉండకపోతే నువ్వింత కఠినంగా మాట్లాడుతావు? "

జ్యోతి చప్పున ఆమెవైపు తిరిగింది. "ఆంటీ! అతడు నన్ను బాధపెట్టాడు అని మాత్రమే నేనింత కఠినంగా మాట్లాట్టం లేదు. నా మాటల కాఠిన్యం వెనక చాలా అంతర్మథనం ఉంది... మరెంతో తపన, భార్యాభర్తల సంబంధం పట్ల ఒక ఆక్రందన ఉన్నాయి. అసలు భార్యాభర్తల సంబంధంకి ఉన్న విలువేమిటి ఆంటీ? వారిద్దరూ ఎవరో ఎక్కడివారో ముక్కూ ముఖం తెలియకుండానే 'తాళి' అనే బంధంతో ఒకటయ్యారు. ఆ తాళి కట్టే శుభవేళ 'నాతిచరామి' అంటూ కష్టం, సుఖం, ఆనందం, దుఃఖం అన్నీ సమంగా పంచుకుంటూ ఆమె చేతిని వదలనని అతడు వాగ్దానం చేశాడు. అతడు తన భర్త అన్న అపురూపమయిన భావంతో ఆమె అప్పటివరకూ తను పదిలంగా దాచుకున్నవన్నీ పవిత్రభావంతో అతడికి సమర్పిస్తుంది. అతడు కూడా ఆమె నుండి కోరుకున్నవన్నీ తీరికగా దోచుకుంటాడు. అప్పటివరకూ వారి మధ్య లేని ప్రసక్తి అప్పుడే మొదలవుతుంది." ఆమె ఊపిరి పీల్చుకోడానికి ఒక్కక్షణం ఆగి మళ్ళీ చెప్పింది.

"పిల్లలు! భార్యాభర్తల కలయికలో

పిల్లలు పుట్టడం చాలా సహజమైన విషయం. అయితే కొన్ని పరిస్థితులలో సహజాలు కూడా సంభవించకపోవడం జరుగుతుంది. ఇదిగో ఇక్కడే సహజాలు సంభవించనప్పుడే భార్యాభర్తల మధ్య సంబంధం... తాళి అనుబంధం చీకిపోయిన నూలుపోగుకన్నా హీనంగా తెగిపోతుంది. వారిమధ్య ఎన్నో ఏళ్ళుగా పెరిగిన అభిమానం, ఆప్యాయతలు పేకమేడల్లా కూలిపోతాయి... ఆంటీ! అది దారుణమైన విషయం కాదా? "

యశోదమ్మ ఒప్పుకోలుగా తలాడించింది. సుధాకర్ దంపతులు కూడా అదే భావాన్ని మొహంలో చూపారు.. జ్యోతి చెప్పింది.

"భార్యాభర్తలమధ్య సంబంధాన్ని నియంత్రించేది 'సంతానం' కాకూడదన్నదే నా వాదన. స్త్రీ పురుషుల కలయికలో 'అసంకల్పిత ప్రతీకారచర్య'లా జరిగే ఒకానొక సహజ ప్రక్రియే ఈ సంతానోత్పత్తి. ఈ అంశాన్ని అలా గుర్తించకుండా, సంతానోత్పత్తి కోసమే భార్యాభర్తల మధ్య సంబంధం అని ఏ మానవుడైనా అనుకుంటే ఆ స్త్రీ పురుషులిరువురూ సంతానోత్పత్తికి యోగ్యులో కాదో ముందే వైద్యపరీక్షల ద్వారా నిర్ణయించుకుని ఆ తరువాత దంపతులు కావడం మంచిది. కానీ అలా జరగడంలేదు. అందుకే ఈ విషయంలో ఒక చట్టం తేవాలని నా అభిప్రాయం. అప్పుడు మెడికల్ సర్టిఫికెట్ లేకుండా పెళ్ళిళ్ళు జరిగే వీలుండదు..."

వాకిట దగ్గర నుండి చప్పట్లు వినిపించడంతో జ్యోతి తన వాక్ప్రవాహాన్ని ఆపేసింది.

అందరూ అటుకేసి చూశారు. మురళి నిలబడి ఉన్నాడు ఫుల్ సూటులో.

మిగిలిన వారంతా అతడిని చూసి పలకరింపుగా నవ్వితే జ్యోతి మాత్రం కాస్త సిగ్గుపడింది. తను అప్రయత్నంగానే ఆవేశపడిపోతూ మాట్లాడిన మాటలు అతడు విన్నాడని తెలియడంవలన వచ్చిన సిగ్గు అది.

మురళి లోపలికి వచ్చాడు. జ్యోతి దగ్గరగా వెళ్ళి ఆమె ముఖంలోనికి ముఖం పెట్టి చూస్తూ నవ్వుతూ చెప్పాడు "ఎక్సలెంట్ ఎక్స్ప్లనేషన్ మేడమ్! నిజంగా... నిజంగానే భార్యాభర్తలు కాబోయేముందు ప్రతి జంట వినదగిన మాటలు..."

ఆమె మరింత సిగ్గుపడిపోయింది.

"విష్యూ హేపీ బర్త్డే" మురళి అన్నాక ఆమె చటుక్కున తేరుకుని "థాంక్యూ" అంది.

"మెనీ మెనీ హాపీ రిటన్స్ ఆఫ్ ది డే" మళ్ళీ అన్నాడు మురళి.

"థ్యాంక్యూ! థ్యాంక్యూ వెరీమచ్!" అంది జ్యోతి ఇక చాలు అన్నట్లుగా.

అప్పుడు తీసాడు మురళీ టైటాన్ లేడీస్ వాచ్ జేబులోంచి.

"బైదిబై! ఇది నా చిరుకానుక!" అంటూ ఆమెకు అందించాడు. ఒక్కక్షణం తటపటాయించి అప్పుడు తీసుకుంది జ్యోతి.

"థ్యాంక్యూ ఒన్స్ ఎగైన్"

అందరూ కలిసి కేక్ ఉంచిన టేబిల్ దగ్గరకు నడిచారు. జ్యోతి కేక్ కట్ చేసింతరువాత నాగమణి ఒకముక్క తీసి జ్యోతి నోట్లో ఉంచింది. ఆ తరువాత అంతా కేక్ ముక్కలు పంచుకున్నారు.

పనిపిల్ల మాల అందరికీ కూల్ డ్రింక్స్ అందించింది.

అందరూ సోఫాల్లో సెటిలయి డ్రింక్స్ సిప్ చేస్తుండగా సుధాకర్ అన్నాడు "ఏమిత్రా! మా జ్యోతి మాటలు నీకూ బాగా నచ్చాయా? "

"నచ్చడం కాదు. నా మనసులోని మాటలు ఆమె నోటివెంట వింటున్నాను. అంతే!" చెప్పాడు మురళి.

"అయితే నీ అభిప్రాయమూ అదేనన్న




మాట"

"ఖచ్చితంగా" చెప్పాడు మురళి. "తరతరాల మానవచరిత్ర ఆడదాన్ని ఓ బిడ్డలు కనే యంత్రంలానే చూసింది. సమాజంలో ఎన్నో మార్పులు వస్తున్నా ఆ అభిప్రాయంలో పెద్ద మార్పేంరాలేదు. స్త్రీ బిడ్డకు జన్మనివ్వడం ప్రకృతిధర్మం. అది ఆడదానికి భగవంతుడిచ్చిన వరం. ఒక్కోసారి కొందరు దురదృష్టవంతులకు ఆ వరం లభించకపోవచ్చు అంతమాత్రానే వారిని అన్నివిధాలా హింసించి సంసారజీవితానికి దూరం చేయడం దారుణం. అంతకన్నా ఘోరం మరోటి లేదు..."

సుధాకర్ పలికాడు "కానీ నాకు తెలిసి కొందరాడవాళ్ళు, తాము సంతానోత్పత్తికి పనికిరానట్లయితే తామే పట్టుబట్టి తమ చెల్లెల్లో మరొకరినో మొగుడికి కట్టబెట్టి 'త్యాగశీలినమ్మా' అంటూ తమను తామే అభినందించుకుని ఆనందపడిపోతున్నారు"

"కాని మగవాడు తాను సంతానోత్పత్తికి పనికిరాడని నిర్ధారణ జరిగితే అదేపని తాను చేయగలడా? త్యాగవంతుడినని చెప్పుకోగలడా? "

జ్యోతి నోటివెంట ఆ ప్రశ్న వినడంతోనే మురళి ముఖంలో అదోలాంటి భావం కొద్ది సేపు కదలాడడం సుధాకర్ గమనించాడు.

అప్పుడే బాబు ఏడుపు వినిపించడంతో నాగమణి, యశోదమ్మలు అటువైపు వెళ్ళారు. సుధాకర్ వాష్‌బేసిన్ దగ్గరకు చెయ్యి కడుక్కోడానికి వెళ్ళాడు. హాలులో మురళి, జ్యోతి మాత్రమే మిగిలారు.

రెండు క్షణాలు ఆమెకేసి చూస్తూ, ఏదో చెప్పాలని ప్రయత్నించాడు అతను. మాట పెగల్లేదు. ఆమె మాత్రం అతడివైపు చూడటంలేదు. కిటికీలోనుండి నీలాకాశాన్ని చూస్తోంది.

అతడు గొంతు సర్దుకుంటున్నట్టు చిన్నగా దగ్గాడు. ఆమె అతడివైపు చూసి సన్నగా నవ్వింది.

"డాక్టర్!..." అతడు మాటలు పేర్చుకుంటున్నట్టు ఆగాడు. "మీరు ... మీరు... మగవాళ్ళెవ్వరూ ఆడదాని గురించి అసలు నిస్వార్థంగా ఆలోచించలేరు అనే స్థిరమైన అభిప్రాయం కలిగి ఉన్నట్టున్నారు. కాని... నాకు తెలిసినంతలో ఆడదానికి అన్యాయం చేయకూడదని తమను తాము నియంత్రించుకున్న వ్యక్తులూ ఉన్నారు"

"అలాంటి వ్యక్తి నాకింతవరకూ తారసపడలేదు మురళిగారు"

అతడు ఓ నిర్ణయానికి వచ్చినట్టు చప్పున అడిగాడు "మీరు రేపు నాకు అపాయింట్‌మెంట్ ఇవ్వగలరా? జస్ట్ ఓ పదిహేను నిమిషాలు చాలు!"

అతడంత హఠాత్తుగా అలా అడిగేసరికి జ్యోతి కాస్త తికమకపడింది. ఆ తర్వాత తేరుకుని చెప్పింది, "భలేవారే! మీరు మాట్లాడతానంటే అపాయింట్‌మెంట్ ఎందుకు? " అని కొద్దిక్షణాలు ఆలోచించి చెప్పింది. "ఓ.కే! రేపు మధ్యాహ్నం వరకూ నేను ఇంట్లోనే ఉంటాను. ఆ తరువాత డ్యూటీకి వెళ్ళాలి. మీకు వీలయితే..."

ఆమె మాటలు మధ్యలోనే కట్‌చేస్తూ అన్నాడు మురళి "వీలు చేసుకుని మరీ వస్తాను. మార్నింగ్ టెన్‌కి వస్తే మీకు అభ్యంతరం లేదుగా"

"నో ప్రాబ్లెమ్! తప్పకుండా రండి!"

యశోదమ్మ వచ్చి కూర్చుంది. సుధాకర్ రుమాలుతో చేతులు తుడుచుకుంటూ వచ్చి "బాబేం చేస్తున్నాడు" అడిగాడు.

"ఆకలేసి నిద్రలేచినట్టున్నాడు. వాళ్ళమ్మ పాలు పడుతోంది"

జ్యోతి లేచి అంది "ఇక భోజనం ఏర్పాట్లు చూస్తాను నాకో అయిదు నిమిషాలు టైం ఇవ్వండి" ఆమె లోపలికి వెళ్ళింది.

అందరూ డైనింగ్ టేబుల్ చుట్టూ కూర్చు న్నాక, మాల వేడివేడి చికెన్ బిర్యానీ, సూప్ వడ్డించింది.



షవర్‌లోనుండి నీళ్ళు తలమీద పడి, ముఖం మీదకు జారి ఎత్తుపల్లాలను దాటి ఫ్లోరింగ్ వైపు సాగిపోతుంటే ఆమెకు చాలా రిలాక్సింగ్‌గా అనిపించింది. స్నానం అంటే ఎందుకో చాలా ఇష్టం. బాత్‌రూంలో కనీసం పావుగంట గడపడం ఆమెకు ఈ మధ్యనే అలవడింది.

ఆమె ముఖానికి సబ్బునురగ పట్టిస్తుం డగా, చాలారోజుల క్రితం తను చదివిన ఓ సర్వేలోని విశేషాలు గుర్తొచ్చాయి.

స్త్రీ ఈ ప్రపంచంలో మొత్తంమీద అత్యధి కంగా రిలాక్స్ అవగలిగే చోటు బాత్‌రూమే నట. ఆ చోట తనకు జరిగిన అవమానా లకు కుళ్ళికుళ్ళి ఏడుస్తూ తననుతాను ఓదా ర్చుకుంటుంది. రకరకాల అనుభవాలు దృశ్యాలుగా కనులముందు కదలాడుతుంటే తాదాత్మ్యతలో మరోలోకంలోనికి వెళ్ళి ఆనందపడుతుంది. అనుభూతులను నెమ రువేసుకుంటుంది. అన్నింటికన్నా చిత్రమ యిన విషయం ఆ సర్వేలో తేలింది. ఇల్లా లుగా పనులలో సతమతమయ్యే ఆడది, కాసింత ప్రశాంతతను అనుభవించేది





నిద్రలో కూడా కాదట... బాత్‌రూమ్‌లోనే నట.

ఆమె స్నానం పూర్తిచేసి తలకో టవల్, వంటికో టవల్ చుట్టుకుని బెడ్‌రూంలో కొచ్చింది. బీరువాలో నుండి బట్టలు తీసు కుంటుండగా ఫోన్ మోగింది. ఆమె అలాగే వెళ్ళి రిసీవర్ చేతిలోకి తీసుకుని "హలో జ్యోతి స్పీకింగ్" అంది.

అవతలివైపు నుండి గొంతు పలకరిం పుగా నవ్వుతూ వినిపించింది "నేనూ ముర ళిని..."

"మీరా! గుడ్‌మార్నింగ్! ఏమిటీ? రావడం లేదా? "

"వస్తున్నాను. బయలుదేరుతుండగా ఒక సారి ఫోన్‌చేసి చెప్పడం బాగుంటుందేమో అనిపించింది. అంతే!"

"అలాగా! నేనింట్లోనే ఉంటాను! యూకెన్ కమ్!" చెప్పిందామె.

"పదిహేను నిముషాలలో అక్కడికి చేరు కుంటాను"

ఆమె ఫోన్ పెట్టేశాక తిరిగి బీరువా దగ్గ రగా వెళ్ళింది. బీరువాలో నుండి అంతకుముందు తీసిన నైటీని లోపలపడేసి కాటన్‌శారీ తీసింది. చీర కట్టుకున్నాక, డ్రస్సింగ్ టేబుల్ ముందు నిలబడి తనను తాను చూసుకుంది.

హాలులోకొచ్చి కూర్చుని పుస్తకం తిరగే స్తూనే అతడికోసం ఎదురుచూడసాగింది. అతడు తనను ఎందుకు కలుసుకోవాలను కుంటున్నాడో ఆలోచిస్తే, అది మాత్రం ఊహకి అందలేదు.

కాలింగ్‌బెల్ వినిపించింది. ఆమె టైము చూసుకుంది. సరిగ్గా పదిహేను నిమిషాలు. టైంసెన్స్ తెలిసిన వ్యక్తి అనిపించింది.

ఆమె సోఫాలోనుండి లేచివెళ్ళి డోర్ తెరి చింది. ఎదురుగా మురళి నిలబడి ఉన్నాడు. జీన్స్ ప్యాంటుపై ఖరీదైన టీషర్ట్ వేసుకుని ఉన్నాడు. అతడి చేతిలో ఏదో

కవర్ ఉంది.

"రండి... రండి"

అతడు లోపలికి వచ్చాడు. ఆమె చేత్తో చూపించిన సోఫాలో కూర్చున్నాడు. అతడి ఎదురుగా కూర్చుని "మాలా" అంటూ పిలిచింది. పనిపిల్ల వచ్చాక కాఫీ పట్రమ్మని పురమాయించింది. తర్వాత అంది "చెప్పండి".

కొద్దిసెకనుల నిశ్శబ్దం... మురళి గొంతు సర్దుకున్నాడు. అతడు ఎక్కడో మొదలుపెట్టి మరెక్కడ్నుంచో అసలు టాపిక్‌లోనికి రావడం ఇష్టంలేనట్టు, కాసింత ముందుకు వంగి గొంతు సర్దుకున్నాడు.

"నిన్న మీరు, ఆడదాని గురించి అసలు ఆలోచించని మగవాళ్ళే ఈ ప్రపంచం నిండా ఉన్నారంటూ మాట్లాడారు. కాని ఆడదాని గురించి ఆలోచించి, తనకుతాను సుఖానికి దూరమయిన వ్యక్తి గురించి మీకు చెప్పాలనిపించి ఈరోజు ఇలా వచ్చాను"

"ఎవరా వ్యక్తి? ... ఏమా కథ? " ఆమె కాస్త క్యూరియాసిటీతో ముందుకు వాలింది.

అతడు జవాబుగా, తన చేతిలోని కవర్ లోంచి కొన్ని పేపర్స్ తీసి టీపాయ్‌మీద పెట్టాడు "ముందు ఆ రిపోర్ట్స్ పరిశీలించండి"

ఆమె అతడివైపు కొద్దిక్షణాలు అదోలా చూసి, ఆ తర్వాత రిపోర్ట్స్ చేతిలోకి తీసుకుంది.

పనిపిల్ల వచ్చి ఇద్దరికీ కాఫీలు అందించింది. కాఫీ తాగుతూనే జ్యోతి రిపోర్ట్స్ పరిశీలించసాగింది. ఆమె ముఖంలో రంగులు మారసాగాయి.

సాగాయి.

"ఎవరివీ... ఎవరివీ రిపోర్ట్స్? " ఆమె గొంతులో కంగారు.

"ముందు ఆ రిపోర్ట్స్‌లోని విశేషం 'చెప్పండి"

ఆమె చెప్పింది "ఐదేళ్ళక్రితం తీసిన ఈ రిపోర్ట్స్‌లోని వ్యక్తి ఎట్టిపరిస్థితుల్లోనూ... సంతానోత్పత్తికి అర్హుడుకాడు"

"ఈ ఐదేళ్ళలోనూ ఆ పరిస్థితిలో మార్పు వచ్చే అవకాశముందా? "

"లేదు... అసలు అవకాశమే లేదు. ఆ వ్యక్తి 'స్పెర్మ్'లో జీవకణాల సంఖ్య చాలా చాలా తక్కువ. ఆ జీవకణాలు రోజురోజుకీ తగ్గుతాయి కానీ పెరిగే అవకాశం ఎంతమాత్రమూ లేదు"

"సో! ఆ వ్యక్తి పెళ్ళిచేసుకుంటే అతడి వలన స్త్రీ సంతానవతి కాదుకదా? "

"కాదు"

"తన వలన ఒక స్త్రీ మాతృత్వంపట్ల కలిగిన మమకారాన్ని, తల్లికావాలనే కోరికను చంపేసుకోవడం అతడికి ఇష్టంలేదు. అందుకే అతడు తన మనసులోకి పెళ్ళిచేసుకోవాలనే ఆలోచననే రానివ్వలేదు. ఇప్పుడు చెప్పండి, ఈ దేశంలో ఆడదాని గురించి కూడా ఆలోచించే మగవాళ్ళు కూడా ఉన్నారా లేదా? "

ఆమె కాసింత అనుమానంగా, మరికాస్త అర్థమయినట్టూ అతడికేసి చూస్తూ అడిగింది "ఇంతకీ ఎవరా వ్యక్తి? "

అతడు నవ్వుతూనే జవాబు చెప్పాడు "నేనే"

ఆమె అనుమానం నిజమయింది. అతడికేసి జాలిగా చూసింది. తను కూడా మరొకరిని జాలిచూపులు చూడగలనని ఆమెకు అప్పుడే అర్థమయినట్లనిపించింది. ఈ ప్రపంచం ఎంత విచిత్రమైనది? !

చాలా సేపటి తర్వాత అడిగిందామె "అసలు పెళ్ళికి ముందే ఇలాంటి పరీక్ష చేయించుకోవాలని మీకెందుకనిపించింది? "

"అనిపించలేదు... అనుకుని చేసింది

కాదు. జీవితంలో కొన్ని అనుకోకుండా చేస్తాం. అలా చేసిన పనులు మన జీవి తాన్నే మలుపు తిప్పొచ్చు" అతడి ముఖంలో బాధాకరమైన ఫీలింగ్ కనిపించ డంలేదు.

"అదెలా జరిగింది? "

"పెళ్ళయిన నా మిత్రుడొకడు తనకు పిల్లలు పుట్టలేదంటే నాకు ఫ్రెండయిన డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళాను. అతడికి పరీ క్షచేస్తూ, తమాషాగా 'నువ్వూ పరీక్ష చేయిం చుకుంటావా? ' అన్నాడు. నాకు తమాషాగా చేయించాలనిపించి స్పెసిమెన్ ఇచ్చాను. రిపోర్ట్ అందుకున్నాక దిక్కుతోచని వాడిలా కొద్దిరోజులు పిచ్చెక్కి తిరిగాను. ఆ తర్వాత మనసు కుదుటపరచుకుని 'పెళ్ళిచేసుకుని మరో స్త్రీని బాధపెట్టకూడదని బ్రహ్మచా రిలా ఉండిపోవాలనే నిర్ణయం తీసుకు న్నాను"

ఎదుటి వ్యక్తిని ఓదార్చాలో, అభినందిం చాలో అర్థంకాని అయోమయంలో పడిం దామె. అసలా సమయంలో తన మనసు లోని అభిప్రాయమేమిటో తనకే అర్థంకా లేదు.

అతడే అన్నాడు, "ఇప్పటికయినా మీకు మగవారిలోనూ కాస్త మంచివారుంటారని అర్థమయిందనుకుంటాను? "

ఆమె నిలువుగా తలాడించింది.

"మరి నేను వెళ్ళొస్తాను" అతడు టైమ్ చూసుకుంటూ చెప్పాడు. "ఇప్పటికే మీ టైమ్ పదిహేను నిమిషాలు వేస్ట్‌చేశాను"

"ఇది వేస్ట్ చేస్తున్న టైం కాదు. మీ ప్రజ న్స్‌లో... ఐయామ్ ఫీలింగ్ వెరీహేపీ"

అతడి ముఖంలో ఆదోలాటి వెలుగు కద లాడింది. అది గమనించిందామె.

"నిన్న మీ మాటలు విన్నాక ఏ రూపంలో నయితేనేం మనిద్దరం ఒకే బోటులో ప్రయాణిస్తున్నట్టుగా ఫీలయ్యాను. అందువలననే కాబోలు మీతో ఇంత సన్ని హితంగా మాట్లాడగలుగుతున్నాను"

ఆమె మెల్లగా తలాడించింది. "ఆ విషయం నాకిప్పుడే తెలిసింది"

మురళి చెప్పాడు. "నేను కాలేజీ రోజుల్లో బాగా సిగరెట్లు కాల్చేవాడిని. డ్రింక్స్ కూడా బాగా పుచ్చుకునేవాడిని. అందువల్లే నా శరీ రంలో అటువంటి మార్పు జరిగిందేమో అనుకుంటున్నాను"

"నో నో! నేనలా అనుకోను! మీకో ఆశ్చ ర్యకరమైన విషయం చెబుతా వినండి. ఏ దురలవాట్లూ లేకుండా, కనీసం కాఫీ, టీ కూడా తీసుకోకుండా, కేవలం పాలుతాగే వారిలోనూ ఇటువంటి మార్పు జరిగే అవ కాశం ఉంది"

"ఈజిట్? మీరు చెప్పేది నిజమా? " ఆశ్చర్యంగా అడిగాడతడు.

"అవును! ఎక్కువగా పాలు రావాలని ఆవులకీ, గేదెలకీ ఓ మందును ఇంజెక్ట్ చేస్తారు. ఇటీవలికాలంలో ఆ మందును చాలా ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. ఆ ఇంజక్షన్స్‌లో ఈస్ట్రోజన్ అనే పదార్థం ఉంటుంది. ఈ ఈస్ట్రోజన్ పాలలోచేరి, తద్వారా మగవారిలోకి చేరిపోతుంది. పిల్లలు పుట్టకుండా ఉండడానికి ముఖ్యకా రణం ఈస్ట్రోజనే" చెప్పింది జ్యోతి.

"మైగాడ్! నమ్మలేకపోతున్నాను"

"అంతేకాదు... శరీరానికి రాసుకునే లోషన్లూ, షాంపూలూ, ఫ్రిజ్‌లో వుంచిన మాంసం వంటి వాటివల్ల కూడా మగవారి శరీరంలో 'ఈస్ట్రోజన్' ఎక్కువగా చేరు తుంది. ఇదేకాకుండా స్పెర్మ్‌ని శక్తివిహీనం చేసే మరో పదార్థం క్లోరిన్ ఉంది. తాగే మంచినీటిలోనూ, వాడే ఉప్పులోనూ ఉండే క్లోరిన్ ఫరవాలేదుగానీ, పరిశ్రమల్లోనూ వ్యవసాయరంగంలోనూ మందుల తయారీ లోనూ వాడే క్లోరినే మగవాడి మగతనానికి ఒక సవాలుగా తయారైంది"





మురళికి ఏం మాట్లాడాలో అర్థంకావడం లేదు. ఆమె చెబుతున్న విషయాలు అతడిలో ఇన్నాళ్ళూ ఏమూలో దాక్కుని ఉన్న గిల్టీ ఫీలింగ్‌ని నాశనం చేస్తున్నాయి. జ్యోతి కంటిన్యూ చేసింది. "డాక్టర్ భవానీగారి హాస్పిటల్‌లో స్పెర్మ్ బ్యాంక్‌కి వీర్యదానం చేసేందుకు ఇటీవల వస్తున్న యువకుల్లో జీవకణాలు ఉన్నవారు అతితక్కువమంది ఉంటున్నారు. చూడ్డానికి చాలా ఆరోగ్యవంతంగా మగతనం ఉట్టిపడేటట్టు ఉన్న యువకుల్లో చాలామందికి స్పెర్మ్ కౌంట్ చాలా తక్కువగా వుంటోంది. సర్వేబట్టి చూస్తే దాదాపు ప్రపంచమంతా ఇలాంటి సమస్యే ఉందట. పాతకాలం మనుషుల కన్నా, ఈ రోజున ముప్పై సంవత్సరాల లోపు యువకులకి తండ్రి అయ్యే భాగ్యం లేదనే చెప్పాలంటే భయంగా ఉంది"

"ఎందుకు? ... ఎందుకు ఇలా జరుగుతోంది? "

"పారిశ్రామిక ప్రగతి పేరుతో మనిషి తన కుతానే అపకారం చేసుకుంటున్నాడు. మీకో ఉదాహరణ చెబుతాను. బొమ్మలూ, కుళాయిలూ, పైపులూ తయారుచేయడానికి ఉపయోగించే పి.వి.సి అనే ప్లాస్టిక్ పదార్థాన్ని కాలిస్తే దాన్నించి వచ్చిన డైయాక్సిన్ అనే విషవాయువు మగవాడి వీర్యశక్తిని తగ్గించడానికి మూలకారణమౌతుంది" చెప్పిందామె.

"సో! నా శరీరంలో మార్పుకి కారణంగా నా తప్పేమీ లేదంటారు" అడిగాడు మురళి తనలోని గిల్టీఫీలింగ్‌ని పూర్తిగా తొలగించేసుకుని.

"ఎంత మాత్రమూ లేదు" అంది జ్యోతి నవ్వుతూ.

మరో అరగంట తర్వాత అతడు ఆమె దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆరోజు రాత్రి జ్యోతికి రకరకాల ఆలోచనల మధ్య అసలు నిద్రపట్టలేదు. ఆ ఆలోచనలలో చాలాసార్లు మురళి కదలాడాడు. ఆమెకు అతడిమీద జాలికలగడమే కాదు, అతడి వ్యక్తిత్వం పట్ల చాలా గౌరవభావం ఏర్పడింది.

అదే రాత్రి మురళి కూడా ఆమె గురించే ఆలోచించసాగాడు. అయితే ఆ ఆలోచనలు నిర్దిష్టంగా లేవు. ఆ భావాలకు ఒకరూపం లేదు.

ఏమయితేనేం వారిరువురూ ఒకరి గురించి మరొకరు ఆలోచించడం మొదలు పెట్టారు.

మరో రెండు నెలలు గడిచిపోయాయి.

సతీష్ హాస్పిటల్ నుంచి డిశ్చార్జయ్యి మళ్ళీ మామూలుగా హాస్పిటల్ డ్యూటీకి అటెండ్ అవుతున్నాడు. అయితే అతడిప్పుడు పూర్వంలా పూర్తి మగవాడు కాదు. వెన్నుపూసలో ఆపరేషన్ ద్వారా వేసిన రాడ్ ఉంది. చేతిలో ఊతగా ఒక కర్ర వచ్చింది. ఇకపై అతనికి సంతానార్హత లేదు. అతడు జ్యోతి గురించి ఈమధ్య కొత్తవార్తలు వింటున్నాడు. ఆమె ఎవరో ఒక యువకుడితో అప్పుడప్పుడూ రెస్టారెంట్లలో కనిపిస్తోందని. ఆ విషయం క్లారిఫై చేసుకోడానికి అతడు రెండుమూడుసార్లు జ్యోతికి ఫోన్‌చేశాడు. ఆమె ముక్తసరిగా మాట్లాడి ఫోన్ పెట్టేసేది.

జ్యోతి ఇక తనకి అందని పండేనని నిర్ణయించేసుకున్నాడు.

★ ★ ★

ఓ పేషంట్‌ని టెస్ట్ చేసి బయటకు పంపేశాక మరో పేషంట్ కోసం బజర్ నొక్కితే బయటనుండి రూమ్‌లోకి నాగమణి వచ్చింది.

ఆమెను చూడడంతోనే జ్యోతి ముఖమంతా విప్పార్చుకుని "హాయ్! ఏమిటీ హఠాత్ దర్శనం? " అంది.

"ఈరోజు బ్యాంక్ హాఫ్‌డేనే కదక్కా...

అదే శనివారం! అందుకే బ్యాంక్‌నుండి తీరుబడిగా ఇటు వచ్చాను"

"అయితే కూర్చో ఓ అరగంటలో నేనూ బయలుదేరుతాను"

ఆమె తలవూపి అక్కడే వున్న ఓ కుర్చీలో కూర్చుని, టేబుల్‌మీదున్న మెడికల్ జర్నల్ చేతిలోకి తీసుకుంది.

జ్యోతి బజర్ నొక్కాక ఓ పేషంట్ లోపలికొచ్చింది. ఆ పేషంట్‌ని చూసి పలకరింపుగా నవ్వి "ఇప్పుడెలా ఉంది? " అడిగింది.

"బ్లీడింగ్ కొద్దిగా తగ్గింది డాక్టర్"

"రండి... టెస్ట్‌చేస్తాను" జ్యోతి లేచింది.

పేషెంట్ అక్కడే ఉన్న స్ట్రెచ్చర్‌మీద పడుకున్నాక, అడ్డుగా కర్టెన్ లాగింది.

నాగమణి ఆ కర్టెన్‌వైపు పావునిముషం చూసి, ఆతర్వాత చూపులు మరల్చుకుంది. బిడ్డలకోసం పరితపించే స్త్రీలు, ఇలాంటి టెస్ట్‌లు చాలా ఎదుర్కోవలసి ఉంటుంది. అసలు తనకు మొదట్లో డాక్టర్‌కి తన లోపం గురించి చెప్పాలంటేనే సిగ్గనిపించింది. ఆ తర్వాత డాక్టర్ 'టెస్ట్' అంటూ బల్లమీద పడుకోబెట్టి చూడ్డం మొదలెట్టాక అవమానంతోనూ, సిగ్గుతోనూ చచ్చిపోతున్నట్టనిపించింది. అయితే క్రమక్రమంగా తనలో ఆ బెరుకు, ఇతర ఫీలింగ్స్ పోయాయి.

పేషెంట్ ఇవతల కొచ్చేసింది. డాక్టర్ వాష్‌బేషిన్‌లో చేతులు కడుక్కుంటున్న చప్పుడు. నాగమణి తిరిగి అటుకేసి చూసింది.

జ్యోతి నేప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ వచ్చి కూర్చుంది. ప్రిస్క్రిప్షన్‌మీద ఏవో టేబ్లెట్స్ రాసి ఆమెకు అందించి వాడే విధానం చెప్పింది.

పేషెంట్ వెళ్ళిపోయాక జ్యోతి నాగమణి వైపు తిరిగింది. "పాపం ఈ అమ్మాయి ఆరునెలలపాటు తను తల్లిని కాబోతున్నానని సంబరపడి, అది అబద్ధమని తేలాక ఏర్పడిన డిప్రెషన్‌నుండి ఇప్పుడిప్పుడే బయటపడుతోంది"

"తల్లిని కాబోతున్నానని సంబరపడడమేంటి? " ఆశ్చర్యంగా అడిగింది నాగమణి.

"బిడ్డలమీద మితిమీరిన వ్యామోహంతో బాబాలు, స్వాములు, ఫకీర్లు, మంత్రగాళ్ళను నమ్ముకుంటే పరిస్థితులు అలాగే వస్తాయి"

"అంటే? "

"పద మనం ఇంటికి వెళుతూ మాట్లాడుకుందాం" అంటూ డాక్టర్ జ్యోతి లేచింది.

నాగమణి అనుసరించింది.

కారు హాస్పిటల్ గేటు దాటాక మార్కెట్ వైపు వెళుతుండగా అడిగింది నాగమణి "ఆ పేషంట్ గురించి ఏదో చెప్పాలనుకున్నావ్? "

"అదే చెప్పబోతున్నాను. ఆ అమ్మాయి హయత్‌నగర్ దగ్గరున్న ఓ దేవాలయం పూజారికి భార్య. నీకు తెలుసుగా. అలాంటి వృత్తిలో ఉన్నవారికి మంత్రతంత్రాలపట్ల, నాటువైద్యాల మీదా విపరీతంగా నమ్మకముంటుందనీ. ఎవరో ఫకీర్ వీరి విషయం తెలుసుకుని 'సంతానం'కోసం మందు ఇస్తానన్నాడట. నమ్మేశారు వీళ్ళు. మందుకు వెయ్యి రూపాయలివ్వాలి. కడుపొస్తే ఐదువేలు దక్షిణగా సమర్పించాలి. ఒప్పుకున్నారు. వాడు ఈమె చేతికి ఓ తాయెత్తు కట్టి, మరేదో మందు తినిపించాడు. రెండు నెలలయినా మెన్సస్ కాలేదు. కడుపు కూడా కాస్త ఎత్తుగా కనిపించడం మొదలుపెట్టింది. దాంతో వారంతా అది కడుపేనని నమ్మేసి ఆ ఫకీర్‌కి ఐదువేలు సమర్పించేసారు. వాడు ఎటోవెళ్ళిపోయాడు. నాలుగు నెలలు గడిచేసరికి సైడ్‌ఎఫెక్ట్స్ మొదలయ్యాయి. హాస్పటల్‌కి రావడంతో అది కడుపు కాదనీ, ఆపరేషన్ చేసి తీసేయాల్సిన గడ్డ మొదలయిందనీ అర్థమయింది

వారికి"

"అలా ఎందుకు జరిగింది? " ఆశ్చర్యంగా అడిగింది నాగమణి.

"వాడు చేసిన పనల్లా, ఆ అమ్మాయికి మెన్సస్ రాకుండా ఏదో నాటుమందు ఇచ్చాడు. ఆ మందు ప్రభావంతో గడ్డ మొదలయింది. మరికొద్ది రోజులు ఆలస్య మయి ఉంటే అసలు ప్రాణానికే ముప్పు వచ్చి ఉండేది"

"మైగాడ్!" గుండెలమీద చేయివేసుకుని అంది నాగమణి.

అప్పటికి కారు మార్కెట్ దాటి బ్యాంక్ కాలని వైపు పరిగెడుతోంది.

"కొంతమంది చాదస్తపు పెద్దవాళ్ళు, సంతానం కోసం కూతుర్నో, కోడల్నో బాబాలూ, స్వాములు దగ్గరకు తీసుకెళ్తారు. అదీ అంత మంచిపద్ధతి కాదు. వారిలో కాముకులుండొచ్చు"

"నిజమా? " తాను చూచాయిగా అలాంటి విషయాలు విన్నప్పటికీ ఆమెకు తెలిసిన విషయాలు తనూ తెలుసుకోవాలన్న ఉద్దేశ్యంతో అడిగింది నాగమణి.

"అవును..." ఏదో జ్ఞప్తికి తెచ్చుకుంటున్నట్టుగా జ్యోతి కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయింది. ఆ తర్వాత చెప్పసాగింది. "... అప్పుడు మేమంతా బాగా చిన్నవాళ్లం. మా ఊరికి ప్రతి సంవత్సరం కార్తీకమాసంలో ఓ స్వామీజీ వచ్చి సర్పంచ్ ఇంట్లో బసచేసేవాడు. ఆయన చాలా 'శక్తి'కలిగిన స్వామీజీ అనీ, ఆయనకు మంత్రతంత్రాలే కాదు చాలా రకాలయిన వైద్య విధానాలు తెలుసునని మా చుట్టుపక్కల పల్లెల్లో ప్రతీతి. ఆయన మాఊరు వచ్చి విడిదిచేసినప్పుడు చుట్టుపక్కల గ్రామాలనుండి వందలసంఖ్యలో జనం ఆయన దర్శనంకోసం వచ్చేవారు. ఇతర కోరికలు కోరేవారికన్నా సంతానం కోరివచ్చేవారినే ఆ స్వామీజీ ఎక్కువగా ఆదరించేవాడు. సంతానం కోరుకుంటున్న యువతి ఆయన చేసే పూజలో మూడు రాత్రులు ఒంటరిగా కూర్చోవాలి. ఆ పూజా సమయంలో ఆమె, ఆయన తప్ప మరెవ్వరూ ఆ గదిలోనే కాదు, పరిసర ప్రాంతాలలో కూడా ఉండకూడదు. అలా చాలా ఏళ్ళు గడిచిపోయాయి. ఆ పూజలో కూర్చున్నవారిలో చాలామంది సంతానవతులయ్యారు. మరికొంత మందికి పిల్లలు కలగకపోతే అది తమ ఖర్మ అని సరిపెట్టుకున్నారు. దానవాయి వీధిలో ఉండే సుబ్బాలమ్మ ఇప్పటికీ నా కళ్ళముందు కదలాడుతున్నట్టే ఉంది. ఐదు ముప్పావు అడుగుల ఎత్తులో, బలంగా ఉండేది. తెల్లటి తెలుపు. ఎప్పుడూ చిరునవ్వుతో కనిపించేది. ఆమెకు ఆరేళ్ళపాటు సంతానం కలగకపోవడంతో అత్తగారు స్వామిగారి దగ్గరకు తీసుకెళ్ళారు. ఆయన పూజ చేద్దామన్నారు. మొదటిరాత్రి సుబ్బాలమ్మ 'పూజ'కెళ్ళింది. కొద్దిసేపట్లోనే ఆమె పెద్దగా అరుస్తూ, పీలగా ఉండే స్వామి జుట్టుపట్టుకుని తన్నుకుంటూ గదిలోంచి వీధిలోకి తీసుకొచ్చింది. గ్రామస్తులు ఇదేమిటని అడిగితే చెప్పింది. ఆస్వామి పూజచేసేప్పుడు ఒంటిమీద బట్టలుంచుకోకూడదన్నాడట! సరేనని భయంతో బట్టలు తీసేసింది. స్వామి కూడా బట్టలు తీసేసాడు. ఏవో మంత్రాలు చదివాక, అసలు పూజ మానేసి మరేదో చేయబోతే ఇదేమిటని అడిగిందట. ఓసి పిచ్చిమొహమా! పూజ అంటే అది కాదే ఇదేనన్నాడుట. ఈ పూజలో కూర్చున్న ఆడవాళ్ళు సంతానవతులయింది ఇలాగే కదా అంటూ వెకిలిగా నవ్వాడట. అంతే, ఆమెకు కోపమొచ్చేసి వాడిని తంతూ లాక్కొచ్చిందట. ... ఇది జరిగిన పదిరోజుల తర్వాత 'పూజ' ద్వారా సంతానవతి అయిన ఓ ఇల్లాలు ఆత్మహత్య చేసుకోవడంతో ఆవేశంలో తనెంత తప్పుగా అసలునిజం బయటపెట్టేసిందో అర్థమయింది సుబ్బాలమ్మకు. మరోనెల తర్వాత మరో ఇల్లాలిని మొగుడు వదిలేసాడు. ఆ

తర్వాత మరో ఇల్లాలి ఆత్మహత్య. ... ఆ అనర్థాలకు కారణం తన అనాలోచిత మాట లేనని అర్థమయిన సుబ్బాలమ్మ ఓ రోజు ఎండ్రిన్ తాగి చనిపోయింది"

"మైగాడ్" అంది నాగమణి. "ఎంత భయంకరమైన కథ" ఆమె గుండెలమీద చెయ్యివేసుకుంది.

"మాతృత్వం అనే పదం చుట్టూ ఎన్ని భయంకరమైన కథలు, మరెన్ని వ్యధలు న్నాయో చాలామందికి తెలియకపోవచ్చు. నేనొక డాక్టర్‌ని అందులోనూ ఆ సమస్య చేత బాధితురాలను కాబట్టి లోతుగా వెళ్ళి పరిశీలించి చాలా నిజాలు తెలుసుకున్నాను"

కారు బ్యాంక్ కాలనీ సమీపిస్తూ ఉంది.

"ఆ సమస్యచేత బాధితురాలవయిన నీకు ఓ మంచి పనిచేసి, నీ బాధను తగ్గించాలని నేనూ మావారూ ఓనిర్ణయం తీసుకున్నాం"

జ్యోతి ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"... మావారు ఆ విషయాన్ని నీకు చెప్ప డానికి ఇబ్బందిగా ఫీలయ్యారు. అందుకే నేను చెప్పదలచుకున్నాను.

"నాకు... నాకు చేయగలిగిన మంచి పని ఏముంది? "

"ఇంటికెళ్తున్నాంగా! డాబామీద కూర్చుని ప్రశాంతంగా మాట్లాడుకుందాం"

ఇద్దరూ కూర్చున్న ఐదునిమిషాల తర్వాత... నాగమణి చెప్పడం మొదలుపె ట్టింది. వింటున్న జ్యోతి కళ్ళు పెద్దవికాసా గాయి.

అంతా అయ్యాక "మీకు... మీకు మతిపో యిందా? ముఖ్యంగా నువ్వీ ప్రపోజల్‌కి ఎలా ఒప్పుకుంటున్నావ్? " చాలా విస్మ యంగా అడిగింది జ్యోతి. అలా అడగ డంలో కాసింత మందలింపు ఉంది.

నాగమణి నవ్వింది "నువ్వన్నట్టు కాలం మారిందక్కా. మారే కాలంతోపాటు మనమూ మారడం అవసరం. ఈ కాలంలో చాలా రకాల సెంటిమెంట్స్ జనం వదిలేస్తు న్నారు. లేకపోతే ఎవడో ముక్కూ ముఖం తెలియని మగాడి వీర్యాన్ని తనలో ప్రవేశ పెట్టుకుని ఆడది బిడ్డను కనడం ఏమిటి? దానికి ఆమె భర్త కూడా అంగీకరించడం మాత్రమే కాకుండా ఆ బిడ్డకు తను తండ్రిలా ఫీలయి సంబరపడడమేమిటి? కాలం మారుతున్నప్పుడు మనమూ మారా లక్కా! మీరు గిఫ్ట్ పద్ధతి గురించి చెప్పినప్ప టినుండి నా మనసులో మీరే మెదలాడుతు న్నారు. నేను మీ అండంతో ఓ బిడ్డను కని మిమ్మల్ని తల్లిని ఎందుకు చేయకూడదు? ఈ విషయం మావారికి చెపితే మొదట మీలా ఆశ్చర్యపడినా ఆ తర్వాత అంగీకారం తెలియచేసారు... ఇక మీ అంగీకారం మాత్రమే అవసరం..."

జ్యోతికి ఆ క్షణం మనసులో కలిగిన భావపరంపరకు అర్థమేమిటో తనకే తెలియ డంలేదు. కాని మనసు చాలా తేలికయి దూదిపింజలా తేలిపోవడం అర్థమవుతూనే ఉంది. ఏ రూపంలోనయితేనేం తను తల్లి అయ్యే అవకాశం వచ్చింది. తన అండంతో ఒక బిడ్డ జన్మిస్తాడు! పేగు తెంచుకుపుట్టిన వాడే బిడ్డనా? నవమాసాలూ మోస్తేనే తల్లి అవుతుందా? తన 'అంశ'ను అందించినా తను 'తల్లి' కాగలదు. ఆ బిడ్డను లాలించి, పాలించి మాతృత్వపు మధురిమ రుచిచూడ గలదు. హే భగవాన్! ఆడదానికి తల్లి కాబోతుందన్న ఆలోచనే అపరిమితానందం కలిగించేలా చేసి, ఆమెకు 'మాతృత్వం'పట్ల పిచ్చిప్రేమ ఏర్పడేలా చేశావుకదయ్యా?

జ్యోతి అంది "కానీ నాగమణీ!... ఆవే శంలో నిర్ణయాలు తీసుకోవడం కాదు. బాగా ఆలోచించుకో. అందులోనూ ఇది చాలా సున్నితమైన సమస్య. మనసుకు సంబంధించిన సమస్య. ఇలాంటి విషయా లలో ఆవేశం, ఆ తర్వాత జీవితాంతం బాధ




పడేలా చేస్తుంది..."

"నేను ఆవేశంలో మాట్లాడదలచుకుని ఉంటే అది ఓ వారంరోజుల ముందే మాట్లాడి ఉండేదాన్ని. ఆవేశం ఆలోచనగా రూపుదిద్దుకోవడానికి ఆరు రోజులు పట్టిందంటే, అది అనాలోచిత చర్యకాదనీ, తప్పొప్పులూ, భవిష్యత్‌లో రాగల పరిణామాలు బాగా ఆలోచించి తీసుకున్న గట్టి నిర్ణయమనీ మీకు అర్థమవుతోంది కదా? "

జ్యోతి మరికొద్ది క్షణాల తర్వాత అడిగింది "మరి ఈ నిర్ణయం ఆంటీకి తెలియ చేసారా? " ముసలివాళ్ళకు ఇలాంటివిషయాలలో పట్టింపులు ఎక్కువని ఆమెకు తెలుసు.

"తెలియజేశాం! మీకు వరుడ్ని తీసుకురావడం అనే విషయంలో తను ఫెయిల్ అయ్యానని ఆమె చాలా బాధపడిపోతోంది. అందువల్లే కాబోలు, నేనూ మావారు కాస్త భయంగానే మా మనసులోని మాట ఆమె చెవిన వేస్తే ఆమె చాలా సంబరపడిపోయింది. పోనీలేరా! మన ఇంట్లో దీపం వెలిగించిన ఆ పిల్లకు మనం ఈమాత్రం సహాయం చేస్తే మనకూ కాస్త మనశ్శాంతిగా ఉంటుంది అని అంది" నాగమణి నవ్వుతూ చెప్పింది.

ఎందుకనో తెలియదు జ్యోతి కన్నుల్లో చప్పున నీళ్ళు కదిలాయి. ఆ కుటుంబసభ్యులు తనమీద చూపుతున్న అభిమానం, ఆప్యాయతలు కారణమా? లేక... తన భర్త మరో మగాడి కేసి చూసినా భరించలేని స్త్రీ జాతిలో పుట్టినప్పటికీ, తన కడుపులో తన భర్త 'అంశ' మరో ఆడదాని అండం కలిసి గర్భంగా మారితే ఆపిండాన్ని నవమాసాలు మోసేందుకు అంగీకరించిన ఆ మహోన్నత స్త్రీ మూర్తిని చూసిన సంతోషంతోనా? ఏమో! తన కన్నులలో నీరు తిరిగిందెందుకో తనకే తెలియదు.

ఆమె కన్నుల్లోని నీరు చూసింది నాగమణి. "ఏమిటి... ఏమిటక్కా? " అంది.

కాని జవాబు చెప్పడానికి ఆమె నోటి వెంట మాట రాలేదు. గొంతు మూగబోయిందెప్పుడో! ఆమె మనఃస్థితిని అర్థం చేసుకుంది నాగమణి.

ఆ సాయంత్రం ఆమె కారులో ఇంటికెళుతున్నప్పుడు లోకమంతా ఆనందమయంగా అనిపించింది. 'ఏ రూపంలోనైతేనేం తాను తల్లికాబోతోంది! తల్లి అన్నపదంలోనే తన్మయత్వం ఉందేమో! తన తనువులోని అణువణువూ తన్మయత్వంలో మునిగి తేలుతోంది.

'ఇంటికి వెళ్ళగానే ఈ విషయాన్ని సతీష్‌కి ఫోన్ చేసి చెప్పాలి' అనుకుందామె. ఆమె మనసులో ఏమూలో కసి బుసకొట్టింది.



బెడ్‌ల్యాంప్ నుండి వచ్చే వెలుతురు చీకటిని పూర్తిగా పారదోలాలని ప్రయత్నిస్తూ ఉంది, కాని దాని ప్రయత్నం పూర్తిగా నెరవేరడం లేదు. మసకచీకటి ఆగదిలో మిగిలేవుంది.

'ఆ మసకచీకటి తన బ్రతుకులోని చీకటి కోణాల్ని దాచిపెడుతుందేమో! కానీ, నలుపు ఎప్పుడో ఒకప్పుడు వెలుగులోకి రాకమానదు'

ఆమె తన నడుం చుట్టూ చుట్టుకుని

ఉన్న చెయ్యి తొలగించే ప్రయత్నం చేసింది. కాని ఆ చెయ్యి మరింత గట్టిగా బిగుసుకుంది. ఆ చెయ్యి తాలూకూ తలను ఆమె మెడవంపులో దాచుకుంటూ తమకంగా "కీర్తీ"అన్నాడు.

అదిగో... ఆ పిలుపే గుండెకింద నరాలను మెలిపడేలా చేస్తుంది. సతీష్.. సతీష్ కూడా ఇలాగే పిలిచేవాడు. అతడి పిలుపు లోనే కాదు... ఈ వ్యక్తి పిలుపులో కూడా ఆర్తి, ఆప్యాయతలు లేవు. కేవలం... కేవలం కోరిక మాత్రమే వినిపిస్తుంటుంది.

ఈ వ్యక్తి... కేవలం... 'కోరిక' అన్నదే ప్రధానంగా తనతో పరిచయం పెంచుకుని, పరిచయాన్ని స్నేహంగా మలచుకుని, స్నేహాన్ని బెడ్ వరకూ తీసుకువచ్చాడని తనకు తెలుసు. తను కూడా ఆ 'కోరిక' ను గ్రహించినప్పటికీ... అతడితో కలసి బెడ్ ఎక్కింది.

ఎందుకు?

కోరికతోనా...?!

కాదు... కానేకాదు...!

ఆశ...!

ఒకే ఒక్క చిరు ఆశ!

ఏ స్త్రీ కయినా ఉండే సహజ సిద్ధమయిన ఆశ!

స్త్రీ తనను తాను పరిపూర్ణురాలుగా భావించేందుకు సహకరించే ఆశ!

అది...

మాతృమూర్తి కావాలన్న ఆశ.

ఆ ఆశ యొక్క ఉధృతి ఆడదాని చేత తప్పుకూడా చేయిస్తుందా?

చేయిస్తుందని తన అనుభవమే చెప్తోంది.

ఆ ఆశనే లేకపోతే తను ఈ వ్యక్తితో శారీరకంగా కలిసేందుకు ఇష్టపడి ఉండేదా? ... ఎట్టి పరిస్థితుల్లోనూ ఇష్టపడి ఉండేది కాదు. కోరిక కలిగినా, కట్టుబాట్లను దాటాలని ప్రయత్నించలేక పోయేది. ఆకర్షణ సహజ సిద్ధమే గానీ, స్త్రీ పురుషులకు నీతిని జాయితీ పట్ల ఉండే గౌరవభావం బలహీనతలను జయించగలిగే శక్తినిస్తుంది. చాలా తక్కువ మంది మాత్రమే మనసు హెచ్చరికను నిర్లక్ష్యం చేసి శరీరాన్ని అపవిత్రం చేసుకునేందుకు సిద్ధమవుతారు.

నిజానికి తనది అలాంటి కేరెక్టర్ కాదు. తనకు నీతి నిజాయితీ పట్ల చాలా నమ్మకం. తప్పు చేయడమంటే భయం... కానీ... కానీ... తప్పు చేసింది.

తన నమ్మకాలను, భయాలనూ అధిగమించేలా చేసిన ఆ కారణం.

మాతృమూర్తి కావాలనే తపన.

ఆమెకు ఆ క్షణం పక్కనున్న వ్యక్తితో పరిచయం తాలూకూ దృశ్యాలు సినిమారీళ్ళలా కనుల ముందు కదలాడాయి.

★ ★ ★

సతీష్‌కి యాక్సిడెంట్ అయిన తర్వాత లోకం శూన్యంగా అనిపించసాగింది.

అంతకు మునుపు సతీష్ హాస్పిటల్ నుండి వస్తున్నాడంటే ఏదో తెలియని హుషారు తనువునూ, మనసునూ ఉత్తేజపరిచేది. అతడు ఆరింటికి వస్తాడంటే ఐదింటికే స్నానం చేసి మేకప్ చేసుకుని వరండాలో కూర్చుని అతడి కోసం ఎదురు చూసేది.

సతీష్ ఆరింటికి వచ్చేవాడు. ఇద్దరూ కలిసి సినిమాకో, షికారుకో వెళ్ళేవారు. కాలాన్ని మరచి ఎంజాయ్ చేసేవారు.

కాలం ఎప్పుడూ ఒకటిగా ఉండదనీ, పగలూ, రాత్రి లానే మనిషి జీవితంలో సుఖమూ, దుఃఖమూ ఉంటాయని తనకి తెలియాలనేమో-

సతీష్‌కి జరిగిన యాక్సిడెంట్... తమ ఇద్దరి జీవిత గమనమే మారిపోయేలా చేసింది...! తండ్రి కాలేడు అన్న సత్యం సతీ




ష్‌కి షాక్‌లాంటి వార్తనే కావచ్చుగానీ, తనకు మాత్రం అశనిపాతం...!

చిన్నప్పటినుంచీ తనకు పిల్లలంటే చాలా ఇష్టం. ఇరుగుపొరుగు వారి పిల్లల్ని దగ్గరకు తీసి ముద్దుచేసిన తనకు... ఇక పిల్లలు పుట్టరన్న నిజం... భరించలేని బాధను కలగజేసింది. పిల్లలు పుట్టకపోవడానికి తన లోపం లేకుండా, భర్త కారణం కావడం అన్నది మొదట్లో ఏ భావం కలిగించకపోయినా రానూ రానూ అది మనసులో కల్లోలం కలిగించసాగింది.

తనకు తెలీకుండానే సతీష్ పట్ల ఏదో అసహనం పెరుగుతోంది. కొన్నాళ్ళకది కోపంగా... ఆ కోపం కాస్తా అతడిపట్ల అలుసుగా మారింది.

అప్పుడప్పుడూ సూటిపోటి మాటలతో అతడిని బాధపెట్టేది. సతీష్ భరించేవాడు. ఒక్కోసారి అతడు నవ్వేసి "ఊరుకో కీర్తీ! ఈ ప్రపంచంలో ప్రతి జంటకూ పిల్లలున్నారా? కొంతమంది ఏ అనాధాశ్రమం నుంచో పిల్లల్ని తెచ్చుకుని పెంచుకుంటున్నారు. అంతగా నీకూ పిల్లల మీద ప్రేమ ఉంటే మనం ఏ అనాధాశ్రమం నుంచో ఓ పాపని తెచ్చి పెంచుకుందాం" అనేవాడు.

ఆ క్షణం తనకెందుకో జ్యోతి గుర్తుకు వచ్చేది. ఈ మనిషికి ఈ జ్ఞానం ముందే ఉండి ఉంటే ఆమెకు విడాకులు ఇచ్చి ఉండేవాడు కాదు. తానిలా ఇతడికి భార్యగా మారి, గొడ్రాలుగా మిగిలిపోవాల్సి వచ్చేది కాదు.

బహుశ ఈ భావమే తనకు సతీష్ పట్ల కోపాన్నీ, కసినీ కలిగిస్తూ ఉందేమో!

ఒక మగాడు తన భార్య సంతానవతి కాలేకపోతే ఆమెను బాధించి, చివరికి విడాకులిచ్చేలా చేసినప్పుడు ఒక ఆడది తన భర్త వల్ల సంతానవతి కాలేకపోతే అతడిని ఏవిధంగా ఏడిపించవచ్చు? తనిప్పుడు అతడిని ఏడిపించినా తనకేమీ కాదన్న భరోసా ఆమెకుంది.

ఆమె ఆలోచనలు అలా సాగుతున్న రోజుల్లోనే, ఓ సాయంత్రం సతీష్ కాస్త ఉత్సాహంగా ఇంటికొచ్చాడు. అతడు వచ్చే సమయానికి ఆమె బెడ్‌రూంలో మూడంకె వేసుకుని ముడుచుకుని పడుకుంది.

సతీష్ వచ్చి బెడ్‌మీద కూర్చుని "కీర్తీ! ఏమిటోయ్ ఇలా పడుకున్నావ్?" అన్నాడు ఆప్యాయంగా.

అప్పటికీ ఆమె మాట్లాడలేదు.

"ఓ.కె! నువ్వు ఉత్సాహం చూపించినా చూపించక పోయినా నేను చెప్పదలచుకున్నది చెప్పేస్తున్నాను..." అతడు కొద్దిసెకన్లు మౌనంగా ఉండి, ఆమెనుంచి రెస్పాన్స్ లేకపోవడంతో చివరికి చెప్పాడు "కీర్తీ! మనం చాలా రోజుల తర్వాత మళ్ళీ కలిసి బయటికి వెళ్ళబోతున్నామోయ్! రేపు ఓ స్టార్ హాస్పిటల్ ప్రారంభోత్సవం ఉంది. ఆ హాస్పిటల్‌కి సూపరింటెండెంట్ డాక్టర్‌గా వెళ్ళబోయే వ్యక్తి నాకు క్లోజ్ ఫ్రెండ్! తనీ రోజు హాస్పిటల్‌కి వచ్చి ఇన్విటేషన్ ఇచ్చి ప్రారంభోత్సవానికి, ఆ తర్వాత రాత్రి ఫంక్షన్‌కీ తప్పక రమ్మని బలవంతపెట్టి వెళ్ళాడు!... సో! రేపు మనిద్దరం కలిసి బయటకు వెళ్ళబోతున్నాం..."

అప్పుడు తలతిప్పి చూసిందామె. చాలా కాలం తర్వాత బయట ప్రపంచంలోకి వెళ్ళడం రొటీన్ లైఫ్‌లోంచి కాస్త బయటపడడంగానే భావించింది. అంతే తప్ప మర్నాడు జరగబోయే ఫంక్షన్‌కు హాజరుకావడమే తన జీవితంలో ఒక ముఖ్యమైన మలుపుకు కారణం అవుతుందని ఆ క్షణం ఆమెకు తెలియదు.

ఆమె తనవైపు చూడడంతో సతీష్ ముఖం విప్పారింది.

"థాంక్యూ... థాంక్యూ కీర్తీ" అన్నాడు ఆమాత్రానికే అతడు సంతోషపడిపోతూ.

ఒకప్పుడు ఇంట్లోకి వస్తూనే అరుపులతో, కేకలతో భయపెట్టిన వాడు ఈ మధ్య పిల్లిలా వచ్చి మచ్చిక చేసుకునేలా మాట్లాడడం కీర్తికి అప్పుడప్పుడూ నవ్వు తెప్పిస్తోంది. కేవలం... కేవలం ఒకే ఒక లోపం మగాడిని ఆడదానికి భయపడేలా చేయడం ఆమెకు ఆశ్చర్యమూ కలిగిస్తోంది.

ఆమెకు అతడిని మరింత బాధపెట్టడం ఇష్టంలేకపోయింది. మరొకవైపుకి ఒత్తిగిలి, అతడి మెడచుట్టూ చేతులేసింది. "ఏదో నీరసంగా ఉండి అలా పడుకుండి పోయానండీ" అంది తనను తాను సమర్థించుకుంటూ.

"ఇట్సాల్ రైట్... ఒకే..." అతడు భుజాలెగరేసాడు. అరనిమిషం తర్వాత అన్నాడు "... నేను కాఫీ తయారు చేస్తాను. మనం కాఫీ తాగుతూ అలా లాన్‌లో కూర్చుందాం"

ఆమె తలాడించింది. ఇద్దరూ బెడ్ రూంలో నుండి బయటికి నడిచారు.

మర్నాడు-

వారిద్దరూ కారులో హాస్పిటల్ ప్రారంభోత్సవానికి వెళ్ళారు.

బంజారా హిల్స్‌లో కొత్తగా కట్టబడిన బిల్డింగ్‌లో, అత్యాధునికమైన ఎక్విప్‌మెంట్‌తో ప్రారంభోత్సవం జరుపుకోబోతోందా హాస్పిటల్.

ఆ హాస్పిటల్ కట్టిన వ్యక్తి డాక్టర్ కాదు. వైద్యశాస్త్రంతో ఆయనకు ఎలాంటి పరిచయమూ లేదు.

ఫైవ్‌స్టార్ హాస్పిటల్ సంస్కృతి మొదలయ్యాక, వైద్యం లాభసాటి వ్యాపారంగా మారింది. డబ్బు పెట్టుబడిగా పెట్టగలిగిన వ్యక్తులు హాస్పిటల్స్‌కి యాజమానులవుతున్నారు. వాళ్ళు బిల్డింగ్ కట్టడం మొదలుకుని, అత్యాధునిక ఎక్విప్‌మెంట్ సేకరించడం, చివరగా కొంతమంది ప్రముఖ డాక్టర్లను ఉద్యోగులుగా చేర్చుకోవడంతో- వైద్య వ్యాపారం మొదలవుతుంది. విద్యా వ్యాపారం తర్వాత వైద్యవ్యాపారమే లాభసాటి వ్యాపారంగా బిజినెస్ వర్గాలు అంగీకరిస్తున్నాయి. అందువల్లే కాబోలు ఈ వ్యాపారంలోనూ పోటీ పెరిగి చివరికి దసరా, దీపావళివంటి పండుగలకు 'ఆపరేషన్స్‌కి డిస్కౌంట్ ఇవ్వడం' వరకూ వ్యవహారం వెళ్ళింది.

హాస్పిటల్ ప్రారంభోత్సవానికి రాష్ట్ర ముఖ్యమంత్రి, గవర్నర్, ఇంకా ఒకరిద్దరు మంత్రులూ, అధికారులు విచ్చేశారు.

ఆ హంగామా చూస్తుంటే కీర్తికి ఏదోలా అనిపించింది. ప్రజలకు వైద్యం చేసి ఆరోగ్యం అందించే హాస్పిటల్ నిర్వహణకు ఇంత పబ్లిసిటీ అవసరమా? ఒకవేళ అవసరమే అనుకుంటే ఈ హంగామాకు అయ్యే ఖర్చు కూడా హాస్పిటల్‌కి వచ్చే రోగి నుండి ఏదో రూపంలో వసూలు చేయడమే జరుగుతుంది కదా? !...

ముఖ్యమంత్రిగారు హాస్పిటల్ బిల్డింగ్‌కి రిబ్బన్ కట్ చేశారు. గవర్నర్ ఆపరేషన్ థియేటర్‌లోని ఇంపోర్టెడ్ ఎక్విప్‌మెంట్ స్విచ్ నొక్కి ప్రారంభోత్సవం చేశారు. అంటే... ఈ హాస్పిటల్‌ని మూడువేల రోగులూ, ఆరువేల ఆపరేషన్స్‌తో వర్ధిల్లమని ఆశీర్వదించారన్నమాట.

ప్రారంభోత్సవ కార్యక్రమం అయిపోయాక, వి.ఐ.పి లంతా వెళ్ళిపోయారు.

అప్పటి వరకూ తమను కేవలం విష్‌చేసి, హడావిడిలో పడిపోయి అటూ ఇటూ తిరుగుతూ ఉండిపోయిన సతీష్ మిత్రుడు వారి దగ్గరకు వచ్చాడు.

"సారీ సతీష్! ప్రముఖులు రావడం అంటేనే టెన్షన్‌తో కూడుకున్న వ్యవహారం. కానీ ప్రముఖులు రాకపోతే ఇలాంటి ప్రారంభోత్సవాలకు కళరాదు"

"యస్... యస్... ఇటీజ్ ట్రూ!" ఒప్పుకుంటున్నట్టు అన్నాడు సతీష్. వెంటనే




"సో...! ఈరోజు నుంచీ నువ్వు డాక్టర్ అనిల్ కుమార్, సూపరింటెండెంట్ ఆఫ్ సర్వోత్తమ హాస్పిటల్స్... అన్నమాట!" నవ్వుతూ అన్నాడు.

అనిల్ కుమార్ భుజాలెగరేశాడు.

అప్పుడు బాయ్ ట్రేలో కూల్ డ్రింక్స్ పట్టుకుని వారి దగ్గరగా వచ్చాడు. "తీసుకోవోయ్" అంటూ అనిల్ కుమార్ ఒకటి తీసి సతీష్‌కి ఇవ్వబోయాడు.

"జస్ట్ ఇప్పుడే తీసుకున్నాం"

"ఫర్వాలేదు. వన్ మోర్... దట్సాల్"

సతీష్‌కి తీసుకోక తప్పలేదు. అనిల్ కుమార్ మరో బాటిల్ తీసి కీర్తికి అందించి, తానొకటి తీసుకున్నాడు.

"చెప్పు!... నువ్వు ఆ హాస్పిటల్ లో రిజైన్ చేసేసి మా హాస్పిటల్ కి ఎప్పుడొస్తున్నావ్? నేను మంచి శాలరీ ఇప్పించడమే కాదు, ఫిజీషియన్ డిపార్ట్‌మెంట్ కి హెడ్‌ని చేస్తాను... ఏమంటావ్? " అడిగాడు సతీష్‌ని.

"ఇప్పుడే చెప్పలేను. అలా అని నీ ఆఫర్‌ని కాదనడంలేదు. నన్ను కాస్త ఆలోచించుకోనివ్వు"అన్నాడు సతీష్.

వారిద్దరి మాటలనిబట్టి అనిల్ కుమార్ చాలారోజులుగా సతీష్‌ని ఈ కొత్త హాస్పిటల్ కి రమ్మంటున్నాడన్న విషయం కీర్తికి అర్థమయింది. అయినా అది తనకు సంబంధించని విషయం కాబట్టి వారిద్దరి మాటలు వింటూ కూల్ డ్రింక్ సిప్ చేయసాగింది.

పదినిమిషాల సేపు వారిద్దరూ హాస్పిటల్ లో ఎక్విప్‌మెంట్ గురించి కొత్తగా వచ్చి జాయిన్ అయిన డాక్టర్ల గురించి మాట్లాడుకుంటూ ఉంటే ఆమె వింటూ ఉండిపోయింది.

అనిల్ కుమార్ మాట్లాడడం అయిపోయినట్టు "ఆల్ రైట్! నాతోరా! మాబాస్‌కి పరిచయం చేస్తాను" అన్నాడు.

"బాస్ అంటే? "

"అదేనోయ్! ఈ హాస్పిటల్ కి పెట్టుబడి పెట్టిన వ్యక్తి"

ప్రాణదాతగా పేరుపొందిన డాక్టర్‌కి పైసలు పెట్టుబడి పెట్టిన వ్యక్తి 'బాస్' కావడం 'దేశానికి పట్టిన దౌర్భాగ్యమేమో' మనసులో అనుకుంది కీర్తి.

సతీష్ అతడి వెంట ముందుకు అడుగు వేయబోతూ ఆగి, "కీర్తి! జస్ట్ ఫైవ్ మినిట్స్ ...వచ్చేస్తాను" అన్నాడు.

ఆమె తలవూపింది. వాళ్ళిద్దరూ విశాలమైన హాలుకు ఓ మూలగా వున్న కేబిన్ వైపు నడిచారు.

కీర్తి ఒకసారి చుట్టూ చూసింది.

అక్కడక్కడా గెస్ట్‌లు గ్రూపులు గ్రూపులుగా నిలబడి మాట్లాడుకుంటున్నారు.

అయినప్పటికీ ఆ విశాలమైన హాల్లో తాను ఒంటరిగా నిలుచుండిపోయిన భావం కలిగిందామెకు. మెల్లగా అడుగులు వేయసాగింది. ఎందుకో తెలియదు గానీ ఆ హాస్పిటల్... స్మశానంలా... కాదు కాదు...ఎలక్ట్రికల్ క్రిమేషన్ రూమ్‌లా అనిపించింది ఆమెకు.

స్మశానం మానవ జీవితానికి ముగింపునిచ్చే చోటు. కాని ఆ ముగింపు మరింత సులువుగా చేసేందుకు వచ్చిన లేటెస్ట్ టెక్నాలజీ- ఎలక్ట్రికల్ క్రిమేషన్... మనిషిలో మారిన విలువలకు, కోల్పోతున్న సెంటిమెంట్స్‌కూ నిదర్శనం ఎలక్ట్రికల్ క్రిమేషన్! అలాగే ఇలాంటి ఫైవ్‌స్టార్ హాస్పిటల్స్‌లో సెంటిమెంట్స్‌కు, మానవత్వానికీ విలువ లేదేమో. మనిషి ఎంత ప్రమాద స్థితిలో ఆ చోటుకు వచ్చినా, ముందు డిపాజిట్ చెల్లిస్తేనే తప్ప డాక్టర్లు ఆ జీవికేసి కూడా చూడరు. మనిషి ప్రాణాలను, డబ్బుతో మాత్రమే కొలిచి చూసే ఈ నాటి వైద్యులు ప్రాణదాతలా? కారు! వాళ్ళు అసలు సిస

లైన వ్యాపారులు. మనిషి ప్రాణాలతో వ్యాపారం చేసే అతి నీచమైన వ్యాపారులు...

తన భర్త కూడా అలాంటి ఓ వ్యాపారి అని గుర్తుకు రావడంతోనే ఆమె మనసులో అగ్గోలాంటి అనీజీనెస్ కదలాడింది. ఈ దేశంలో చాలామంది అమ్మాయిలు డాక్టర్లనో, ఇంజనీర్లనో భర్తలుగా చేసుకోవాలని కలలు కంటుంటారు. కానీ, మెడికల్ ప్రొఫెషన్ అంటే ఒక మనిషి రక్తమాంసాలను పీల్చి పిప్పి చేయవచ్చునన్న నిజం వారిలో ఎంతమందికి తెలుసు? నిజంగా పెళ్ళికి ముందు తనకు తెలియదా? తెలిసి ఉంటే మాత్రం తనేం చేసేది?

ఆమె ఆలోచనలను భగ్నం చేస్తూ ఆమె భుజానికి ఎవరో డాష్ ఇచ్చారు.

చప్పున తలతిప్పి చూసింది.

ముప్ఫయ్యేళ్ళలోపే ఉండొచ్చు అతడికి. కావ్యాలలో మన్మధుడు, జయంతుడు, నలకూబరుడు చాలా అందమైన మగాళ్ళుగా ప్రశస్తి! అతడిని చూస్తే ఆమెకు ఆ ముగ్గురు కావ్యనాయకులూ ఒకేసారి గుర్తొచ్చారు.

అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్న తను ఓ కార్నర్ మలుపు దాటబోతుంటే ఆ కార్నర్‌లోంచి హఠాత్తుగా మలుపు తిరిగి వచ్చాడా యువకుడు. అతడు కావాలని డాష్ ఇవ్వలేదని ఆమెకి స్పష్టంగా అర్థమయింది.

"సారీ! సారీ!" అంటున్నాడతడు కంగారుగా.

"ఇట్సాల్ రైట్" అందామె వెంటనే తేరుకుని.

ఇద్దరూ కుదుటపడ్డాక అతడు పెదవుల మీదకు చిరునవ్వు తెచ్చుకుని "మీరు...?" అన్నాడు ప్రశ్నార్థకంగా చూస్తూ.

"ఐ యామ్ మిసెస్ డాక్టర్ సతీష్... ఆయన ఇప్పుడే ఆ ఛాంబర్‌లోకి వెళ్ళారు. నేను ఆయనకోసం వెయిట్ చేస్తున్నాను"

అతడి ముఖం చూస్తే తన భర్తతో పరిచయం లేనట్టే అనిపించింది.

"అలాగా! అయితే అలా నిలబడడం ఎందుకండీ? ప్లీజ్ బీ సీటెడ్" అంటూ అతడు దూరంగా ఉన్న సోఫా సెట్లను ఆమెకు చూపించాడు.

"ఫరవాలేదండీ! ఆయన వచ్చేస్తారు".

అతడు భుజాలెగరేశాడు. కానీ ఆచోటు నుండి కదిలే ప్రయత్నం చేయలేదు. అతడు ఓరగా తనకేసి చూడడం గమనించింది కీర్తి.

తన అందం మీద ఆమెకు చాలా నమ్మకం. మగవాళ్ళ చూపు తిప్పుకోలేనంత గొప్ప అందం తనదని ఆమెకు తెలుసు. అందువల్లే అతడు తనకేసి అలా కళ్ళార్పకుండా చూస్తుంటే ఆమెకు కోపం రాలేదు. పైపెచ్చు కాసింత గర్వం లాంటిది కలిగింది.

"మే ఐ నో యువర్ గుడ్ నేమ్?" అడిగాడు రవితేజ.

కీర్తి చెప్పింది.

సరిగ్గా అప్పుడే ఛాంబర్ తలుపు తెరుచుకుని అనిల్‌కుమార్, సతీష్‌లు రావడం చూసిందామె.

అనిల్‌కుమార్ దూరం నుండి ఆమె పక్కనే నిలబడి ఉన్న వ్యక్తిని చూసి కోటు సర్దుకుంటూ దగ్గరగా వచ్చాడు. చాలా ఒద్దికగా చెయ్యి ముందుకు సాచి "ఇంతాలస్యంగా వచ్చావేంటి బాబూ" అన్నాడు.

అప్పటి వరకూ కాస్త చిలిపితనం ప్రదర్శించిన అతడు ఒక్కసారిగా హుందాతనం తెచ్చుకుని "ఆలస్యంగా రావడమే నాకిష్టం డాక్టర్! ఎందుకంటే ఆ మినిష్టర్లు, అధికారుల గోల నేను భరించలేను" అన్నాడు.

అప్పుడే సతీష్ అతడి కేసి పరిశీలనగా చూశాడు. అంతలోనే అనిల్ కుమార్ అతడిని పరిచయం చేస్తూ అన్నాడు. "మీట్ మిస్టర్ రవితేజ! మా బాస్ సుపుత్రుడు! సర్వోత్తమ గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీకి ఎం.డి"

సతీష్ చెయ్యి ముందుకు చాపి అతడి చెయ్యిని అందుకున్నాడు. "గ్లాడ్ టు మీట్ యు!"

"ఈయన డాక్టర్ సతీష్! నా ఫ్రెండ్!" అనిల్ కుమార్ చెప్పాడు.

"నైస్ టు మీట్ యు డాక్టర్!" అన్నాడు రవితేజ. వెంటనే అన్నాడు "మీ మిసెస్ కీర్తి ఇప్పుడే పరిచయమయ్యారు. థాంక్యూ ఫర్ యువర్ విజిట్! అన్నట్టు ఈవెనింగ్ డిన్నర్‌ని మీ దంపతులు మిస్ చెయ్యొద్దు! ఓ.కె!" అతడి చూపు మరోసారి కీర్తి మీదకెళ్ళింది.

"థాంక్యూ ఫర్ ది ఇన్విటేషన్" అన్నాడు సతీష్. కీర్తి చిరునవ్వు నవ్వింది.

రవితేజ అనిల్ కుమార్‌ని అడిగాడు "డాడీ ఉన్నారా? "

"ఉన్నారు! ఐ థింక్ హి ఈజ్ వెయిటింగ్ ఫర్ యూ!"

"మే బీ! ఐ మస్ట్ లీవ్!" అంటూ రవితేజ చకచకా తన తండ్రి ఉండే ఛాంబర్ కేసి నడిచాడు.

అనిల్ కుమార్ సతీష్ వైపు తిరిగాడు. "సాయంత్రం డిన్నర్‌కి మీరిద్దరూ తప్పక రావాలోయ్..... మా బాస్‌గారి అబ్బాయి కూడా మిమ్మల్ని అడిగారు కాబట్టి మీరు రాక తప్పదు" అన్నాడు.

"ష్యూర్" చెప్పాడు సతీష్.

ఐదు నిమిషాల తర్వాత వాళ్ళిద్దరూ అతడి దగ్గర శెలవు తీసుకున్నారు.

సాయంత్రం అయిదు గంటలనుంచి దంపతులిద్దరూ డిన్నర్‌కి రెడీకావడం ప్రారంభించారు.

ఈమధ్యకాలంలో మేకప్‌పట్ల అంతగా శ్రద్ధ చూపించలేదు కీర్తి. కానీ ఈరోజు ప్రత్యేకంగా అలంకరించుకోవడం మొదలు పెట్టింది. తనకిష్టమైన లైట్‌గ్రీన్ కలర్ షిఫాన్ చీర కట్టుకుని ఫుల్‌నెక్ జాకెట్ వేసుకుంది. జుట్టు క్లిప్ వేసి వదిలేసింది. ఈమధ్యకాలంలో ముట్టడం మానేసిన క్రీములు శరీరానికి పట్టించింది. ఫారిన్ సెంట్ స్ప్రే చేసుకుంది.

బెడ్‌రూమ్‌లో నుండి హాల్లోకి రావడంతోనే ఆమెకేసి కళ్ళింతలు చేసుకుని చూశాడు సతీష్. "వావ్! నా కళ్ళు చెదిరిపోతున్నాయ్ కీర్తీ..." అన్నాడు గాఢంగా నిశ్వసిస్తూ.

ఆమె చిన్నగా నవ్వేసింది.

"... నేను నమ్మలేకపోతున్నాను. నీలో ఎంత మార్పు? ఈమధ్యకాలంలో తల దువ్వుకోవడమే మానేసిన నువ్వు, మిస్ యూనివర్స్ పోటీలకు వెళ్ళేప్పుడు తయారయినంత అందంగా అలంకరించుకుంటే" అతడు కళ్ళు ఎగరేశాడు. "... అసలు నాకీక్షణం ఏమనిపిస్తోందో తెలుసా? ! ఈ పార్టీకి వెళ్ళడం మానేసి నిన్ను బెడ్‌రూంలోకి తీసుకెళ్ళిపోవాలనిపిస్తోంది"

"ఆపని మాత్రం చేయకండి" నవ్వుతూనే అందామె. అదేక్షణం ఆమెకూ ఓ అనుమానం కలిగింది. అయినా తనకీరోజు ఇంత అందంగా తయారవ్వాలన్న కోరిక ఎందుకు కలిగినట్టు?

జవాబు తోచలేదుగానీ, ఆమెకు ఆ క్షణమే కనులముందు రవితేజ రూపం నిలిచింది. మనసులో మెదలాడే భావాలు ఒక్కోసారి తీరికగా తరచి చూసుకుంటే తప్ప అర్థంకావు. ఆమెకూ తన మనసు తనకే అర్థంకానంత గజిబిజిగా అనిపించింది.

"కమాన్" సతీష్‌ముందుకు నడుస్తూ

అన్నాడు. ఆమె అతడిని అనుసరించింది.

కారు ముందుకుపోతూ ఉంటే ఆమె సీట్లో వెనక్కు వాలింది. పార్టీలో రవితేజ తనని పలకరిస్తాడా? అతడితో తనేం మాట్లాడుతుంది?

సతీష్‌కి కీర్తి మనసులో ఆలోచనలు తెలిసే అవకాశమే లేదు. చాలాకాలం తర్వాత ఆమె ముఖంలో సంతోషం చూశాడు తను. ఆమె ఇప్పుడిప్పుడే మామూలు మనిషవుతున్నట్టు అనిపించింది అతనికి. అందుకే కాస్త హుషారుగా ఉన్నాడు.

పది నిమిషాల తర్వాత కారు హాస్పిటల్ ముందు ఆగింది. హాస్పిటల్ టెర్రస్‌మీదనే పార్టీ ఏర్పాటుచేయబడింది. వందకు పైగా కార్లు పార్కింగ్ ప్లేస్‌లో ఆగి ఉన్నాయి.

సతీష్ డ్రైవింగ్ సీట్లోనుండి దిగి, మరోవైపుకు వచ్చి డోర్ తెరిచి పట్టుకుని తమాషాగా నవ్వుతూ చెప్పాడు "దిగండి మేడమ్"

ఆమె అతడికేసి చూసి, పెదవులు బిగపట్టింది. ఎందుకనో తెలియదు, మనసు మధురోహలతో నిండిపోతోంది. తనువు తేలికయిన భావన?

ఇద్దరూ ముందుకు నడిచారు.

హాస్పిటల్‌లో కెళ్ళేసరికి, హాల్లోనే ఎదురయ్యాడు అనిల్‌కుమార్. "హాయ్ సతీష్! వెల్‌కం!" అంటూ కరచాలనం చేసి "పదండి, పైన పార్టీ అరేంజ్ అయింది" అంటూ వాళ్ళని లిఫ్ట్‌వరకూ తీసుకువచ్చి లోపలికి పంపాడు.

లిఫ్ట్‌పైకి వెళుతుంటే ఆమెకు గుండె వేగంగా కొట్టుకుంటున్నట్టుగా అనిపించింది. దానికి కారణమూ అర్థమవుతూనే ఉంది. అతడు రవితేజ... తనకు ఎదురుపడతాడేమోనని!

లిఫ్ట్ టెర్రస్‌మీద ఆగింది. వారిద్దరూ లిఫ్ట్ లోంచి బయటకొచ్చారు.

రెండు వందలకుపైగా అతిథులు గుంపులు గుంపులుగా నిలబడి మాట్లాడుకుంటున్నారు. అందులో పావువంతు స్త్రీలు ఉన్నారు.

సతీష్‌ని చూడగానే ఒకరిద్దరు పలకరింపుగా నవ్వారు. వాళ్ళు అతడికి ప్రొఫెషనల్ ఫ్రెండ్స్ అయివుండొచ్చనిపించింది కీర్తికి. "కూర్చో కీర్తీ. ఇప్పుడే వస్తాను" అన్నాడు సతీష్.

అతడు తనను పలకరించిన వ్యక్తులవైపుగా నడుస్తుంటే ఆమె కళ్ళు రవితేజకోసం చుట్టూ వెతకసాగాయి. ఓమూల ఎవరితోనో మాట్లాడుతున్న తేజాను చూడడంతోనే ఆమె కళ్ళు మిలమిలా మెరిశాయి. గుండెవేగం మరింత పెరిగింది.

'అరె!... అతడిని చూడడంతోనే తనకు... తనకు ఎందుకిలా అవుతోంది?' ఆమె తననుతాను ప్రశ్నించుకుంది. సమాధానం రాలేదు.

ఎవరితోనో మాట్లాడుతున్న తేజ అప్పుడే తల తిప్పాడు. ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. అతడు వాళ్ళకేదో చెప్పి తనవైపే వస్తుండడం గమనించడంతోనే, ఆమెకు శరీరంలోని రక్తమంతా వడివడిగా ప్రవహిస్తున్న అనుభూతి కలిగింది.

తేజ ఆమెదగ్గరగా వచ్చి "హలో మేడమ్" అంటూ విష్ చేశాడు.

"హలో" అంది కీర్తి చిరునవ్వుతో.

"హార్టీ వెల్‌కం టుయూ! మీ వారేరీ?"

"అదిగో! ఇప్పుడే ఆ గ్రూప్‌లో కలిశారు" అటువైపు చూపుతూ చెప్పిందామె.

తేజ అటువైపు చూసి "హాట్ డ్రింక్స్‌లో జాయిన్‌అయ్యారన్నమాట...! ఓ.కే. మీ సంగతేమిటి? కూల్‌డ్రింక్స్ ఆర్ హాట్ డ్రింక్స్?" అడిగాడు.




"కూల్ డ్రింక్స్" చెప్పింది.

అతడు అటూఇటూ హడావుడిగా తిరుగుతున్న కేటరింగ్‌బాయ్‌ని పిలిచాడు. "కూల్ డ్రింక్స్ పట్రా"

మరునిమిషంలో ట్రేలో రకరకాల బాటిల్స్‌వారి ముందు నిలిచాయి.

"ఏం తీసుకుంటారు? థమ్స్అప్... లిమ్కా...?"

"మాజా"

తేజా ఓ మాజా బాటిల్ ఆమెకు అందించి తాను థమ్స్అప్ తీసుకున్నాడు.

"లెటజ్ సిట్ దేర్ అండ్ రిలాక్స్" అంటూ తేజ రంగురంగుల మౌల్డెడ్ ఛైర్స్ అరేంజ్ చేసినవైపు చూపిస్తూ అటు నడిచాడు.

కీర్తికి వెంటనే అడుగు పడలేదు. చుట్టూ చూసింది. ఎవరి గొడవలో వాళ్ళున్నారు. దూరంగా అటు తిరిగి మాట్లాడుతున్న సతీష్ కనిపించాడు. అతడి చేతిలో విస్కీ గ్లాస్ ఉన్నట్లు గమనించింది.

ఆమె తటపటాయించడం చూసి తేజ అన్నాడు "మీవారు హాట్స్‌లో పడిపోయారు. లెట్ హిమ్ ఎంజాయ్! మనం కాసేపు మాట్లాడుకుందాం రండి మేడమ్!"

కీర్తి నడిచింది. ఇద్దరూ ఎదురెదురు కుర్చీల్లో సెటిలయ్యారు.

"మీవారికి మందు రోజూ అలవాటేనా?"

ఆమె తల అడ్డంగా ఊపింది. "లేదండి! ఇదిగో ఇలాంటి పార్టీలప్పుడే కొద్దిగా! అందుకు నేను అభ్యంతరపెట్టను"

అతడు భుజాలెగరేశాడు. "అయినా..." అని ఆగి కాస్త మెల్లగా అన్నాడు "నేను ఓ మాట అంటే మీరేమీ అనుకోరుకదా?"

ఎందుకో తెలియదు... అతడి చూపు, మాట చెప్పేవిధానం వంట్లోని రక్తమంతా వడివడిగా ప్రవహించేలా చేసింది. అతడిప్పుడు తనకేం చెప్పబోతున్నాడు. ఆమె అతి కష్టంమీద పెదవి విప్పి "చెప్పండి" అంది.

"మీవారి స్థానంలో నేను ఉండివుంటే, మిత్రులు ఎంత బలవంతపెట్టినా ఒక్కఅడుగు కూడా అటువేసి ఉండేవాడిని కాదు"

"అదేం?"

"ఇంత సౌందర్యరాశిని ఒక్కక్షణమైనా వదిలి ఉండడానికి నేను ఇష్టపడను కాబట్టి!

ఆ మాటలు పూలచెండుతో గుండెను కొట్టిన అనుభూతిని కలిగించాయి. మనసు పరవశంలో రాగాలు పలికింది. ఆ పరవశం ఆమెను మూగదాన్ని చేస్తే, బరువెక్కిన తల నేలకు వాలింది.

ఆమె తనకేసి సీరియస్‌గా చూడకపోగా సిగ్గులమొగ్గలా మారిపోవడంతో మనసులోని భావం అతడికి అర్థమయినట్టు మరింత రెచ్చిపోయాడు.

"... నేను చెప్పుతున్నది అతిశయోక్తి అని మాత్రం అనుకోకండి. యూ ఆర్ బ్యూటిఫుల్. ఆరోజు మిమ్మల్ని డాష్ ఇచ్చినప్పుడు నా గుండె ఆగింది. నేనింతకాలం ఎదురు చూస్తున్న ఊహాసుందరి మీరేనేమోననిపించింది. కానీ అంతలోనే మీరు మిసెస్ సతీష్ అని తెలియడంతోనే చాలా చాలా డిసప్పాయింట్ అయ్యాను"

ఆమెకు తల ఎత్తాలనిపించలేదు. కానీ అతడి మాటలు వినాలనే అనిపిస్తోంది. ఒకవేళ తను తలెత్తితే అతడు మాట్లాడడం ఆపేస్తాడేమోనన్న భయమూ ఆమెను తలెత్తనివ్వలేదేమో! అయితే అదే సమయంలో మనసు మూలల్లో ఎక్కడో చిన్న అనుమానం. అతడు చెపుతున్నదంతా నిజమేనా? మగాడు ఇలాంటి విషయాలలో నిజం చెప్పడంలేదంటే, అతడు 'కోరిక' ప్రధానంగా అడుగు ముందుకేస్తున్నాడని అనుకోవచ్చు ఒకవేళ అతడు 'కోరిక'తోనే ఇలా ప్రవర్తిస్తూ ఉంటే...?



అతడు చెబుతున్నాడు "... అయినా ఓ స్త్రీని ఇష్టపడడానికి, మనసులో ఆరాధించడానికీ ఏదీ అడ్డుకాదనే నా ఉద్దేశ్యం..."

'బహుశ అతడి స్థితీ, హోదా అతడికి విపరీతమైన ధైర్యాన్ని ఇచ్చి ఉండొచ్చు. ఆ ధైర్యమే అతడిని అంత ఫాస్ట్‌గా మాట్లాడేలా చేస్తుందేమో' ఆమె అతడి ప్రవర్తనని విశ్లేషించేందుకు ప్రయత్నిస్తోంది.

"ఏదేమయినా మీలాంటి గొప్ప సౌందర్యవతి నాకు ఎదురుకావడం నా అదృష్టం!"

'అతడు సిన్సియర్‌గా మాట్లాడుతున్నాడో లేదో తెలియకపోయినా, ఆ మాటలు మాత్రం తనకు ఆనందం కలిగిస్తున్నాయి. అతడి సాన్నిహిత్యాన్ని తాను ఎంజాయ్ చేయగలుగుతోంది. ఈ దగ్గరితనం ఎంత దూరం వెళుతుంది?'

"బైదిబై! మీకు మేరేజై ఎన్నాళ్ళయింది?" అడిగాడు.

"రెండేళ్ళు కావొస్తోంది"

"పిల్లలా?"

"... ..."

"అందుకే మీరింకా వర్జిన్‌లా కనిపిస్తున్నారు"

ఆమె మనసంతా గజిబిజి అయ్యింది. తలెత్తేసరికి దగ్గరలో సతీష్ రావడం కనిపించింది.

రావడంతోనే సతీష్ తేజాని విష్‌చేస్తూ కరచాలనం చేశాడు. "మా కీర్తికి మీరే కంపెనీ ఇచ్చినట్టున్నారే" నవ్వుతూ అన్నాడు. అతడి నోటినుండి విస్కీవాసన గుప్పుమని ముక్కుపుటాలను తాకింది.

తేజ నవ్వి "ఇట్సే ప్లెజర్" అన్నాడు. "ప్లీజ్ బీ సీటెడ్ డాక్టర్" కుర్చీ ఆఫర్ చేశాడు.

సతీష్ కూర్చున్నాక తేజ మాటలు ప్రారంభించాడు. "డాక్టర్‌గా మీ గురించి నేను కొంత విన్నాను. ఈ సిటీలో ఉన్న అతికొద్దిమంది ఫిజిషియన్స్‌లో మీరూ ఒకరని తెలిసింది. మీలాంటి వారి సేవలు మా హాస్పిటల్‌కి ఎంతయినా అవసరం. అందుకే నేను మా సూపరింటెండెంట్ గారికి చెప్పాను. మీకు ఎంత పెద్దమొత్తం ఆఫరిచ్చయినా మన హాస్పిటల్‌కి వచ్చేలా చేయమని. బహుశ ఈ రోజు ఆయన ఈ విషయం మీతో చర్చించవచ్చుననుకుంటాను."

సతీష్‌కి ఛాతీ నాలుగంగుళాలు పెరిగినట్టనిపించింది. అతడు నవ్వి ఊరకుండిపోయాడు.

"మీరు శాలరీ గురించి ఆలోచించకండి. ఇష్టమైతే ఆ హాస్పిటల్‌లో రిజైన్ చేసి రండి. లేదా మా హాస్పిటల్‌కి కన్సల్టెంట్ డాక్టర్‌గా ఉన్నా ఫరవాలేదు... ఎట్ లీస్ట్!"

"మీ ఆఫర్ గురించి ఆలోచిస్తాను"

సతీష్‌తో మాట్లాడుతూ ఉన్నప్పటికీ తేజ తనకేసే ఓరగా చూస్తుండడం కీర్తి గమనిస్తూనే ఉంది.

గెస్ట్‌ల రాక పూర్తికావడంతో బఫే డిన్నర్ మొదలయింది.

ఆ పార్టీలో తామే స్పెషల్ గెస్ట్‌లన్నట్టు తేజ ట్రీట్ చేయడం సతీష్, కీర్తిలకు ఆనందం కలిగించింది.

పార్టీ ముగిశాక వారిద్దరూ కారులో ఇంటివైపు సాగుతున్నప్పుడు సతీష్ గర్వంగా అన్నాడు. "చూశావా కీర్తి! డాక్టర్‌గా నాకెంత గుర్తింపు ఉందో అంత పెద్ద ఇండస్ట్రియలిస్ట్, నాకన్నా పెద్ద వయసున్న డాక్టర్లను, ప్రముఖులను వదిలేసి మనచుట్టూనే తిరిగాడు... దటీజ్ సతీష్!"

ఆమె మనసులోనే నవ్వుకుంది. తేజ తమతో అంత క్లోజ్‌గా మూవ్ కావడానికి కారణం సతీష్ తన ప్రొఫెషనే అనుకుంటున్నాడు. కానీ, నిజానికతడు దగ్గరయింది




తన అందానికి ఆకర్షింపబడి మాత్రమే. తన అందం అతడిని పిచ్చివాడిని చేసి వుండొచ్చు!

ఆమె తన మనసులోని భావాలు భర్తకు చెప్పే ప్రయత్నం చేయలేదు. ఎవరి భావాలతో సంబంధం లేకుండా కారుముందుకు పోతూనే ఉంది... కాలగమనంలా.



సతీష్ హాస్పిటల్‌కి వెళ్ళిపోయిన అర్ధగంట తర్వాత హాలులో ఫోన్ మోగుతూ ఉంటే కీర్తి రిసీవ్ చేసుకుంది.

"హలో"

"హలో... మేడమ్... నమస్తే! నేను తేజాను మాట్లాడుతున్నాను. డాక్టర్‌గారున్నారా? "

ఆమెలో ఏదో సంచలనం-

కంట్రోల్ చేసుకుంటూ చెప్పింది. "లేరు! ఇప్పుడే హాస్పిటల్‌కి వెళ్ళారు. ఆయనకు ఏదయినా చెప్పాలా? "

"డాక్టర్‌గారికి కాదు... మీకే చెప్పాలి"

"నాకా? ... ఏమిటది? " తన గొంతు తనకే కొత్తగా అనిపించింది.

"ఐ వుడ్ లైక్ టు ప్రజెంట్ ఎ బ్యూటిఫుల్ గిఫ్ట్ ఫర్ యూ!"

"ఎ... ఎం... ఎందు... ఏమిటది? " ఆమె తడబడింది.

"వెయిట్ ఫర్ ది సర్‌ప్రైజ్! కాసేపట్లో మీ ఇంటికి వచ్చి అందించబోతున్నాను. మే ఐ కమ్!" అడిగాడు.

ఏం చెప్పాలో అర్థం కాలేదు కీర్తికి. ఆమెకు గొంతు పెగలడం కష్టమే అయింది. కానీ తన ప్రమేయం లేకుండానే మాట బయటపడింది. "రండి!"

"థాంక్యూ... థాంక్యూ మేడమ్" అవతలి వైపు రిసీవర్ పెట్టేశాడు తేజా.

ఆమె చప్పున సోఫాలో కూలబడింది. అప్పటివరకూ పనిచేయడం ఆగిపోయిన మెదడు అప్పుడే పనిచేయడం మొదలెట్టిందేమో... ఆమెకు చాలా ఆశ్చర్యంగా అనిపించింది. 'రండి' అని ఆహ్వానించింది తనేనా? ఓ పరాయి మొగాడు ఏదో కాస్త పరిచయాన్ని పురస్కరించుకుని గిఫ్ట్ ప్రజంట్ చేస్తానంటే 'సరే' అనేయడమేనా? ఏమిటిది? అతడి సమక్షంలో తను విచక్షణారహితంగా ప్రవర్తిస్తోంది ఎందుకని?

ఇంటిముందు కారు ఆగిన శబ్దం... ఆమె గుండె శబ్దం ఆమెకే వినిపిస్తోంది.

అడుగులచప్పుడు దగ్గరవుతోంది... ఆమె నెమ్మదిగా సోఫాలో నుండి లేచి, అటువైపు తిరిగింది.

తేజా లోపలికొస్తూ ఉన్నాడు. అతడి చేతిలో గిఫ్ట్‌ప్యాక్ లాంటిది ఉంది.

"నమస్తే మేడమ్"

ఆమెకూ చేతులు జోడించక తప్పలేదు.

"కూర్చోండి" సోఫా చూపించింది.

తేజా సోఫాలో కూర్చోలేదు. ఆమెకు అడుగుదూరంలో నిలబడి చెప్పాడు "కూర్చునేందుకు రాలేదు. ఈ బహుమతి అందించి వెళ్దామని వచ్చాను"

"ఏమిటది? "

"గాగ్రాఛోళీ! మన భారతీయ ఫేమస్

డ్రస్ డిజైనర్ రీతూస్ అమెరికాలో స్టార్ట్ చేసిన ఓ షాపులోనిది. మా ఫ్రెండ్ ఒకడు నిన్ననే అమెరికానుండి వస్తూ పట్టుకొచ్చాడు. ఆ డ్రస్ మీదున్న ఆర్ట్‌వర్క్ అద్భుతంగా ఉంది. అది చూడగానే నాకు చప్పున మీరే గుర్తుకు వచ్చారు. అందుకే నేను మావాడినడిగి ఆ డ్రస్ తీసుకున్నాను"

కీర్తి మౌనంగా ఉండిపోయింది.

"... నేను అనడం కాదుగానీ, ఆ డ్రస్ మీరు ధరిస్తే ఆ డ్రస్‌కే అందం వస్తుంది. రెబెక్కా, వీనస్‌లాంటి సౌందర్యాల స్థాయిలో నిలబడదగినమీ అందం... తొలిసారి చూసినప్పుడే నేను షాక్ తిన్నాను... వాస్తవంలో నేను ప్రపంచంలో చాలా దేశాలు చూశాను. ఎన్నో దేశాల అందగత్తెలతో మాట్లాడాను. కాని... కాని ఏ సౌందర్యవతి కూడా నన్నింతగా ఆకర్షించలేదన్నది నిజం..."

కీర్తి ఏం చెప్పలేకపోతోంది.

"ఈ డ్రస్‌లో మీరు... ఎలా ఉంటారో చూడాలన్న కోరిక... ఎందుకో ఆ కోరిక నాలో బలంగా ఏర్పడిపోయింది"

ఆమె కళ్ళెత్తి అతడి కళ్ళలోకి చూసింది.

అతడు కొద్దిగా తడబడ్డాడు "మీకు ఇబ్బందిగా అనిపిస్తే వద్దులెండి. కాని... నా కోరిక తీరుస్తానని అంటే మాత్రం రెండుని మిషాలు కూర్చుంటాను. లేకపోతే వెళ్ళిపోతాను"

ఆమె పెదవులు బిగబట్టింది. క్షణాలు ఇద్దరిమధ్య ఇబ్బందిగా దొర్లిపోసాగాయి. చివరికి ఆమె ఓ నిర్ణయానికి వచ్చినట్టు "కూర్చోండి" అంది.

ఓ మెరుపు అతడి ముఖంలో కదలాడి మాయమైంది. అతడు సోఫాలో కూర్చున్నాడు.

ఆమె ప్యాకెట్ పట్టుకుని లోపలికెళ్ళింది.





మరునిమిషంలోనే బెడ్‌రూమ్ తలుపులు మూసుకుపోయాయి.

అతడు కింద పెదవి పై పంట నొక్కుకుంటూ, కన్నార్పకుండా ఆ తలుపులకేసే చూస్తున్నాడు.

ఒకటి... రెండు... మూడు... పదినిముషాలు గడిచాయి.

తలుపులు తెరుచుకున్నాయి. కీర్తి గ్రాగ్రా ధోళీలో బయటకు వచ్చింది.

అతడు కలలోకి జారిపోయినట్టు, అచేతనంగా అలాగే ఉండిపోయాడు. రెప్పవాల్చడం మర్చిపోయినట్టు అటే చూస్తున్నాడు.

అతడి స్థితి గమనించినట్టు, ఆమె పెదాలమీద చిరునవ్వు ఉదయించింది. ఆమె మెల్లగా నడుచుకుంటూ అతడికి దగ్గరగా నడిచి అడుగు దూరంలో నిలబడింది.

అప్పుడు... అప్పుడు కదిలాడు అతడు.

సుడిగాలిలా ఆమెను చుట్టేసాడు.

కొద్దిక్షణాల వరకూ తనకేమయిందో ఆమెకు అర్థంకాలేదు. అర్థమయ్యేసరికి తను అతడి కౌగిలిలో ఉంది. అతడు తనని ముద్దులతో తడిపేస్తున్నాడు. పిచ్చిపట్టినవాడిలా రెచ్చిపోతున్నాడు.

ఆమెకు అతడిని విదిలించి, దూరంగా జరగాలనిపించింది. కానీ అలా చేయలేకపోయింది. ఆమెలో ఎక్కడో దాగిన చిన్న ఆశ... చిన్నఆశ... ఆమె అతడికి లొంగిపోయేలా చేసిందేమో!

ఓ పక్క మనసు హెచ్చరిస్తోంది. తరువాత ఎదురవబోయే పరిస్థితుల గురించి ఊహలు కలుగుతున్నాయి.

అయినా ఏదో మొండిధైర్యం ఆవహించింది.

ఎలాంటి పరిస్థితులు ఎదురైనా ఎదిరించేందుకు తననుతాను సిద్ధంచేసుకొంటుంది.

అదే మాతృత్వం అనే అనుభవాన్ని బలంగా వాంఛించే స్త్రీ నిర్ణయానికి పరాకా

ష్టస్థితి.



దృశ్యాలు అదృశ్యమయ్యాయి.

కీర్తి మనసంతా వాసిలేటింగ్‌గా తయారయింది. ఎంతయినా తప్పు తప్పే! ఆ తప్పు తాలూకూ బాధ ఏమూలో కాస్త ముల్లులా గుచ్చుకుంటూనే ఉంటుంది.

ఆమె బెడ్‌మీదనుండి పైకిలేవాలని ప్రయత్నించబోతే తేజ మరింత గట్టిగా హత్తుకుంటూ "ఎక్కడికీ?" అన్నాడు నిద్రమత్తులోనే.

"సతీష్ డ్యూటీ పన్నెండు వరకే! తను వచ్చేసే టైమయింది. నేను వెళ్లాలి" చెప్పిందామె.

"వస్తే వచ్చాడులే కీర్తి! ఏదో చెప్పేసెయ్యి" అతడు కళ్ళు తెరిచాడు.

"ఏం చెప్పను?"

"ఓ ఫ్రెండ్ ఇంటికి వస్తే వెళ్ళానని, తను రాత్రికి ఉండమని బలవంతపెడుతోందనీ, రాత్రికి ఉండిపోవలసి వస్తుందని ఫోన్ చేసి చెప్పెయ్యి"

ఆమె నవ్వింది. 'ఈ మగాళ్లు తమకోరిక తీరడం కోసం ఎంత సులభంగా మాటలు చెప్పేయగలరు? సతీష్‌కి అలా ఫోన్ చేసి చెప్పడం తనవల్ల జరిగేపనేనా?'

"లేదు తేజా! నేను వెళ్ళాలి"

ఆమె అతడి చెయ్యి తొలగించుకుని బెడ్ దిగింది. పక్కనే పడివున్న దుస్తుల్ని అందుకుంది.

అతడూ లేచి బెడ్‌మీదనే కూర్చున్నాడు.

ఆమె బట్టలు కట్టుకోవడం పూర్తయ్యాక, అతడివైపు తిరిగి చెప్పింది. "నేను వెళ్తాను"

అతడి ముఖంలో నిరాశ! కాని... కాని... దాన్ని తను పట్టించుకుంటే కష్టం. రేపో మాపో సతీష్‌కి ఈ విషయం తెలియక పోదు. కానీ ఇప్పుడే తెలిసేలా చేసి కష్టాలకు శ్రీకారం చుట్టడం ఎందుకు?

ఆమె హేండ్‌బ్యాగ్ అందుకుని బయటకు నడిచింది.

ఆరోజు అతడిచ్చిన గిఫ్ట్‌తో లొంగిపోయిన తను ఆ తర్వాతయినా తప్పు తెలుసుకుని తేజాతో సంబంధం తెంచుకోవచ్చుకదా? అలా చేయలేకపోయింది. తనలో అంతర్గతంగా పెరిగిపోతున్న ఓ కోరిక ఆ సంబంధాన్ని ఇప్పటివరకూ కొనసాగేలా చేస్తోంది. ఓ పసికందు తన కడుపులో రూపం దాల్చే వరకూ ఈ సంబంధం కొనసాగించి తీరుతుంది. ఎవరేమనుకున్నా... ఏదేమైనా తనకూ ఓ బిడ్డ కావాలి.

ఈ పవిత్ర భారతదేశంలో 'నిజాలు' బయటకు రావడం లేదుగానీ తనలా ఆలోచించే స్త్రీలు ఎంతో కొంతమంది ఉన్నారన్న సత్యం కీర్తికి తెలుసు.

ఇంటిముందు కారు ఆగింది.

తన కోసం ఎవరొచ్చారో అనుకుంటూ హాల్లోనుండి తొంగిచూసిన సతీష్‌కి కారులో నుండి దిగుతున్న కీర్తి కనిపించింది. అతడి భృకుటి ముడివడింది. ఈమధ్యకాలంలో కీర్తి తరచుగా ఇంట్లోనుండి ఏదో సాకుతో బయటకెళుతూ ఉంది. అప్పుడప్పుడూ ఆలస్యంగా ఇంటికి చేరుతుంది. ఆమె ప్రవర్తనలోను మార్పు స్పష్టంగా కనిపిస్తోంది. తన గురించి పట్టించుకోవడం మానేసింది. ఏదయినా అడిగితే విసుక్కోవడమో సమాధానం చెప్పకుండా దాటవేయడమో చేస్తోంది. ఆమె ఎందుకిలా ప్రవర్తిస్తోంది?

అతడు కళ్ళింతలు చేసుకుని అటే చూడసాగాడు. కారులోనుండి కిందికి దిగిన కీర్తి ఫ్రంట్‌డోర్‌లోనుండి తల లోపల పెట్టింది. ఆమె నవ్వుతోందేమో, తనువంతా కదిలిపోతోంది. ఆమె అంతలా నవ్వుతూ ఎవరితో మాట్లాడుతోంది...?

మాటలు పూర్తయ్యాయేమో... కీర్తి పక్కకు జరిగి చెయ్యి ఊపింది. కారు ముందుకు కదిలింది. అప్పుడు ...అప్పుడు కనిపించాడు కారులో ఉన్న ఆ వ్యక్తి. ఎవరో పాతికేళ్ళ కుర్రాడు. తనకు పరిచయం లేని యువకుడు... ఎవరతడు?

కారు వీధిమలుపు తిరిగేంతవరకూ చెయ్యి ఊపుతూ ఉండిపోయిన కీర్తి, అప్పుడు తలతిప్పుకుని ఇంట్లోకి నడిచింది. హాలులో కొచ్చాకతననైపు చూడకుండానే బెడ్‌రూమ్‌వైపు నడుస్తున్న ఆమెను చూసి మెల్లగా పిలిచాడు అతడు "కీర్తీ"

ఆమె తలతిప్పి అతడికేసి చూసింది "ఏమిటి? "

అతడే ఓ క్షణం తడబడి ఆ తర్వాత మెల్లగానే అడిగాడు. "ఎవరతడు? "

"నా ఫ్రెండ్ అండీ! ఈమధ్యనే పరిచయం అయ్యాడు. ఓసారి ఏమీ తోచక సినిమాకెళితే పక్క సీట్లో కూర్చున్న అతడితో పరిచయం అయింది. సినిమా వదిలేసరికి పరిచయం కాస్తా స్నేహంగా మారింది. అంతే"

అతడు పెదవులు బిగపట్టాడు. ఏదో బాధ నరాలను కోసేస్తున్నట్టనిపించింది.

అంతలోనే ఆమే అంది. "నాకు బాగా బడలికగా ఉందండీ. నేను పడుకుంటానూ"

కీర్తి బెడ్‌రూమ్‌వైపు నడిచింది.

అతడికి ఆమె గొంతు పిసికి చంపాలన్నంత కోపం వచ్చింది. ఎంత నిర్లక్ష్యంగా, ఎంత నిర్భయంగా ఆమె ఆ వ్యక్తి గురించి చెబుతోంది? బాయ్‌ఫ్రెండట. సినిమాలో పరిచయమయ్యాడట. ఆ పరిచయం స్నేహంగా మారిందట. అంతలోనే అతడికో అనుమానం వచ్చింది. వారి స్నేహం కలిసి తిరగడం, కారుల్లో డ్రాప్ చేయడంవరకేనా లేక...? ఆ ఊహను కూడా భరించలేనట్టు అతడు పిడికిలి బిగించి గోడకేసి కొట్టాడు.

పదినిమిషాలు అటు ఇటు పచార్లు చేస్తూ తిరిగాక, అతడు డైనింగ్‌టేబుల్ ముందుకు వెళ్ళాడు. హాస్పిటల్‌నుండి ఎనిమిదింటికి వచ్చేటప్పటికే ఆకలిగా ఉంది. ఏదో పనిమీద బయటకెళ్ళి ఉంటుందిలే, కీర్తివచ్చాకే కలిసి భోంచేద్దాంలే అనుకున్నాడు. తీరా కీర్తి వచ్చాక బడలికగా ఉందంటూ లోపలికెళ్ళిపోయింది.

అతడికి ఒంటరిగా భోంచేయాలనిపించలేదు. నెమ్మదిగా బెడ్‌రూమ్‌వైపు అడుగులేశాడు. అటు చూస్తే కీర్తి ముడుచుకుని పడుకుని ఉంది. ఆమెను అలా చూసేసరికి కొద్ది నిమిషాల క్రితం అతడిలో కదలాడిన కోపం కాస్తా మటుమాయమయింది.

ఒకవేళ తను ఆమెను అపార్థం చేసుకుంటున్నాడేమో. తను హాస్పిటల్‌కి వెళ్ళాక లంకంత ఇంట్లో ఆమెకేం తోస్తుంది? అందుకే షాపింగ్‌లకో సినిమాలకో బయటకెళుతూ ఉండొచ్చు. బయటకెళ్ళాక, ఎవరో కుర్రాడు పరిచయం అయివుండొచ్చు. ఆడా మగా స్నేహం అనగానే తను చెడుగానే ఎందుకు ఊహించుకోవాలి?

అదే సమయంలో అతడికి జ్యోతి గుర్తొచ్చింది. తనకు యాక్సిడెంట్ కావడానికి ముందు జ్యోతి తన చిన్ననాటి స్నేహితుడితో కలిసి తిరగడం చూసి ఏడిపించడం గుర్తొచ్చింది. ప్రతి మనిషీ తన తప్పులకు శిక్ష మరో లోకంలో కాదు. ఈ లోకంలోనే అనుభవిస్తాడేమో!

సతీష్ మరో అడుగు ముందుకేసి బెడ్ పక్కనే నిలబడ్డాడు. ఆప్యాయంగా ఆమె భుజంమీద చెయ్యివేసి అన్నాడు. "కీర్తీ! ఎంత బడలికగా ఉన్నా ఆకలితో పడుకోవడం అంత మంచిది కాదు. కాసింత ఎంగిలిపడితే ప్రశాంతంగా నిద్రపోవచ్చు"

ఆమె బద్ధకంగా వెల్లకిలా తిరిగి అతడి ముఖంలోకి చూస్తూ "నేను ఆకలితో పడుకుంటున్నానని ఎందుకనుకుంటున్నారు.

నేనూ ఆకాష్ బ్లూమూన్ రెస్టారెంట్‌లో డిన్నర్ చేసి వచ్చాం. మీకంత నమ్మకం కుదరకపోతే చెయ్యి వాసన చూడండి" ఆమె తన కుడిచెయ్యి అతడి ముక్కు దగ్గర ఉంచింది. బిరియాని వాసన ముక్కుపుటాలను తాకింది.

అప్రయత్నంగానే అతడు ఒక అడుగు వెనక్కివేశాడు. ఆమె ఎప్పటిలానే మరో పక్కకు వత్తిగిలి పడుకుంటూ గొణిగినట్టు అంది. "మీరెళ్ళి భోంచేసేయండి"

అతడికి చాలా నీరసంగా అనిపించింది. అడుగు ముందుకు పడడమూ కష్టమయింది. అతికష్టంమీద హాలులోకొచ్చాడు. డైనింగ్ టేబుల్ ముందున్న కుర్చీలో కూర్చున్నాడు. ప్లేట్ ముందు పెట్టుకుని అన్నం వడ్డించుకున్నాడు. చెయ్యి ప్లేట్‌లో పెట్టబోతుంటే, అతడి కనులముందు జ్యోతి నిలిచింది. నాటి ఆప్యాయతలు దృశ్యాల్లా కళ్లముందు కదలాడాయి. ఆమె ఇంట్లో ఉంటే తను ఇంటికొస్తున్నానని తెలిస్తే ఎంతసేపయినా భోంచేయకుండా ఉండేది. కాని ఒక్కోసారి తనే బయట భోంచేసి వచ్చేసేవాడు. తననుండి ఆ మాట వినడంతోనే ఆమె భోంచేయకుండానే పడక ఎక్కేసేది.

ఆ విషయాలు గుర్తుకు రావడంతోనే గుండెల్లోనుండి బాధ తన్నుకొచ్చింది. అన్నం తినాలనిపించలేదు. ప్లేట్‌లో చెయ్యి కడిగి పైకి లేచాడు.

బెడ్‌రూమ్‌లోకెళ్లాక అటుచూస్తే, కీర్తి ఓ అంచున ముడుచుకుని పడుకునిఉంది. అతడు మరో అంచున నడుం వాల్చాడు. మరోసారి జ్యోతి జ్ఞాపకం వచ్చింది... జ్యోతి ఎంత నిద్రలో ఉన్నా అలికిడయితే చాలు, చప్పున మేలుకునేది. తనను బెడ్ మీద చూస్తే దగ్గరగా జరిగి ఛాతీమీద తల పెట్టుకుని ప్రశాంతంగా నిద్రపోయేది.

అతని ఆలోచనలను భంగం చేస్తూ అప్పుడే ఫోన్ మోగింది. అతడు లేచివెళ్ళి రిసీవర్ చెవి దగ్గర ఉంచుకుని "హలో" అన్నాడు.

అతడి గొంతు చాలా బలహీనంగా ఉండడం ఫోన్‌లోనే జ్యోతి గమనించింది.

"హలో సతీష్! నేను... జ్యోతిని మాట్లాడుతున్నా"

ఒక్కక్షణం అతడు షాకయ్యాడు. అతడి నోట్లోంచి మాట వచ్చేలోపలే జ్యోతి అంది. "నీకో గుడ్‌న్యూస్ సతీష్ సారీ... బ్యాడ్ న్యూస్ అనుకుంటా..."

"ఏమిటది? "

"నేను తల్లిని కాబోతున్నాను"

"వాట్? "

"మరీ అంత ఆశ్చర్యపోకు. నవమాసాలు మోసి కనడం కాదు. గిఫ్ట్ పద్ధతి ద్వారా..."

అవతలివైపు నిశ్శబ్దం.

"డోనర్ ఎవరో కాదులే...నువ్వు అనుమానించిన వ్యక్తే. నా చిన్ననాటి స్నేహితుడు సుధాకర్. చాలా చిత్రంగా లేదూ! మా ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి ఎలాంటి అభిప్రాయముండేదో తెలియదుగానీ, మీరూహించిన సంబంధం మాత్రం ఉండేది కాదు. అలాంటి సంబంధం లేకుండానే నేను బిడ్డను కనడానికి అశక్తురాలయినప్పటికీ 'తల్లి'ని... అదీ సుధాకర్ సహకారంతో తల్లిని కావడం... హేట్సాఫ్ టు సైన్స్ డెవలప్‌మెంట్..."

"కంగ్రాట్యులేషన్స్ జ్యోతి"

"థాంక్స్... కాని కాస్త బాధగానే ఉంది. చాలా రోజుల క్రితం నువ్వీ పద్ధతికి ఒప్పుకుని ఉంటే నీ అంశతో, నా అండంతో మనకో బిడ్డ జన్మించి ఉండేవాడు. నువ్వు ఒప్పుకోలేదు. అప్పుడు మరో పెళ్లి చేసుకోడానికి అదో అవకాశంగా భావించావు. కాని ఇప్పుడు నీ రెండో భార్యకు ఈ పద్ధతి ద్వారా తప్ప మరోవిధంగా బిడ్డలు పుట్టే

అవకాశం లేదు. నీ అంశంతో బిడ్డ పుట్టే ఛాన్స్ ఇకరాదు... చాలా బాధాకరమైన పరిస్థితి కదూ? అయితే ఆడదాన్ని బిడ్డలు కనే యంత్రంలానే చూసే నీలాంటివారికి ఇలాంటి పరిస్థితి ఎదురయితేనే కనువిప్పు కలుగుతుంది. ...గుడ్ బై!" ఆమె ఫోన్ పెట్టేసిన చప్పుడయింది.

సతీష్ కొన్ని క్షణాలపాటు రిసీవర్‌ని అలాగే పట్టుకుని ఉండిపోయాడు. ఆ తరువాత మెల్లగా క్రెడిల్ చేశాడు.

ఒక్కసారిగా అతడికి భోరున ఏడవాలని పించింది.

కానీ... కానీ ఏడుపు రాలేదు.

ఏడ్చినా ప్రయోజనం ఏముంటుంది? చేసిన తప్పుకు శిక్ష అనుభవించి తీరాల్సిందే.

ఆ రాత్రంతా అతడు నిద్రపోలేదు.

అయితే అక్కడ జ్యోతికి మాత్రం ప్రశాంతంగా నిద్రపట్టింది.

ఆ నిద్రలో ఎన్నెన్ని మధుర స్వప్నాలో... తన పక్కలో పడుకుని ఉన్న తన బిడ్డ ఏడ్చినట్టు, తాను సముదాయిస్తున్నట్టు, వాడిని గుండెలకు హత్తుకుని లాలించి జోలపాటతో నిద్రపుచ్చడం... తల్లులందరిలా బిడ్డను చంకనేసుకుని కాసింత గర్వంతో నలుగురిలో తిరగడం...

కన్నెపిల్ల 'రాబోయే భర్త' గురించి కలలు కంటుంది. పెళ్ళయ్యాక ఆడది 'సంతానం' కోసం కలలు కంటుంది.

★ ★ ★

ఆరోజు సాయంత్రం వీలు చిక్కడంతో తిన్నగా ఇంటికి వచ్చేసి "నాగమణీ! ఏం చేస్తున్నావ్?" అంటూ అడిగింది జ్యోతి.

రాత్రి భోజనం కోసం వంట ఏర్పాట్లు చేసుకోబోతున్న నాగమణి అదే విషయం ఆమెతో చెప్పింది.

"ఈ రోజుకి వంటా, గింటా మానేసెయ్యి. మనమంతా ఎగ్జిబిషన్‌కి వెళ్ళి అక్కడినుండి అటే ఏదయినా హోటల్‌కి వెళ్ళి భోంచేసి ఇంటికి చేరుకుందాం"

"మనం సుష్టుగా భోంచేసి ఇంటికి చేరుకుంటాం. కాని మీ ఫ్రెండ్‌కి...?" నవ్వుతూ ప్రశ్నించింది నాగమణి.

"సుధాకర్ ఇంట్లో లేడా?" చుట్టూ చూస్తూ అడిగింది జ్యోతి.

"లేడమ్మా! మురళి ఆఫీసుకు కాబోలు వెళ్ళాడు. ఈమధ్య వారిద్దరూ ఒకరిని వదిలి మరొకరు ఉండడం లేదులే" యశోదమ్మ చెప్పింది అప్పుడే లోపలినుంచి వచ్చి.

"ఫరవాలేదులే ఆంటీ! మీరు కూడా తయారవ్వండి. వచ్చేటప్పుడు తనకోసం హోటల్‌నుండే ఏదయినా పట్టుకొద్దాం"

"వద్దులేమ్మా" అంది యశోదమ్మ.

"మీరు ముందు తయారుకండి" ఆమె మరీ బలవంత పెట్టడంతో వారిద్దరూ తయారుకాక తప్పలేదు.

నాగమణి ముందుగా బాబుకి పౌడర్ రాసి, కొత్త బట్టలు తొడిగింది. హుషారుగా కేరింతలు కొడుతున్న బాబుని జ్యోతి ఎత్తుకుని ఆడించసాగింది.

నాగమణి వైట్ కలర్ బనారస్ శిల్క్‌శారి కట్టుకుంటుంటే ఆమెవైపే చూస్తున్న జ్యోతి అంది. "ఇంతకాలం నేను పరీక్షగా చూడలేదుగానీ, నీ బాడీ మెజర్‌మెంట్స్ చాలా పర్‌ఫెక్ట్‌గా ఉన్నాయి నాగమణీ! నువ్వు చాలా చాలా అందంగా ఉంటావ్ తెలుసా?"

నాగమణి సిగ్గుపడింది. ఆతర్వాత మ్యాచింగ్ జాకెట్ తొడుక్కుంటూ జ్యోతి వైపు చూస్తూ ప్రశ్నించింది. "రాత్రి ఆలోచిస్తుంటే చిన్న అనుమానం వచ్చింది. ఇప్పుడు గిఫ్ట్ పద్ధతిలో పుట్టబోయే పాపకు అండం ఇచ్చిన తల్లిపోలికలు వస్తాయా లేక గర్భాన్ని మోసిన తల్లి పోలికలు వస్తాయా?




"పోలికలంటూ రావడం జరిగితే, అది అందం ఇచ్చిన తల్లి పోలికలే వస్తాయి"

నాగమణి జాకెట్ అంచులను సరిచేసుకున్నాక చెప్పింది. "ఆడపిల్లకు తండ్రి పోలికలు, మగపిల్లాడికి తల్లి పోలికలు వస్తే మంచిదంటారు. తెలుసాక్కా"

"తెలుసు"

"మరి... నీకు మగపిల్లవాడు కావాలా, ఆడపిల్ల కావాలా? "

"నేను ఈ విషయంలో ఎప్పుడో నా అభిప్రాయం చెప్పాను. నాకు ఆడా, మగా తేడా లేదు. ఎవరయినా ఒకటే"

"నాకు మాత్రం ఏమనిపిస్తోందో తెలుసా అక్కా? " జ్యోతి ఆమె ముఖంలోకి చూసింది.

"... మగపిల్లవాడు పుట్టాలనీ, వాడికి నీ పోలికలే రావాలని"

"నా పోలికలే ఎందుకు? " అడిగింది జ్యోతి.

"అదృష్టవంతుడు అవుతాడన్న ఆశ మాత్రమే కాదు. నువ్వు ఎంత అందంగా ఉంటావో, అంత అందమయిన మగపిల్లవాడయితే ఇక వాడి చుట్టూ ఆడపిల్లలే ఆడపిల్లలు. అక్కా! నీ అంత అందమయిన పోలికలున్న మగపిల్లాడిని కనాలని ఉంది నాకు"

జ్యోతికాసింత సిగ్గుపడి వెంటనే తేరుకుని నవ్వేసింది. 'సరేలే! నీ అందం నేనూ, నా అందం నువ్వూ పొగుడుకుంటూ కూర్చుంటే మనమిక ఎగ్జిబిషన్‌కి వెళ్ళినట్టే"

అప్పుడే యశోదమ్మ కూడా తయారయి ఆ గదిలోకి వచ్చింది. జ్యోతి పిల్లవాడిని ఆమెకు అందించింది.

వారు ఇంటికి లాక్‌చేసి బయలుదేరబోతుంటే ఇంటిముందు కారాగింది. సుధాకర్, మురళీ లోపలికొస్తూ కనిపించారు. వారు ఆగిపోయారు.

"ఎక్కడికో బయలుదేరినట్లున్నారు" అడిగాడు సుధాకర్.

జ్యోతి జవాబు చెప్పింది "ఎగ్జిబిషన్‌కి వెళ్తున్నాం. మీరూ రండి"

సుధాకర్ మురళి ముఖంలోకి చూశాడు. మురళి తన అంగీకారం తెలిపాడు. అందరూ గేటు దాటిం తర్వాత మురళి తన కారువైపు నడవబోతుంటే సుధాకర్ అతడి చేతిని పట్టుకుని చెప్పాడు. " ఐదుగురే కదా! ఒక కారు చాలదూ? "

"కరెక్ట్! నా కారులో వెళ్దాం రండి" జ్యోతి పలికింది.

అందరూ ఆమె కారువైపు నడిచారు. జ్యోతి డ్రైవింగ్‌సీట్లో కూర్చున్నాక కారు కదిలింది.

పావుగంట తర్వాత కారు ఎగ్జిబిషన్ గ్రౌండ్ ముందు ఆగింది. నలుగురూ దిగాక ఆమె కారుని పార్కింగ్ ప్లేస్‌లో పెట్టివచ్చింది. అప్పటికే సుధాకర్ టికెట్స్ తీసుకున్నాడు. అందరూ లోపలికి నడిచారు.

సంవత్సరానికి ఒకసారి ఎగ్జిబిషన్ గ్రౌండ్‌లో పెట్టబడే ఆ ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్‌లో అప్పడాల కర్రనుండి ఫ్రిజ్ వరకూ అన్నిరకాల గృహసామాగ్రి దొరుకుతుంది. చాలా పెద్ద ఎగ్జిబిషన్ అది. ఆ ఎగ్జిబిషన్ లోని అన్ని షాపులూ తిరిగి చూడాలంటే ఓ రోజులో అయ్యేపని కాదు.

వారంతా చాలా షాపులు తిరిగి చూశారు. యశోదమ్మ కొన్ని వస్తువులు బేరమాడి మరీ కొన్నది.

చాలా సేపు తిరిగి కాళ్లు నొప్పులు పుట్టాక ఓ క్యాంటీన్ ముందు కూర్చున్నారు. మురళి కూల్‌డ్రింక్స్ తీసుకుని అందరికీ అందించాడు.

కూల్‌డ్రింక్స్ తాగడం పూర్తయ్యాక పైకి లేస్తూ జ్యోతి చెప్పింది. "ఇంకాస్త ముందుకు

వెళితే వెరైటీ బెడ్‌షీట్స్ దొరుకుతాయి"

అంతలో యశోదమ్మ అంది, "ఇక తిర గడం నావల్లకాదు. మీరు తిరిగి రాదలచు కుంటే రండి" ఆమె కాళ్ళు వొత్తుకోవడం మొదలుపెట్టింది. అది చూసి నాగమణి అంది "అక్కా! నేను కూడా కూర్చుంటాను. మీరు వెళ్ళిరండి" అంది. సుధాకర్ కూడా బయలుదేరక పోవడం చూసి మురళి అన్నాడు "సరేరా! నేనూ జ్యోతిగారూ వెళ్ళొస్తాం"

సుధాకర్ తలాడించాడు.

మురళి, జ్యోతి ముందుకి కదిలారు. మురళికి చాలా ఆనందంగా ఉంది. ఆమెతో ఒంటరిగా మాట్లాడాలని ఇందాకటినుంచీ ఎదురుచూస్తున్నాడు. కొద్ది రోజులుగా తన మనసులో మెదలాడుతున్న ఆలోచనలు ఆమెతో చర్చించాలనిపిస్తోంది.

జ్యోతి ముందుగా పిల్లల బొమ్మలు అమ్మే షాపుకి దారితీసింది. బాబు కోసమని నాలు గైదు బొమ్మలు కొన్నది.

"పిల్లలంటే నాకు చాలా ఇష్టమండీ. నాకే గనుక పిల్లలుంటే ఈ షాపులో ఉన్న బొమ్మలు మొత్తం కొనేదాన్ని" చెప్పింది జ్యోతి.

అతడు ఆమెవైపు చిరునవ్వే సమాధా నంగా చూశాడు.

"కాని... నా దురదృష్టం గురించి మీకు తెలుసు. అఫ్ కోర్స్! మీ దురదృష్టం గురించి కూడా నాకు తెలుసు. ఆంటీ ఈ మధ్య చాలాసార్లు మీ గురించే చెప్పి బాధ పడుతోంది. ఆమె మీకో తోడు సంపాదించి పెట్టాలని తపన పడుతోంది..."

మురళి అప్పుడు చెప్పాడు "జ్యోతిగారు! మీరేమీ అనుకోనంటే నేనో విషయం చెప్ప దలచుకున్నాను"

"చెప్పండి"

"ఈమధ్యే నేనో నిర్ణయానికి వచ్చాను. ఇంతకాలం నాకో 'తోడు' కావాలనిపించినా, నా పరిస్థితి నాకు తెలుసు కాబట్టి ఓ ఆడ దాన్ని బాధపెట్టడం ఇష్టంలేక ఆగిపో యాను. కానీ... మనమిద్దరం ఒకే రహదా రిలో పయనిస్తున్న విధి వంచితులం అని తెలిసాక మనమిద్దరం ఎందుకు ఒకటవ్వ కూడదు అనిపించింది"

ఆమె చప్పున తలతిప్పి అతడి కేసి చూసింది. ఆమె చూపులు గమనించడం తోనే అతడు తలతిప్పుకుని- చెప్పదలచుకు న్నది చెప్పాడు.

"...ఆ నిర్ణయం మీమీద జాలితో తీసుకు న్నది కాదు... నేను మనస్ఫూర్తిగా మిమ్మల్ని ఇష్టపడుతున్నాను. నేను టీనేజ్ కుర్రాడిని అయివుంటే 'ఐ లవ్ యూ' అని ఉండేవాడిని. అలా అనలేకపోయినప్పటికీ నా మనసులోని భావం అదే... అయినా మీరిప్పుడే మీ నిర్ణయం చెప్పనవసరంలేదు. ఆలోచించుకోండి.. బాగా ఆలోచించుకు న్నాక, నా గురించి పూర్తిగా తెలుసుకున్నాకే మీ నిర్ణయం నాకు తెలియజేయండి... మీ నిర్ణయం పాజిటివ్ అయితే మాత్రం ఈ ప్రపంచంలో నా అంత అదృష్టవంతుడు మరొకడు లేడనే అనుకుని సంబరపడతాను"

అప్పటికే ఆమె ముఖంలో సిగ్గుతో కూడు కున్న కంగారు మొదలైంది. అతడినుండి అలాంటి ప్రపోజల్ ఆమె ఎక్స్‌పెక్ట్ చేయ లేదు. తనగురించి పూర్తిగా తెలిసిన వ్యక్తి తనతో... 'ఐ లవ్ యూ' అనడంతో ఆమెలో తెలియని ప్రకంపనలు మొదల య్యాయి. ఆ సమయంలో ఓ టీనేజ్ అమ్మాయికి కలిగే ఫీలింగ్స్ తనకు కలగడం ఆమెకు ఆశ్చర్యమనిపించింది.

అయితే... ఆ భావావేశం కొద్దిసేపే. ఆమె అరనిమిషంలో డాక్టర్ జ్యోతిగా మారి పోయింది. అతడికి జవాబు చెప్పకుండా దూరంగా కనిపిస్తున్న రంగులరాట్నం వైపు చూస్తోంది.




మురళి కూడా రెట్టించదలచుకోలేదు. ఆ టాపిక్ అక్కడితో వదిలేస్తున్నట్టు "బాబుకి బట్టలు తీసుకోవాలనుకుంటున్నాను. సెలక్ట్ చేస్తారా? " అడిగాడు.

"పదండి" చెప్పిందామె.

ఎదురుగానే వుంది కిడ్స్ వేర్ షాపు. వారిద్దరూ అటుగా నడిచారు.

ఆమె చూపించిన ఓ డ్రస్ కొన్నాడు అతడు. ఆమె కూడా బాబుకోసం ఓ జత బట్టలు తీసుకుంది.

వారిద్దరూ తిరిగి ఆ చోటుకు వచ్చేసరికి, ఆ ముగ్గురూ రిలాక్సయి కొత్త ఉత్సాహం తెచ్చుకున్నట్టుగా కనిపించారు.

యశోదమ్మ వారి చేతుల్లోని ప్యాకెట్స్ చూసి అడిగింది "ఏమిటమ్మా అవి? ఎగ్జిబిషన్ మొత్తం కొనేసినట్టున్నారు? "

"అన్నీ బాబుకోసమే! బొమ్మలు, డ్రస్సులు" చెప్పింది జ్యోతి.

"ఎందుకర్రా! కావలసినన్ని డ్రస్‌లు ఇంట్లో పడిఉన్నాయి కదా? "

"ఫర్వాలేదులే ఆంటీ"

అందరూ ఎగ్జిబిషన్ గ్రౌండ్‌లో నుండి బయటకు నడిచారు.

"తిన్నగా ఇంటికెళ్దామా? " అడిగింది నాగమణి.

జ్యోతి చెప్పింది "ఇంటికెళ్ళి వంటావార్పులు మొదలు పెట్టడం జరిగేపని కాదు. ఇక్కడికి దగ్గరలోనే 'కామత్' హోటల్ ఉంది. ఎవరికిష్టమైంది వారు తిని, ఇళ్ళకు చేరుకోవడం మంచిది.

మురళి ఆమె ప్రపోజల్‌ని బలపరుస్తూ "కరక్టే" అన్నాడు. మిగిలిన ముగ్గురూ తల లూపారు.

మరో పదినిమిషాల తర్వాత కారు హోటల్ ముందు ఆగింది.

హోటల్‌లో యశోదమ్మ, జ్యోతి టిఫిన్ చేసి సరిపెట్టుకుంటే మిగిలిన ముగ్గురూ భోంచేశారు. బిల్లు మురళి పే చేశాడు.

ఇంటికెళ్ళేసరికి తొమ్మిదయిపోయింది. జ్యోతి కారు దిగకుండానే "వెళ్ళొస్తాను" అంది వారంతా తలలూపారు.

కారు ముందుకు పోతున్నప్పుడు జ్యోతి, మురళి వైపే చూడసాగింది. ఆమె కనుమరుగవుతుండగా, ఆమె పెదాల మీద సన్నటి నవ్వు కదలాడుతున్నట్టు అతడికి తోచింది. తనువంతా జల్లుమంది.

అతడూ ఇంట్లోకి వెళ్ళకుండానే "నేనూ వెళ్ళొస్తాను" అంటూ తన కారువైపు నడిచాడు.

★ ★ ★

ఆ సాయంత్రం సతీష్ హాస్పిటల్ నుండి తిరిగొచ్చేసరికి కీర్తి ఏదో తెలుగు వారపత్రిక చదువుకుంటోంది. తను ఇంటికొచ్చేసరికి ఆమె ఇంట్లోనే ఉండడం అతడికి చాలా సంతోషం కలిగించింది. ఈ మధ్యకాలంలో ఆమె తను వచ్చేసరికి ఇంట్లో ఉండడమే లేదు.

అతడు సంతోషంగా ఆమె పక్కనే కూర్చుంటూ "ఏం చదువుతున్నావ్ కీర్తి" అన్నాడు.

"ఇదిగోండి ఈ పత్రికలో ఓ సెన్సేషనల్ న్యూస్ పబ్లిష్ అయింది చూశారా? " అందామె.

"ఏమిటది? " అతడూ పత్రికలోకి తొంగి చూశాడు.

ఢిల్లీలో నివసించే నిర్మల అనే ఓ పేద ఇల్లాలు సృష్టించిన సరికొత్త సమస్యకు వార్తావిశ్లేషణ అది. ఆమె తన భర్తను భయంకర వ్యాధి నుండి కాపాడుకునేందుకు పిల్లల్ని పోషించుకునేందుకు తను 'అద్దెతల్లి' గా మారుతానంటుంది. అయితే ఆమె ఫెర్టిలిటీ సెంటర్స్‌కి వచ్చి అక్కడ దొరికే

కృత్రిమ వైద్య విధానాల ద్వారా తల్లి కావడాన్ని అంగీకరించడంలేదు. ఆడా మగా సహజసిద్ధంగా కలవడం ద్వారా తల్లి అవడమే తనకిష్టం అంటోంది. ఆమె అలా ప్రకటించడం న్యాయవ్యవస్థకు సంచలనం కలిగించింది. చట్టం దృష్టిలో దంపతులు కాని ఓ ఆడా, మగా కలయిక 'అక్రమ సంబంధం'గా పరిగణించబడుతోంది. కాని ఆమె అది అక్రమసంబంధం కాదంటోంది. ఏ విధానమయితేనేం బిడ్డను కనివ్వడం ఒక 'వృత్తి'అని ఆమె వాదన. ఈ విషయంలో ఆమెను సమర్థించే న్యాయవాదులూ ఉన్నారు. చట్టం కూడా తన ఎదుట నిలిచిన ఈ సరికొత్త సమస్యను అన్నికోణాల నుండి పరిశీలిస్తోంది.

అంతా చదివాక సతీష్ చిన్నగా నిట్టూర్చాడు. "ఒకవేళ చట్టం నిర్మల వాదన తప్పు కాదంటే ఏం జరుగుతుందో తెలుసా కీర్తీ? " ప్రశ్నించాడు.

"ఏం జరుగుతుంది? "

"ఈ దేశంలో ఇప్పుడిప్పుడే వందల సంఖ్యలో పుట్టుకొస్తున్న ఫెర్టిలిటీ సెంటర్స్ క్రమంగా మూతపడిపోతాయి. ఈ ఫెర్టిలిటీ విభాగంలో స్పెషలైజేషన్ చేసిన వందలాది డాక్టర్లు ఉపాధి కోల్పోతారు"

రెండు క్షణాలు మౌనంగా ఉన్నాక కీర్తి అంది "డాక్టర్ల పరిస్థితి మీరనుకున్నంత ఘోరంగా తయారవదనే అనుకుంటున్నాను"

"ఎందుకని? "

"ఈ దేశంలోని ఏ స్త్రీ అయినా తను సంతానవతి కాలేని పరిస్థితిలో ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ ద్వారా మరో ఆడదాని గర్భంలో తన భర్త స్పెర్మ్‌ని ప్రవేశపెట్టడానికే ఇష్టపడుతుంది. అంతే తప్ప మీరిద్దరూ శారీరకంగా కలవండి అంటూ తన భర్తనూ, మరో ఆడదాన్నీ గదిలోకి నెట్టడం చెయ్యదు"

"అదీ నిజమే" వెంటనే అన్నాడు సతీష్.

ఈసారి ఆమె చాలాసేపు నిశ్శబ్దంగా ఉంది. ఆ తర్వాత తల పైకెత్తి సీలింగ్ ఫ్యాన్ వైపు చూస్తూ మంద్రస్థాయిలో పలికింది "అయినా ఆడవాళ్ళయినా- మగవాళ్ళయినా అంత సంకుచితంగా ఆలోచించడం తప్పనే నేననుకుంటున్నానండీ. ఓ మగాడి స్పెర్మ్‌ని స్పెర్మ్ బ్యాంక్ నుండి కొనుక్కుని ఆర్టిఫిషియల్ పద్ధతి ద్వారా గర్భంలో ప్రవేశింపచేసుకోవడానికీ, అదే మగాడితో సహజ పద్ధతుల్లో బిడ్డను కనడానికీ పెద్ద తేడా ఏముంది? కేవలం నరాల రాపిడి తప్ప? ఎలాగూ ఓ పరాయి మగాడి బిడ్డను గర్భంలో మోస్తున్నప్పుడు ఆ వ్యక్తిని శారీరకంగా కలిస్తే తప్పా? మనుషులు ఈ నీతి నియమాల విషయంలో చాలా దారుణంగా ఆత్మవంచన చేసుకుంటూ ఉంటారండీ. పరాయి మగాడి వీర్యం గర్భంలోకి ప్రవేశించి బిడ్డగా రూపుదిద్దుకోవడం తప్పుకాదు- కాని వారిద్దరూ తనువూ తనువూ కలుపుకుని ఆ కార్యానికి బీజం వేస్తే మాత్రం తప్పు అనడం ఎంతవరకూ న్యాయం? ..."

అతడు చప్పున తలతిప్పి భార్యకేసి చూసాడు. కీర్తి... తన భార్య కీర్తేనా ఇలా మాట్లాడేది? ... ఆమెకు ...ఆమెకు తను ఎంత దారుణంగా మాట్లాడుతోందో అర్థమవుతోందా? ఆర్టిఫిషియల్ ఇన్‌సిమినేషన్‌నీ, సహజ సంపర్కాన్నీ ఒకటి గానే పరిగణించడం దారుణం కదూ?

సతీష్ ఆమెకేసి అలా ఆశ్చర్యంగా చూస్తున్నప్పుడే జరిగిందా సంఘటన...! మనిషి జీవితంలోనూ 'మెలో డ్రామా' ఉంటుందన్న సత్యం అతడికి తెలిసిన క్షణం అది.

సోఫాలో కూర్చుని ఉన్న కీర్తి 'వాక్..." అంటూ ఒక్క ఉదుటున లేచి వాష్‌బేసిన్ వైపు పరుగెత్తింది.

అతడు కంగారుపడుతూ ఆమె వెంట





నడిచి, వాష్‌బేసిన్ దగ్గరగా వెళ్ళాడు. ఆమె వాంతి చేసుకుంటూ ఉంటే, భుజంమీద చేయివేసి అడిగాడు. "కీర్తీ... కీర్తీ... ఏమ యిందీ? "

ఆమె జవాబు చెప్పలేదు. వాంతయ్యాక నోరు పుక్కిలించింది. అతడు ఆమెను పట్టుకుని బెడ్‌రూం వైపు నడిపించాడు.

అప్పటికీ అతడికి ఎలాంటి అనుమానమూ లేదు. బహుశ ఏదైనా అనారోగ్యమే మోనని నాడి పట్టుకొని, స్టెత్‌తో, పరీక్షిస్తుంటే అర్థమయింది.

కొద్ది క్షణాల పాటు అతడు షాక్ తిన్నట్టు ఉండిపోయాడు. అతడి ముఖంలోకి చూసిన ఆమెకు విషయం అర్థమైపోయింది. తన తప్పు బయటపడిపోయింది. తను 'గర్భవతి' అన్న విషయం అతడితో పాటు తనకూ ఇప్పుడే... ఇప్పుడే తెలిసింది.

అయితే చిత్రంగా ఆమెకు భయమనిపించలేదు. కాకపోతే భర్తను ఎలా కన్విన్స్ చేయడమా అని ఆలోచించసాగింది.

ఆమె మెల్లగా బెడ్ మీదనుండి పైకి లేచింది. సతీష్ వెనక వైపు చేరుకుని అతడి మెడచుట్టూ చేతులు వేసి ఏమీ ఎరుగని దానిలా చెవి కొరుకుతూ అడిగింది "ఏమండీ! ఎందుకలా షాక్ తిన్నట్టు అయ్యారు? "

అతడు మాట్లాడలేదు. గుండెకు తగిలిన గాయం, అంత త్వరగా గొంతు విప్పేలా చేయలేదేమో!

"చెప్పండి... ఎందుకలా ఉన్నారు? "

అతడు పెదవులు బిగపట్టాడు. మరో సమయంలో అయితే వేగంగా పైకిలేచి ఆమె జుట్టు పట్టుకుని, కిందపడేసి కొట్టి ఉండేవాడు. ఈ కారణం చూపి ఆమెను పుట్టింటికి పంపి, ఆ తర్వాత విడాకులు ఇచ్చేసి ఉండేవాడే!

కాని... కాని ప్రస్తుతం తన పరిస్థితి తన ఆవేశాన్ని అదుపు చేసుకునేలా చేస్తోంది. ఆలోచించి మరీ అడుగు వేయమని చెపుతోంది. అసలే తను మొదటి భార్యకు విడాకులిచ్చేసి ఉన్నాడు. మరి ఇప్పుడు రెండోభార్యకూ విడాకులిచ్చేస్తే లోకం తన గురించి ఏమనుకుంటుంది? అందులోనూ ప్రస్తుతం తనకున్నది భయంకరలోపం. పిల్లలకు తండ్రి కాలేని వాణ్ణి ఏ ఆడపిల్లా పెళ్ళాడాలనుకోదే. అఫ్‌కోర్స్!... తనకున్న లోపం గురించి ఇప్పటి వరకూ లోకానికి తెలియదు. రేపు మరోపెళ్ళి అంటే... 'లోపం బయట పడిపోతుంది.

అంతలోనే ఆమె మరోసారి అంది "చెప్పమంటుంటే... నాకేదో కేన్సర్‌లాంటి భయంకరమైన వ్యాధి బయటపడినట్టు అలా షాక్ తిని ఉండిపోయారేంటండీ? ఒకవేళ నాకు కేన్సర్ అని తెలిస్తే మాత్రం హేపీగా మీకు మరో పెళ్ళి చేస్తాను..."

ఆమె నటిస్తోంది?... నటిస్తోందనే అర్థమయిపోతోంది. కాని నిలదీసి అడిగేందుకు వీలులేని పరిస్థితి తనది. అతడికి ఆ పరిస్థితిలోనూ నవ్వొచ్చింది. 'ఆడవాళ్ళు నటించదలచుకుంటే ఎంత గొప్పగా నటించగలరు? !'

అలా అనుకోవడంతోనే తన మెడచుట్టూ ఉన్న ఆమె చేతుల్ని, భయంకరమైన సర్పాలు చుట్టుకుని ఉన్నట్టుగా ఫీలయ్యాడు. తనువంతా తేళ్ళూ, జెర్రులు పాకినట్టనిపించింది.

"ఏంలేదు కీర్తి" అంటూ అతడు మెల్లగా పైకిలేచి నెమ్మదిగా హాలువైపు అడుగులేశాడు.

ఆమె బెడ్‌రూంలోనే ఉండిపోయింది.

ఉప్పెన ముంచుకొస్తుందేమోనని అనుమానపడింది. కాని కెరటాలు తీరం వరకూ మాత్రమే వచ్చి వెళ్ళిపోవడంతో ఆమె సంబరపడింది.

అంతేకాదు, అదేక్షణం ఆమె ఓ నిర్ణయం తీసుకుంది. ఎట్టి పరిస్థితుల్లోనూ, ఈ ప్రపంచం మొత్తాన్నీ ఎదిరించైనా సరే, తన కడుపులోని బిడ్డకు జన్మనిచ్చి తీరుతుంది తను. ఒక బిడ్డకు తల్లిగా మాతృత్వంలోని మధురానుభూతిని పొంది తీరుతుంది. ఆ విషయంలో ఎన్ని కష్టాలొచ్చినా ఎదుర్కొంటుంది. ఎన్ని నష్టాలొచ్చినా భరిస్తుంది.

మాతృత్వం కోసం ఆడది పడే తపన అది!



"మీరు ఇలాంటి నిర్ణయానికెందుకొచ్చారు?

మురళి తలెత్తి ఆమె ముఖంలోకి చూసాడు. జవాబు మాత్రం చెప్పలేదు.

"నామీద జాలితోనా?" ఈసారి ఆమె కాస్త సన్నగా నవ్వింది. ఆనవ్వు మనోహరంగా ఉంది. కాని అతడు ఆమె నవ్వు పట్టించుకోలేదు.

"నేను మీ మీద జాలిపడడమంటే, నామీద నేను జాలిపడడమే అవుతుంది. ఎందుకంటే నా పరిస్థితి, మీ పరిస్థితికి భిన్నంగా లేదు కాబట్టి"





జ్యోతి ఈసారి మరికాస్త పెద్దగా నవ్వుతూ అడిగింది "పోనీ మీ మీద మీరు జాలిపడుతూ నామీద కూడా జాలిచూపిస్తున్నారేమో"

అతడు చిన్నగా నిట్టూర్చాడు. ఆ తర్వాత తన మనసులోని మాటలన్నీ పేర్చుకున్నట్టు కొద్దిక్షణాలసేపు అరచేతుల వైపు చూసుకున్నాడు.

ఆ ఆలస్యంకూడా భరించలేనట్టు ఆమె "చెప్పండి" అంది. అతడి మనసులోని మాట తెలుసుకోవాలని ఆమెకూ ఉత్సుకతగానే ఉంది.

ఆలోచించుకోవడం పూర్తయినట్టు అతడు చెప్పడం మొదలుపెట్టాడు. "చూడండి జ్యోతిగారూ! నాకు మనసులో మీమీద జాలి ఉంటే ఉండొచ్చు నామీద నేను జాలి పడుతూ ఉన్నా ఆశ్చర్యంలేదు. ఎందుకంటే ఏ వ్యక్తయినా తనకిలాటి దుస్థితి సంభవిస్తే, అందుకు కారణమయిన దేవుని నిందిస్తూ తనను తనే తిట్టుకుంటూ, తన మీద తనే జాలిపడుతూ, తనను తనే ఓదార్చుకోవడం చేస్తుంటాడు. ఇలాంటి దుస్థితిలోకూడా అలా ఎవరైనా చేయలేదంటే వారి మనోనిబ్బరానికి, జీవితం పట్ల వారికి ఉండే డిటాచ్‌మెంట్‌కి చేతులెత్తి నమస్కరించవచ్చు నేను మహర్షులకు మాత్రమే సాధ్యపడే అలాంటి 'డిటాచ్ మెంట్' సాధించలేదు. నాకూ స్పందన ఉంది. సంసారసుఖంలోని అతి మామూలు విషయమైన పిల్లలు, భార్య.. వారితో గడిపే అందమైన సాయంత్రాలు, అనుభూతులతో కూడుకున్న రాత్రులు కావాలని మనసు కోరుకుంటుంది. కాని..మనకు ఆ భగవంతుడు ఇవ్వనిదాన్ని గురించి పరితపించి తనకు దక్కుతున్న ఆనందాన్ని కూడా అనుభవించకుండా, బ్రతుకును బాధామయం చేసుకోవడం నేను అంగీకరించలేకపోయాను. నా ఈ పరిస్థితి కారణంగా మరో ఆడది బ్రతుకులోని చిన్న చిన్న ఆనందాలను ఆస్వాదించలేక పోవడం భరించలే

నని తెలుసుకున్నాకే- పెళ్ళి అనే పదాన్ని నా బ్రతుకు డిక్షనరీలోంచి తొలగించి పారే శాను. ... ముప్ఫయ్ మూడేళ్ళ వయసు వచ్చాక నేను తిరిగి మీముందు 'పెళ్ళి' ప్రపోజల్ పెడుతున్నానంటే, నేను ఓ ఆడ దానికి అన్యాయం చేయడంలేదన్న ఆత్మ సంతృప్తి కారణం కావచ్చు అంతకు మించి మీరు నాకు నచ్చారు. మీ వ్యక్తిత్వం నేను మెచ్చాను. మీలాంటి మనసున్న ఆడదాని తోడు దొరికితే నా భవిష్యత్తు కొంతలో కొంత ఆనందమయ మవుతుందన్న ఆశ నాకు కలిగింది..."

అతడి మనసులోని ఉద్దేశ్యం ఆమెకు అర్థ మయింది. అతడు అంత నిర్మలంగా తన మనసులోని మాట చెప్పడం ఆమెకు నచ్చింది. దేరీజ్ నో హిపోక్రసీ.. ఆమెకు ఇష్టంలేనిది హిపోక్రసీనే. అందుకే అతడు మరింత ఉన్నతంగా కనిపించాడు.

అప్పటికీ ఆమె అన్నది "కానీ...'తోడు' దొరికాక, వృద్ధాప్యంలో ఉండదగిన నీడ కోసం మనిషి ఆరాటపడతాడు కదండీ..." అలా అనడంలో ఆమె ఆలోచన టాపిక్‌ని తనకు కావలసిన వైపుగా తీసుకెళ్ళాలని. ఆమె మనసులో నాగమణి తనకు చేసిన 'ప్రామిస్' గుర్తుంది. అప్పటికే ఆ ప్రయ త్నాలు మొదలయ్యాయి కూడా. మరో సంవత్సరం గడిస్తే తన 'అండం'తో జన్మించిన బిడ్డ తన చేతుల్లో ఉండబో తోంది. ఇప్పుడు ఇతడి ప్రపోజల్ ఆ ప్రయ త్నానికి అడ్డుతగిలితే- అతడి ప్రపోజల్ గురించి అసలు ఆలోచించడమే మానే యడం మంచిది.

స్త్రీకి భర్తమీద ప్రేమ చిన్నగీత అయితే, పిల్లల మీద ప్రేమ పెద్దగీత... బిడ్డకోసం ఆడది అంతగా ఆరాటపడుతుంది. కాబట్టే జ్యోతి ఒకే ఒక నిర్ణయం తీసుకుంది.. నాగ మణి గర్భంలో తనబిడ్డకు జన్మనివ్వడం అతడు అంగీకరించలేనట్లయితే తనకీ తోడు అవసరమేలేదు.

అతడు అన్నాడు. "నిజమే! వృద్ధాప్యంలో సపర్యలు చేసేందుకు ప్రతిజంటకూ బిడ్డలు కావాలి. ఓజంట బిడ్డలని కని వారి ఆలనా పాలనా చూడడంలో ఆనందం ఉంది. అంతకు మించి ఒక రకమైన సెక్యూరిటీ ఫీలింగ్ ఉంది. బహుశ అంతర్గతంగా ఉండే 'ఇన్‌సెక్యూరిటీ ఫీలింగ్'ని పోగొట్టుకో వడం కోసమే మనిషి సంతానం కోసం తపి స్తాడేమో!"

జ్యోతి పలికింది "నేనిప్పుడు 'బిడ్డ' అనే మమకారాన్ని పెంచుకునేందుకు ప్రయత్ని స్తున్నాను. నాకు కొత్తగా ఆ బంధం మొద లుకాబోతోంది."

అతడు అర్థంకానట్టు ఆమెకేసి చూశాడు. ఆమె అర్థమయ్యేలా అతడికి చెప్పింది. గిఫ్ట్ పద్ధతి ద్వారా తన 'అండం' సుధాకర్ వీర్యం టెస్ట్ ట్యూబ్‌లో సంయోగం చెంది, నాగమణి గర్భంలో పిండంగా రూపుదిద్దు కుని, జీవమున్న బిడ్డగా తన చేతుల్లో పడ బోవడం... ఆబిడ్డకు తనే కన్నతల్లి కాబో వడం!

అంతా విన్నాక చాలాసేపటి తర్వాత మురళి చిన్నగా నవ్వాడు. మరేం మాట్లాడ లేదు.

అతడి మౌనం ఆమెకు అనుమానం కలి గించింది. అందుకే చెప్పిందామె "మరో వ్యక్తి 'అంశ'తో పుట్టిన బిడ్డను తన బిడ్డగా చూడడం చాలామంది మగవాళ్ళు భరించ లేని విషయం. అది నాకూ తెలుసు... అందుకే నా నిర్ణయం తెలియచేయబోయే ముందు భవిష్యత్తును మీ ముందు ఉంచి మీ అభిప్రాయాలను తెలుసుకోవడం మంచి దనుకుంటున్నాను. అయితే ఒక్కటి మాత్రం నిజం... నాకు 'పెళ్ళి' కన్నా బిడ్డ ముఖ్యం."

మురళి ఆమె వైపు చూడలేదు. హాస్పి టల్ కన్సల్టింగ్ రూంలోనుండి రోడ్డుమీద

కనిపించే ఆవుదూడను చూస్తున్నాడు. ఆలే గదూడ ఆవు పొదుగును కుమ్ముతూ పాలు తాగుతోంది. తన పొదుగును కుమ్ముతున్న దూడను ఆ ఆవు కోపగించుకోవడం లేదు. ఆప్యాయంగా నాలుకతో తన బిడ్డ శరీరాన్ని నాకుతూ తన తల్లిప్రేమను చూపిస్తోంది. కేవలం మానవుల్లోనే కాదు, సర్వప్రాణు ల్లోనూ ఈ తల్లిప్రేమ సర్వసాధారణమేమో ననిపిస్తుంది. పక్షులు ఎక్కడెక్కడి నుంచో ఆహారం తెచ్చి తమపిల్లలకు పెడతాయి. తన బిడ్డలకు అపాయం తెస్తోందని గ్రహిస్తే ఈ సృష్టిలోని ప్రతీజీవి ఎదుటిజీవి మీద తిరగబడుతుంది. ప్రాణాలకు తెగించి పోరాడుతుంది... మాతృత్వంలోని మమ కారం అంటే ఇదేనేమో!

జ్యోతి అతడి మౌనాన్ని చూసి నవ్వు కుంది. గత కొద్ది కాలంగా అతడు అప్పుడ ప్పుడూ ఫోన్‌లో తన ప్రొపోజల్ గురించి అడుగుతుంటే ఏదో ఒక నిర్ణయంతీసుకుం దామని అతడిని పిలిచింది. తను త్వరలో 'తల్లి' కాబోతున్న విషయం చెబితే అతడు మనసు మార్చుకుంటాడేమోనన్న అను మానం ఆమెలో ఉంది. ఆ అనుమానం నిజం కావాలనే కోరుకుంటోంది. అందుకే ఆమె నవ్వుతూ అడిగింది "ఏమిటాలోచిస్తు న్నారు? ' మీకు మీ తరపు వారినెవర్నైనా దత్తత తీసుకోవాలని ఉందా? అలా అయితే ప్రపోజల్ నుండి డ్రాప్ అవుదాం..."

అతడు అడ్డంగా తలాడించాడు- "నేను పంథొమ్మిదవ శతాబ్దం నాటి మగవాడిని కాను. ఇరవై ఒకటో శతాబ్దంలోనికి ప్రయా ణిస్తున్న వాడిని... మీరు నన్ను అంచనా వేయడంలో విఫలమవుతున్నారు. మీకు పెళ్ళయి కొంతకాలం మరొకరితో కాపురం చేశారని తెలిసినా, మనస్ఫూర్తిగా నా జీవి తంలోనికి ఆహ్వానిస్తున్న వ్యక్తికి కేవలం టెస్ట్‌ట్యూబ్‌ల్లో మరొకరిద్వారా బిడ్డను కంటున్నావన్న కారణంగా మిమ్మల్ని దూరం చేసుకుంటాననుకోవడం మీ భ్రమ..."

ఆమె కుర్చీలో వెనక్కి వాలింది.

"మీకు పుట్టబోతున్న ఆ బిడ్డకు మీరు తల్లి అయితే నేను తండ్రిని. రేపు వాడే మన వారసుడు...!"

జ్యోతి పెదాల మీద చిరునవ్వు కదలా డింది. మురళి మాటలు చాలా స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"ఎన్నో ఏళ్ళ తపన, మరెంతో మానసిక వేదన, ఇతరులనుండి నిరుపయోగమైన సానుభూతి భరించడం ఇవన్నీ జరిగాక, ఇంతకాలానికి సైన్స్ ప్రగతిని ఆధారం చేసు కుని మీరు తల్లి కాబోవడాన్ని నేను మన స్ఫూర్తిగా హర్షిస్తున్నాను. మీ ఆనందంలో పాలు పంచుకోవడమే కాదు, మీ జీవితం లోనూ పాలుపంచుకోవాలని నేను హృద యపూర్వకంగా కోరుకుంటున్నాను..."

ఆమె ముఖంలో అపురూపమైన ఆనందం కదలాడడం గమనించాడు మురళి. తను కూర్చున్న కుర్చీలోనుండి లేచి టేబుల్ మీదకు మెల్లగా ఒరిగాడు.

అతడేం చేయబోతున్నాడో ఆమెకు అర్థం కాలేదు. అర్థమయ్యేసరికి ఆలస్యం జరిగిపో యింది.

అతడు టేబుల్ మీదున్న ఆమె చేతులను మృదువుగా పెదవులతో చుంబించాడు. జరి గిన ఆలస్యం ఆమెకు ఆనందమే కలిగిం చింది. శరీరంలోని నరాలన్నీ జివ్వుమని లాగి వదిలినట్టయింది. మూలపడేసి ఉన్న వీణను శృతి చేసిన అనుభూతి... చాలా కాలం తర్వాత ఆమె ఓ అత్యద్భుత ఆనంద పారవశ్యంతో వివశత్వానికి గురైంది. ఆ తర్వాత అతడికేసి చూడలేని సిగ్గు ముంచుకు రావడం ఆమెకే ఆశ్చర్యమనిపిం చింది.

"థాంక్స్" అతడు ఆమె ముఖంలోనికి చూస్తూ పలికాడు.

"ఎందుకు? " అని ప్రశ్నించే అమాయకత్వం ఆమెలోలేదు.

"వస్తాను" అతడు ఆ గదిలోనుండి వెళ్ళిపోతుంటే తన శరీరంలోనుండి సగభాగం దూరమయిపోతున్న భావం.

అతడు వెళ్ళిపోయాక 'ఈ వయసులో, ఇలాంటి ఫీలింగ్ రావడం ఏమిటి' అని ఆలోచించిందామె. ఓ టీనేజ్ అమ్మాయికి కలిగినట్టు కేవలం పెదవుల స్పర్శతోనే తనకు సిగ్గు, వివశత్వం కలగడం విచిత్రంగా ఉంది అనుకుంది. అయితే ఆలోచించడం మొదలుపెట్టాక, కొద్ది నిముషాల తర్వాత ఆమెకు జవాబు దొరికింది. అది కేవలం స్పర్శ సుఖానందం వలన వచ్చిన వివశత్వం కాదు. అతడు తనను ఓ మనిషిగా గుర్తించాడు. మనసున్న మనిషిగా గుర్తించాడు. పిల్లల్ని కనే యంత్రంలా భావించలేదు. అలాంటి గుర్తింపు ఇచ్చిన వివశత్వం అది. ఎన్నో అనుభవాల తర్వాత, మనిషి రియలైజేషన్‌లో నుండి పుట్టుకొచ్చే ఆ వివశత్వం శాశ్వతమైంది.

★ ★ ★

అది కళ్యాణమండపం కాదు.

రిజిస్ట్రార్ ఆఫీసు

వందమంది బంధువులు ఆహ్వానితులుగా రాలేదు. విందు భోజనాల ఘుమఘుమలు అక్కడలేవు. అసలు ఆచోట పెళ్ళి కళే లేదు.

శంకర్రెడ్డి దంపతులు, మురళి తల్లిదండ్రులు, యశోదమ్మ, సుధాకర్, నాగమణి మరికొంత మంది మిత్రులు... చాలా కొద్ది మంది మాత్రమే వచ్చారు.

మురళి, జ్యోతి సంతకం చేశాక సుధాకర్, మరో మిత్రుడూ సాక్షి సంతకాలు చేశారు.

"మాగల్యం తంతునానేనా, మమజీవన హేతునాం" ... అని పంతులుగారు వేద మంత్రోచ్చాటన చేయలేదు... మంగళ వాయిద్యాల మోత అసలులేదు.

ఆ క్షణం జ్యోతికి తన మొదటి పెళ్ళి గుర్తుకు వచ్చింది. వేద మంత్రాల మధ్య, మంగళ వాయిద్యాల మోతలో వేలాది బంధుమిత్రుల సమక్షంలో రంగరంగ వైభోగంగా జరిగిందా పెళ్ళి. కష్టంలోనూ, సుఖంలోనూ ఒకరినొకరు విడువమని వేదాల సాక్షిగా ప్రమాణం చేసారు. తామిరువురూ అరుంధతిని చూసారు. ఎందరో బంధుమిత్రులు అక్షింతలు చల్లి ఆశీర్వదించారు. సత్యనారాయణ వ్రతం చేసి తమ కాపురం చల్లగా చూడమని ప్రార్థనలు చేశారు. కాని జరిగిందేమిటి? ... మాతృత్వానికి దూరమయిన తను, సంసార జీవితానికీ దూరం కావలసి వచ్చింది...' ఆమెకు నవ్వొచ్చింది. 'ఎంత చిత్రమైనదీ జీవితం!'

మొదటి పెళ్ళి గుర్తొచ్చి మనసు వికలమవుతుంటే ఆమె తన ఆలోచనల్ని డైవర్ట్ చేసుకునేందుకు ప్రయత్నించి సక్సెస్ అయింది. ఆమెకిప్పుడు రిజిస్ట్రార్ ఆఫీసులో నార్మల్‌గా జరుగుతున్న ఆ పెళ్ళి చాలా ఉత్సాహంగా అనిపించింది.

పూలదండలు మార్చుకున్నాక వారిద్దరూ పెద్దల ఆశీర్వాదం తీసుకున్నారు.

సుధాకర్ మురళిని దగ్గరగా తీసుకుని గట్టిగా హత్తుకున్నాడు. ఎందుకో తెలియదు... ఆ క్షణం అతడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అది చూసిన మురళి నవ్వుతూ "ఇదేమిట్రా! ఆనందపడాల్సిన సమయంలో ఈ కన్నీళ్ళు? " అన్నాడు.

"ఇవి ఆనందబాష్పాల్రా" వెంటనే పలికాడు సుధాకర్. "నాకు స్నేహితులయిన మీరిద్దరూ ఇలా ఒకటయ్యి, కొత్త జీవితాన్ని ప్రారంభించడం నాకు చాలా, చాలా ఆనందంగా ఉంది. మీ ఇద్దరి బంధం మన స్నేహబంధాన్ని మరింత గట్టిపడేలా

చేసింది.

"అదేమిట్రా అలా అంటావ్? మన ముగ్గురి మధ్యా స్నేహబంధం మాత్రమే కాదు. అంతకు మించిన బంధం మరోటి ఉంది. అది తెగని సంబంధం"

సుధాకర్‌కి అర్థమయింది. అతడు మురళి చేతిని నొక్కి వదిలాడు.

ఆ రాత్రి-

మురళి జ్యోతిని దగ్గరకు తీసుకుంటూ చెప్పాడు. "ఈ ప్రపంచంలోని చాలా జంటలకు పెళ్ళికి ముందు ఒకరి గురించి మరొకరికి ఏమీ తెలియదు. ఎన్నెన్నో కోరికలతో మరెన్నో ఆశలతో వారు ఒకటవుతారు. తీరా ఒకరి గురించి మరొకరికి కొంత తెలిసాక ఎంతో కొంత అసంతృప్తి మొదలవుతుంది... మనకా దిగులు లేదు. ఒకరి గురించి మరొకరు సంపూర్ణంగా తెలుసుకుని ఒకటవుతున్నాం. మనం మేడ్ ఫర్ ఈచ్ అదర్.."

ఆమె నవ్వుతూ తలాడించింది. అతడి విశాల హృదయానికి చేతులెత్తి నమస్కరించాలనిపించింది. అయితే ఆమెకా అవకాశం ఇవ్వలేదతగాడు. సుడిగాలిలా ఆమెను చుట్టేసాడు...

★ ★ ★

పదినెలల తర్వాత-

కన్సల్టింగ్ రూమ్‌లో కూర్చుని రిలాక్స్‌గా కాఫీ తాగుతుంటే, డాక్టర్ భవాని లోపలికొచ్చింది. ఆమెను పలకరిస్తూ "హలో డాక్టర్" అంది జ్యోతి.

డాక్టర్ భవాని ఆమె ఎదురుగా కూర్చున్నాక "జ్యోతీ! నీకీ విషయం తెలుసా?" అంటూ ముఖంలోనికి చూసింది.

"ఏ విషయం డాక్టర్" కాఫీ కప్పు టేబుల్ మీద పెట్టిందామె.

"డాక్టర్ సతీష్ సూసైడ్ చేసుకున్నాడట"

"వాట్?" ఆమె టేబుల్ మీదకు ఒరిగిపోయి అడిగింది. "ఎప్పుడు?"

"జస్ట్ ఓ గంట క్రితమేనట"

"కారణం?"

"తెలియదు" పెదవి విరిచింది డాక్టర్ భవాని.

జ్యోతి మనసంతా వాసిలేటింగ్‌గా తయారయింది. అతడి మీద ఎంత కోపం ఉన్నా 'పాపం సతీష్' అనుకుంది. ఆ ఇంటికి వెళ్ళాలని లేచింది. అప్పుడే సిస్టర్ వేగంగా లోపలికొస్తూ చెప్పింది. "డాక్టర్! నాగమణిగారికి మళ్ళీ... మళ్ళీ నొప్పులొస్తున్నాయి"

జ్యోతి సతీష్ గురించి మరచిపోతూ థియేటర్ వైపు పరుగెత్తింది.

కొద్ది గంటల క్రితమే పెయిన్స్ ప్రారంభమయి హాస్పిటల్‌కి తీసుకు రాబడిన నాగమణికి అక్కడికి వచ్చాక నొప్పులు ఆగిపోయాయి. డెలివరీ సూచనలు కనిపించకపోవడంతో ఆమెను అక్కడే జాయిన్ చేసింది జ్యోతి.

ఆమె బెడ్ దగ్గరకు వెళ్ళేసరికి నాగమణి నొప్పులతో అరుస్తోంది. ఓ ఆడది అమ్మగా మారడంలో ఎంత వేదన ఉందో ఆ అరుపులు వింటే అర్థమవుతుంది.

'నువ్వు నాకేం చేశావ్' అంటూ తల్లిని ప్రశ్నించే కొడుకులు, ఆ అరుపులు వినగలిగితే బాగుణ్ణు. తన తల్లి తనకు జన్మ నివ్వడానికి ఎంత కష్టపడిందో- ప్రాణాలను తృణప్రాయంగా ఎంచి ఎలా తనను ఈ భూమి మీదకు తెచ్చిందోననే విషయం అర్థమవుతుంది.

రక్తంతో తడిసివున్న ఆ పసికందును చేతుల్లోకి తీసుకుని ఆనందంగా నాగమణి కేసి చూసింది జ్యోతి.

తన బాధ్యత తీరిపోయినట్లు నాగమణి సంతృప్తిగా నవ్వింది.







# చతుర ప్రపంచం

## మంచు కింద మంటలు

**భ**యంకరమైన అగ్నిపర్వతాలమధ్య వుంటూ కూడా తన ప్రాకృతిక రామణీయకత ను నిలుపుకుంటూ ప్రజలు ఆనందంగా బతి కేలా చేస్తున్న అతి చిన్న దేశం ఐస్‌లాండ్. గ్రీన్‌లాండ్ తూర్పుకి దిక్కున, ఉత్తర ధృ వంవద్ద వుందీ ఐస్‌లాండ్. ఉత్తరంనుంచి దక్షిణానికి దీని పొడవు 300 కిలోమీటర్లు. తూర్పునుంచి పశ్చిమానికి దీని వెడల్పు 500 కిలోమీటర్లు. ప్రపంచంలోకెల్ల ఎక్కువ అగ్నిపర్వతాలున్న దీవి ఇదే.

గ్రీన్‌లాండ్‌తో పోలిస్తే ఇక్కడి వాతావ రణం అక్కడున్నంత చల్లగా వుండదు. అయితే ఇది ఐస్‌లాండ్ అని ఎందుకు పిలవబడుతోందీ అంటే కొంతమంది నావి కులు ఐస్‌గడ్డ కట్టివున్నట్టు కనిపిస్తున్న ఈ ప్రదేశాన్ని దూరంనుంచి చూసి దీనికి ఐస్ లాండ్ అని పేరెట్టారంటారు.

ఐస్‌లాండ్ తరచు ప్రకృతి వైపరీత్యాలకు గురవుతూనే వుంటుంది. అగ్నిపర్వతాలు బద్ధలై ఎంతో నష్టాన్ని కలిగిస్తున్నాయి. క్రీ.శ. 1402, 1404 మధ్య ఐస్‌లాండ్ జనాభాలో $^1/_3$ వంతుమంది కరువు కాటకాలకి, అంటు వ్యాధులకి గురై నశించినట్టు తెలుస్తోంది. అగ్నిపర్వతం బద్ధలయినప్పుడు అందు లోంచి ప్రవహించే లావా ఇళ్లని, వ్యవసాయ భూములను ధ్వంసం చేస్తుంది. పొలాలు సారాన్ని కోల్పోతాయి. సల్ఫ్యూరిక్ వాయు వులతో వాతావరణం కలుషితమైపోతూ వుంటుంది. దాంతో చెట్లు, జంతువులు, మనుషులు చిత్ర విచిత్రమైన అంటు వ్యాధు లకు గురౌతారు.

అగ్నిపర్వతం బద్ధలయినపుడు ఆ వేడికి మంచంతా కరిగి వరదలేర్పడతాయి. 1944 జూన్ 17 వరకు ఐస్‌లాండ్ మొదట నార్వే అటుపైన డెన్మార్క్ దేశాల అధీనంలో ఉండేది. దీని ముఖ్య పట్టణం రైక్‌జెవిక్. ఎక్కువ రోడ్లు ఈ ముఖ్య పట్టణంలోనే




కనిపిస్తాయి. నీరు కరిగి ఏరులైపారుతున్నా ఐస్‌లాండ్ మొత్తానికి రెండే ఒంతెనలు న్నాయి. అక్కడి వాతావరణంలో విపరీత మైన తేమవుంటుంది. చమటతో బట్టలు తడిసిపోతూ వుంటాయి. ఆకాశం దట్టమైన మబ్బుతో నిండివున్నా రాత్రి 12 గంటలవ



రకూ సూర్యకాంతి వుంటుంది. ఈ దేశంలో వాటాయనేకుల్ అనే ప్రాంతంలో మంచు రాయిలా గడ్డకట్టి వుంటుంది. అది మామూలు ఉష్ణోగ్రతకు కరగదు. ఈ ప్రదేశం వైశాల్యం 8450 చదరపు కిలోమీటర్లు వుంటుంది. అంటే ఈ ప్రాంతం ఇంచు మించు హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రమంత వుంటుంది. కానీ ఈ మంచుగడ్డ కింద ఎన్నో అగ్ని పర్వతాలున్నాయి. ఎప్పుడయినా ఇవి బద్దలవడం జరిగితే భయంకరమైన వరదలు వస్తాయి. .

ఈ పర్వతాలు బద్దలవుతున్న చప్పుళ్లు వినగానే ప్రజలు తలుపులు, కిటికీలు మూసుకుని లోపల వుండిపోతారు.

అక్కడ హెక్లా అనే అగ్నిపర్వత ప్రాంతం వుంది. అది అంతా గడ్డకట్టి లావాతో నిండి వుంటుంది. 1913, 1947, 1970లలో ఇక్కడ అగ్నిపర్వత విస్ఫోటనలు జరిగాయి. 1970లో జరిగిన ప్రేలుడు దాదాపు రెండు నెలలపాటు కొనసాగింది. ఈ పర్వతాలు

ఎర్రగా వుండి వాటిపై 5 సెం.మీ.ల మందాన లావా చల్లగా గడ్డకట్టి వుంటుంది. పర్వతం పేలినప్పుడు అది కరిగి ప్రవహిస్తుంది. హెక్లా తరవాత కట్లా అనే అగ్నిపర్వతం వుంది. సముద్రమట్టానికి 1000 మీ. ఎత్తులో వుందిది. ఈ పర్వతం 10,000 సంవత్సరాల పురాతన పర్వతం. 16వ శతాబ్దం తర్వాత మాత్రమే దీనిని గుర్తించారు శాస్త్రజ్ఞులు. 1625, 1660, 1721, 1755, 1823, 1860, 1918, 1955 సంవత్సరాలలో ఈ పర్వతంలో విస్ఫోటనలు జరిగాయి. ఈ ప్రాంతం ఎన్నో భూకంపాలకు గురయింది.

ఈ ఐస్‌లాండ్‌లో మొత్తం 45 అగ్ని పర్వతాలున్నాయి. ఇవి పైకి నిశ్శబ్దంగా కనిపించినా ఎప్పుడు పేలతాయో చెప్పడం

కష్టం. ప్రపంచపు అగ్ని పర్వత పంక్తి సరిగ్గా ఐస్‌లాండ్ మధ్యనుంచి పోతుంది. ఈ మధ్యగల పర్వతాలు బద్దలయితే ఐస్‌లాండ్ రెండుగా విడిపోవచ్చు. 1973లో దక్షిణ వెస్ట్‌మానిజర్ ప్రాంతంలో జరిగిన విస్ఫోటనంవల్ల ఒక కొత్త దీవి ఏర్పడింది. దాని పేరు సరాత్సి.

ఐస్‌లాండ్ ప్రజలు నార్వేనుంచి 1100 సంవత్సరాలకు పూర్వం ఇక్కడకు వచ్చి స్థిరపడ్డారు. వాళ్లు చాలా ధైర్యవంతులు, బలవంతులు. అగ్నిపర్వతాలను వీరు దైవంగా కొలుస్తారు. ప్రధాన వృత్తి వ్యవసాయం, పశువుల పెంపకం. నిత్యావసరవస్తువులన్నీ అధిక భాగం దిగుమతి చేసుకుంటారు. ఇల్లు గాజు పలకలతో కట్టుకుంటారు. వీరు రుచికరమయిన టొమాటోలను విస్తారంగా పండిస్తారు.

అక్కడవున్న ఎల్‌థియో లోయ ప్రపంచంలోకెల్ల వింతయినది. దీన్ని కొంత మంది అగ్నిలోయ అంటారు. చిత్రమేమంటే దీని వెడల్పు సంవత్సరానికి 62 సెం.మీ.లు పెరుగుతూ వస్తోందని కనిపెట్టారు శాస్త్రజ్ఞులు.

ఇక్కడి థింగ్ వెలియర్ నగరంలో ప్రజాస్వామ్య పాలనకి చెందిన మొట్టమొదటి పార్లమెంటు ప్రారంభమయింది. అంటే యూరప్ మొత్తంమీద ప్రజాస్వామ్య పద్ధతిలో రాజ్యపాలన జరగడానికి ప్రయోగం ఇక్కడ చేయబడింది. ఇది క్రీ.శ. 930లో జరిగింది. అంటే ఐస్‌లాండ్ చరిత్ర అప్పటినుంచి ఆ నగరం నుంచి ప్రారంభమయిందన్నమాట.

ఐస్‌లాండ్ స్త్రీలు పెళ్లయిన తరువాత పేరును మార్చుకుంటారు. కానీ పుట్టిన పిల్లలకి తల్లి తండ్రిదిగానీ, తండ్రి తండ్రిదిగానీ ఇంటి పేరును కలుపుతారు.




# ఆకు పచ్చ బంగారం

"కాఫీ... మీ ఆత్మని ఉత్తేజపరుస్తుంది.... మీ హృదయాలను తేలికపరుస్తుంది... కీళ్ళ వాతాన్ని తగ్గించి, అరుగుదలకి తోడ్పడు తుంది..." ఇది వంద సంవత్సరాలక్రితం కాఫీకి సంబంధించిన ప్రకటన. అప్పట్లో చాలా దేశాలకి కాఫీతో పరిచయంలేదు. అయితే... ఇప్పుడు కాఫీకి ఎలాంటి పబ్లి సిటీ అవసరంలేదు. ప్రపంచ జనాభాలో సుమారు 3వంతులమంది కాఫీకి బానిసల య్యారంటే అతిశయోక్తిలేదు. కాఫీ నేపథ్యం లోనే రాజకీయ, సామాజిక, కుటుంబచ ర్చలు వగైరాలు జరిగేది.

అసలు కాఫీ మొట్టమొదట ఎక్కడ పుట్టింది? దీన్ని ఓ పానీయంగా ఎవరు గుర్తించారన్న విషయం ఇప్పటికీ వివాదాస్ప దమే. పురాతన సాక్ష్యాధారాలను పరిశీలిస్తే క్రీ.శ. 700లో అరేబియా దేశస్థులు ఈ కాఫీని మందుగా వాడినట్టు తెలుస్తోంది. వారు దానిని 'కహ్వా' అని పిలిచేవారు. వారి భాషలో ఆమాటకర్థం 'శక్తి'అని.

ఇథియోపియాకి సౌత్ వెస్ట్‌లో 'కఫ్కా' అనే ప్రాంతంవుంది. క్రీ.శ. 525లో ఈ కాఫీ మొక్క ఆప్రాంతంలోనే కనుగొనబడిం దని ఓ కథ ప్రచారంలోవుంది. కానీ మరో అరబిక్ కథ ఏం చెబుతోందంటే... క్రీ.పూ. 3వ శతాబ్దంలో తూర్పు అబినీసియాకి చెందిన ఓ పూజారి ఈ కాఫీని తొలుతగా గుర్తించాడని. ఓసారి కొన్ని మేకలు ఓ చెట్టుకాయలు, ఆకులుతిని హుషారుగా గంతులు వెయ్యడం చూశాడతడు. వెంటనే ఆచెట్టు కాయలను, ఆకులను తీసి దాని రసం పిండి తన శిష్యులచేత తాగించగా వారుకూడా ఆనందంగా గంతులు వేయడం ప్రారంభించారు. ఆతరువాత ఆ పూజారి తానుకూడా దాన్ని స్వయంగా తాగి చూసి నరాలకి శక్తిని, కొంచెం మగతని కూడా ఇస్తోందని గ్రహించాడు. అప్పటినుంచి మతపరమైన పనులకు సంబంధించి, రాత్రులు ఎక్కువగా మేలుకుని వుండవల సిన అవసరం పడినపుడు ఆచెట్ల ఆకుల రసాన్ని తాగడం ప్రారంభించాడ తడు. అయితే కొంతమంది దీన్ని మద్యం లాంటి మత్తు పదార్థమని వాదించారు. ఏది ఏమయినా చివరికి అది నరాలను ఉత్తేజపరిచే ఓ మామూలు ద్రవపదార్థంలా అందరూ సేవించడం ప్రారంభించారు. 12వ శతాబ్దంలో కాఫీ ముస్లిందేశాలన్నిటిలో విరివిగా వాడకంలోకి వచ్చింది. 17వ శతా బ్దారంభంలో ఇటలీ, ఫ్రాన్స్, ఇంగ్లండ్‌లలో కాఫీసేవనం ప్రారంభమయింది. అయితే... చాలాకాలంవరకూ కాఫీ సామాన్యమానవు నకు అందుబాటులో వుండేదికాదు. చాలా కాలంవరకు కాఫీ పంట కేవలం అరబ్బుల ఆధీనంలో వుండేది. వాళ్ళు వేయించిన కాఫీ గింజలను మిగిలిన దేశాలకు ఎగుమతిచేసే వారు కానీ, ఒక్కవిత్తనాన్నిగానీ, మొక్కను గానీ తమ దేశందాటి బయటికి వెళ్లనిచ్చేవా రుకాదు.

1690 ప్రాంతాలలో మొత్తంమీద కొంత మంది స్మగ్లింగ్ ద్వారా కాఫీమొక్కలు వేరే దేశాల్లో కూడా పెరిగేలా చేయగలిగారు. గ్రిఫిత్ అనే ఓ బ్రిటిష్ వ్యాపారి మొట్టమొ దటిసారి లండన్‌లో పెట్టిన కాఫీ హౌస్ ఎంతోమంది తాత్వికులు, రచయితలు, కళా కారులకు కూడలి స్థానమయింది. అయితే 1684లో కాఫీహౌస్‌కి వ్యతిరేకంగా ఓ మహిళా ఉద్యమం నడిచింది. తమ భర్తలు తమతోకన్నా కాఫీహౌస్‌లలోనే ఎక్కువ సమయం గడుపుతున్నారనీ, కాబట్టి కాఫీ హౌస్‌లని మూసివేయాలని వారినినాదం. అయితే భర్తలందరూ భార్యలకి వ్యతిరే కంగా కాఫీవలన కలిగిన ప్రయోజనాలపై సెమినార్‌లు నడిపి, విజయం పొందడంతో, కాఫీ హౌస్‌లు దినదినప్రవర్ధమానమ య్యాయి.



ఇంగ్లండులో కొంతమంది 'కాఫీ నల్ల విషం' అని నినదించారు. దానికి వ్యతిరేకంగా ఓ కాఫీవ్యాపారి తన ఫొటోను షాపుల్లో పెట్టి ఫొటోకింద 'కాఫీవల్లనే నేనింత ఆరోగ్యంగా వున్నాను' అని రాయించాడు. అయితే మరోవిచిత్రం ఏమంటే కాఫీ హౌస్‌లన్నీ రాజకీయచర్చలకు ఆలవాలమై ప్రజల్లో విప్లవభావాలను రేకెత్తిస్తున్నాయన్న అపోహతో 1775లో రాజు రెండవ ఛార్లెస్... కాఫీహౌస్‌లన్నీ మూసివేయవలసిందని ఆర్డర్లు జారీ చేశాడు. అయితే ప్రజలనుంచి వచ్చిన ఉప్పెనలాంటి విప్లవం ఆ ఉత్తర్వుని వెనక్కి తీసుకునేలా చేసింది. 18వ శతాబ్దానికి ఇంగ్లండ్‌లో 4వేల కాఫీ హౌస్‌లు వెలిశాయి.

జర్మనీలో అప్పటిరాజు ఫ్రెడరిక్ "స్త్రీలకి కాఫీ హానికరం. కాబట్టి అది వారికి నిషేధం" అని ఓ ఆజ్ఞ జారీ చేశాడు. అయితే మహిళా సంఘాలన్నీకలిసి ఆయన నోరు మూయించాయి.

19వ శతాబ్దంలో వచ్చిన 'టీ'... కాఫీ పరపతిని కొంచెం దెబ్బతీసిందని చెప్పచ్చు. అయితే క్రమేపీ మళ్లీ నిలదొక్కుకుంది. కాఫీ హౌస్‌లలో చిన్నచిన్న చెక్క పెట్టెలను పెట్టేవారు. ఆ పెట్టెలమీద 'టు ఇన్స్యూర్ ప్రామ్ప్ట్‌నెస్' అని రాసివుండేది. విజిటర్ ఆపెట్టెలో ఓ నాణెం వేస్తే ఆ చప్పుడుకి బేరర్ పరుగెత్తుకొచ్చి సగౌరవంగా ఆర్డర్‌లను అందుకునేవాడు. ఆ 'టు ఇన్స్యూర్ ప్రామ్ప్ట్‌నెస్' ఇప్పటికీ 'టిప్'గా వాడుకలోవుంది.

ఇండియాకి ఈ కాఫీ 17వ శతాబ్దంలోకి వచ్చింది. బాబాబూదాన్ అనే ఓ ముస్లిం ఫకీర్ ఓసారి దక్షిణభారతం నుండి తమ తీర్థస్థానమైన మక్కాకి వెళ్ళాడు. అక్కడి నుంచి తిరిగి వచ్చేటప్పుడు 7 కాఫీ విత్తనాలను తనతోకూడా తెచ్చాడు. వాటిని కర్నాటకలో ఓ ఎత్తైన పర్వతప్రాంతంలో, బాగా వర్షం పడేచోట పాతాడు. అదే ప్రప్రథమంగా భారతంలో కాఫీ పంటకు నాంది. ఇప్పటికీ ఆప్రాంతాన్ని 'బాబాబూదాన్‌గిరి' అంటారు.

ప్రస్తుతం కాఫీ ఎగుమతిలో అగ్రస్థానం బ్రెజిల్‌దే. వాళ్లుకాఫీని 'ఆకుపచ్చబంగారం' అని పిలుస్తారు. 1975లో విపరీతంగా కురిసిన మంచువానల కారణంగా బ్రెజిల్‌లోని కాఫీపంటలో మూడింట రెండువంతులు నాశనమయింది. అప్పటినుంచీ కాఫీరేటు




విపరీతంగా పెరిగింది. ప్రస్తుతం ఇండియాలో కాఫీ పంట దిగుబడి సంవత్సరానికి 97000 టన్నులు. 1971,72లలో 110231 టన్నుల కాఫీ పంట పండి రికార్డు సృష్టించింది.

కాఫీని మితిమీరకుండా తాగినంతవరకూ మంచిదేననీ, నరాలకు ఉత్తేజాన్నిస్తుందనీ అంటున్నారు డాక్టర్లు. అయితే రోజుకు 7,8 కప్పుల కాఫీమాత్రం నిద్రలేమిని, హృద్రోగాలను కలిగించడమేకాకుండా సాంసారిక జీవనానికి కూడా హానికలిగిస్తుందంటున్నారు. ఏదయినా 'అతి సర్వత్రవర్జయేత్' అని కదా చెప్పారు పెద్దలు.

# 'ప్రయాణం' పై సమీక్షలు

డిసెంబర్ 'చతుర'లో ప్రచురితమైన ఎ. జయలక్ష్మిరాజు నవల 'ప్రయాణం'పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## సజీవ చిత్రాలు

*(ప్రథమ బహుమతి రు: 100/-పొందిన సమీక్ష)*

ఎ. జయలక్ష్మిరాజుగారి "ప్రయాణం" ఆర్.టి.సి. బస్సులో లేడీ కండక్టర్‌లు ఎదుర్కొనే కష్టనష్టాలనే కాక, స్త్రీ జీవిత ప్రయాణాన్ని, స్త్రీ జీవితంపై పురుషాధిపత్యాన్ని వివరించారు. ఆద్యంతమూ ఆసక్తికరంగా సాగిన కథనంలో ఆధునిక స్త్రీ ధైర్య సాహసాలకు ప్రతీకగా 'సరోజ', కుటుంబ బరువు బాధ్యతలకు, వృత్తిలోని సాధక బాధకాలకూ మధ్య నలిగిపోయిన 'అరవింద', చీకట్లో 'చిరుదివ్వె'ను వెలిగించాలనే 'లీలావతి', జీవితానుభవాన్ని రంగరించి అపర చాణుక్యునిలా మాట్లాడే సీతమ్మ, తోబుట్టువులా అందరికీ సాయపడే 'కావేరి', అన్ని పాత్రలూ నిత్యం

కళ్ళముందు కదలాడే సజీవ చిత్రాల్లా అన్పించాయి.

బాల్యంనుంచీ స్త్రీ పురుష విచక్షణలో పెరిగిన లీల తల్లితండ్రుల పట్ల గల సహజ ప్రేమాభిమానాలను కోల్పోయినా తనవంతు బాధ్యతగా వారికి సాయమందించడం, తనను రాచి రంపానపెట్టి ఇంటినుండి పారిపోయేలా చేసిన అత్తగారు ఆపదలో ఉంటే ఆదుకున్న అరవింద మంచితనం, తమతో కలిసిమెలిసి పనిచేసే లేడీ కండక్టర్లను తోబుట్టువుల్లా చూసే డ్రైవర్ల ఆప్యాయత నానాటికి మృగ్యమైపోతున్న మానవతా విలువలకు ఊపిరిపోశాయి.

పురుషుడి ఆధిక్యత అనే మెట్ల వరుసలో స్త్రీ ఎప్పుడూ అతనికంటే ఓ మెట్టు క్రిందే ఉంటోంది. జీతం, చదువు, హోదా, తెలివి తేటలు ఎందులోనూ తనకంటే అధికురాలయిన భార్యను భర్త అహం అంగీకరించదు. అదే భార్య అన్నిటా తనకన్నా అధికుడయిన భర్తను చూసి మురిసిపోతుంది. స్త్రీ, పురుషుల ఆలోచనా విధానంలోని లోపమే ఇది. భార్యాభర్తలిరువురూ ఉద్యోగం చేసి ఇల్లు చేరితే రాగానే భార్యే కాఫీ తయారుచేసి అందించాలనుకునే మగమహారాజులున్న సమాజం మనది. స్త్రీ, పురుషులిరువురి ఆలోచనా ధోరణి మారాలి. పరస్పరం సహకరించుకుంటూ సహజీవనం సాగించాలి.

పెన్ ఫ్రెండ్స్‌గా దగ్గరైన సారధి, లీలలు వివాహబంధంలో ఒకరవాలనుకోవడం, ఆనందరావు, సరోజల వివాహం, కరుణాకర్, అరవింద అత్తగారు మారిపోవడం ముగింపులో కొంత నాటకీయంగా అన్పించినా మొత్తానికి కథ సుఖాంతం అయిందన్పించింది.

స్త్రీ తనంత తానుగా చైతన్యవంతురాలై, ఆత్మ విశ్వాసంతో, ధైర్యంతో తనపై అడుగడుగునా గల పురుషాధిపత్యాన్ని ఛేదిస్తే తప్ప పురోగమనం అసాధ్యం అన్న విషయం వివరిస్తుందీ నవల. చక్కటి ప్రయాణాన్ని అందించిన జయలక్ష్మిరాజుగారికి, చతురకు అభినందనలు.

**పి. హిమగిరి,**
విశాఖపట్టణం-530 031

## స్త్రీవాద భరితం

*(ద్వితీయ బహుమతి రు: 75/-పొందిన సమీక్ష)*

ప్రయాణం నవలలో ఎక్కువశాతం స్త్రీవాదమే! చేస్తున్న ఉద్యోగం ఎలాంటిదైనా వృత్తిని గౌరవించుకోవాలి. విధికి అంకితమవ్వాలనే హితం చెప్తున్న ఈ నవల రసవత్తరంగానే పయనించింది.

వరుసగా ఆడపిల్లల్ని కని, లేక లేక మగపిల్లాడు పుట్టాడని ఆ పిల్లాడి మీద ప్రేమ, ఆడపిల్లలమీద ద్వేషం చూపే తన తల్లి వింత ధోరణిగురించీ, వేలవికాలం ఆరుబయట పడుకున్నప్పుడు పిల్లల్ని ఎత్తుకుపోయేవారు వస్తున్నారని అమ్మ తమ్ముడ్ని కొంగుకు కట్టుకుని పడుకుంటే- మమ్మల్ని కూడా కట్టుకుని పడుకో, భయమేస్తోందని అన్నప్పుడు "ఆడపిల్లలు మిమ్మల్ని ఎవరెత్తుకెళ్తారు? ఒకవేళ ఎత్తుకుపోతే మాకు ఓ ఏభైవేలు కట్నం ఖర్చు తగ్గుతుంద"నే ధోరణిలో తల్లి మాట్లాడిన తీరు చదువుతున్నప్పుడు హృదయం ద్రవించింది.

"ప్రయాణం" నవలలో లేఖలు రాయడంలోనే ముఖ్యమైన ఘట్టాలు ఒదిగి ఉండటం, ఆ లేఖలు రాసిన తీరు; అందులో కథకు సంబంధించిన ముఖ్య అంశాలు చోటుచేసుకోవడం- వీటిని చదివించే శైలిలో నడిపించడం ప్రసంశనీయం! లీల తల్లి చనిపోయేముందుకూడా- తనను గురించి పట్టించుకోని ఆ కొడుకు దగ్గరకే తనను తీసుకెళ్లమనీ, ఆడపిల్ల చేతుల్లో పోతే నరకానికి పోతాననే భయపడుతుంది. ఆపదల్లో ఆదుకున్న కూతురుకన్నా, మనసులేని కొడుకు చేతుల్లో కన్నుమూస్తేనే తనకు ముక్తి అని నమ్మే వారి మూఢ నమ్మకాల్ని పెంచి




పోషించే సమాజాన్ని ఎత్తి చూపడం అభినందించదగ్గదే-

అరవింద, కరుణాకర్‌ల దాంపత్యజీవితంలో వచ్చిన కలతలకు మూలకారణం కరుణాకర్ తల్లేకావడం- ఆడదానికి ఆడదే శత్రువన్న సామెతను జ్ఞప్తికి తెస్తోంది.

పిల్లలులేని కావేరి, అరవింద పాపను ఎంతో మురిపెంగా చూడటం- ఓరోజు ఆపాపను ముద్దాడుతున్న కావేరిని చూస్తుంటే-లీలకు అయిడియా రావడం, దాని ప్రతిఫలంగా కావేరి చిల్డ్రన్ కేర్ సెంటర్‌ను ప్రారంభించడం అత్యంత సహజంగా వుంది.

స్త్రీలు అన్ని రంగాల్లోనూ, తమ ప్రతిభాపాటవాలతో ప్రవేశిస్తున్నారు. ఆఫీసుల్లో ఫ్యాను కింద కూర్చుని పనిచేస్తున్న ఆడవాళ్లమీద కూడా మగాళ్ల అపార్థపు చూపులు- ఈతముళ్ళలా గుచ్చుకుంటూనే ఉన్నాయి. అలాంటప్పుడు ప్రయాణీకులతోపాటు తానూ ఓ ప్రయాణీకురాలై జీవనయానం సాగించే లేడీ కండక్టర్ దినచర్యలో ఎదురయ్యే సమస్యలెన్నో. వాటిని చక్కగా చిత్రీకరించి, 'చతుర' పాఠకులకందించిన రచయిత్రికి అభినందనలు.

-మోకా రత్నరాజు,

మహారాణిపేట, విశాఖపట్టణం- 530002

మగవాళ్ళకంటే కూడా బాధ్యతగా కర్తవ్య నిర్వహణ చేయగలరని రుజువు చేశారు. ఇంటా బయటా కూడా పనిచేస్తూ పిల్లల్ని చూసుకుంటూ రెండు పడవలమీద ప్రయాణం అన్నట్లుగా వుంది నేటి ఉద్యోగిని అయిన స్త్రీ జీవితం. అందులోనూ అరవింద అత్తగారి లాంటివాళ్ళు కరుణాకర్ లాంటి భర్తవుంటే ఇంకా నరకం. అరవింద పాపతో పాటు ఇంటిని వదిలి వెళ్లటం నవలకి ఊపిరినిచ్చింది. ఏ ఆధారం లేకుండా కూడా ఆడది ఒంటిరిగా జీవితం గడపగలదని నిరూపించింది అరవింద.

ఆడపిల్లల్ని తక్కువగా చూసే వాళ్ళు ఇంకా వున్నారని లీల తల్లిదండ్రులు నిరూపించారు. అహంకారంతో ఆడదానికి ఆడదే శత్రువు అన్నట్లు ప్రవర్తించిన అరవింద అత్తగారు చివరికి ఆడదానికి ఆడదే చేయూతనివ్వాలని గ్రహించింది. కరుణాకర్ కూడా భార్య ఔన్నత్యాన్ని, సహనాన్ని తెలుసుకున్నాడు.

లీల సారథిల లేఖావళి హాస్యాస్పదంగా ఉన్నా కథాపరంగా బావుంది. మొత్తానికి ఈనవల సరదాల 'ప్రయాణం'లా సాగింది.

యన్. ఇందిర

సికింద్రాబాద్-500015

## సరదాల ప్రయాణం

*(తృతీయ బహుమతి రు: 50/-పొందిన సమీక్ష)*

ఎర్రబస్సుల రాకపోకలు, లేడీ కండక్టర్ల పాట్లు, పల్లెటూరి జనంతీరు చక్కగా వర్ణించారు రచయిత్రి ఎ. జయలక్ష్మిరాజు తమ "ప్రయాణం" నవలలో. ఉద్యోగంలో ఆడ, మగ అంటూ తేడా లేదు. ఆత్మవిశ్వాసంతో ఏ ఉద్యోగం చేసినా ఆడవాళ్ళని వేలెత్తిచూపే ధైర్యం ఎవరికీ వుండదు. మనం చేస్తున్న పని తక్కువ, తప్పు అని మనమే అనుకుంటే ఎప్పటికీ ఎదగలేం. అరవింద, లీల, సరోజలు ధైర్యంగా కండక్టరు ఉద్యోగం నిర్వహించి ఆడవాళ్ళు చేయలేనిది ఏదీలేదనీ,

## ప్రయోజనాత్మక నవల

*(నాల్గవ బహుమతి రు: 50/-పొందిన సమీక్ష)*

ఆర్థిక ఇబ్బందులతో నలిగిపోతూ, సంప్రదాయాల ముసుగులో కుళ్ళిపోతూ, సమస్యల సుడిగుండాలలో తలమునకలవుతూ సతమతమవుతోన్న మధ్యతరగతి కుటుంబాలనుండి కొంతమంది మహిళలను తీసుకొని, లేడీకండక్టరు బాధ్యతలతో ముడిపెడుతూ ఆద్యంతం చక్కగా నడిచిన నవల 'ప్రయాణం'.

# ఎక్కవలసిన బస్సు

*(ఐదవ బహుమతి రు: 50/-పొందిన సమీక్ష)*

"ప్రయాణం" లో లేడీ కండక్టర్లు వారి ప్రత్యేక సమస్యలు నేర్పుగా చిత్రీకరించడంలో సఫలీకృతులైన రచయిత్రిగారు అభినందనీయులు. లీలావతి, సరోజ, అరవింద, సీతమ్మ, కావేరీల పాత్రల్ని బాగా మలిచారు. మగవారి పాత్రలు మాత్రం పేలవంగా ఉన్నాయని చెప్పక తప్పదు. ఎర్ర బస్సులలో చిల్లర, లగేజి, చిన్నపిల్లల వయసు నిర్ధారణ, దారిదోపిడీ, బంద్, ఆక్సిడెంట్, బస్ దగ్ధం, టికెట్‌లెస్ ట్రావెల్, డ్రైవర్-కండక్టర్ల సహకారం ఇత్యాది అన్ని విషయాలు బాగానే చర్చించారు. ఉద్యోగాలు బాధ్యతగా చేయాలని, కర్తవ్య నిర్వహణలో ఆనందం, తృప్తి ఉంటుందనే లీల సలహా, కండక్టర్ కైనా, కలెక్టర్‌కైనా మరే ఉద్యోగికైనా కూడా వర్తిస్తుంది. ఆర్థికావసరాలు పెరిగిపోయి, ఎవరికి వారే యమునా తీరే అన్నట్లుగా ఉంటున్న ఈరోజులలో, దిగువ, మధ్యతరగతి వారందరూ, ఒకే కుటుంబంగా కలసిమెలసి ఉంటూ, వారి వారి సమస్యలు పరిష్కరించుకుంటూ జీవిత ప్రయాణం కొనసాగించిన తీరును ప్రశంసించక తప్పదు. కలం స్నేహం తాలూకు ఉత్తరాలలో సారధి తండ్రి వర్ణన మరీ ఎబ్బెట్టుగా ఉంది. అరవింద అత్తగారి ఆరళ్ళు, భర్త చీత్కారాల కారణంగా లీల సలహాతో స్వతంత్ర జీవనం సాగించి తిరిగి అత్తగారితో, భర్తతో కలవడంలో ఓర్పూ, నేర్పు, ఔదార్యం సహజంగానే కనిపిస్తాయి. మనం ఎక్కవలసిన బస్సు జీవితకాలం లేటుకాదు. కండక్టరు ఉద్యోగమైనా స్త్రీలకు తగినదే అని తేల్చడం కొసమెరుపు.

-కంఠంనేని కుటుంబరావు
రావివారిపాలెం- 521125

మగయినా, ఆడయినా ఆర్టీసీ బస్సులో కండక్టరుగా పనిచేయటం ఎంత కష్టమో, కత్తిమీద సామో ఈనవల చదివితే అవగతమవుతుంది. టైముకురావని, లగేజీలు సరిగా వెయ్యనివ్వరని, చిల్లర మింగేస్తారనే నిందలతో బతుకుతున్న ఆర్టీసీ కండక్టర్లు, నిత్యం ఎలాంటి సమస్యలను ఎదుర్కోవాల్సి వస్తుందో, చెయ్యని తప్పులకు కూడా ఎంత కఠిన శిక్షలు భరిస్తూ ఆర్థికంగా మరోదారిలేక, ఎన్ని ఇబ్బందులకు గురికావలసివస్తున్నదో అర్థం కావటమే కాదు- కండక్టర్లపట్ల సానుభూతి కలుగుతుంది. నిత్యం పురుషాహంకారానికి బలైపోతున్న స్త్రీలు కండక్టర్లుగా పనిచేస్తే, ఇంటా బయటా ఎంతగా నలిగిపోతారో కూడా తెలుస్తోంది. లీల, అరవింద పాత్రలు కన్నీరు తెప్పిస్తాయి. మధ్యతరగతి కుటుంబాలలో అన్నాతమ్ముడూ, అక్కాచెల్లెలూ, తల్లీతండ్రీ చివరికి భార్యాభర్తలూ, అందరూ ఎంతగా నటిస్తారో, అవకాశవాదంగా కనిపిస్తారో అరవింద అత్తగారూ భర్తా లీల తల్లిదండ్రులూ, తమ్ముడూ, చెల్లెలపాత్రల ద్వారా తెలియచేసారు. నవ్వు తెప్పించేవిగా ఉన్నా, సారధి పెళ్ళిచూపుల ఘట్టాలు కొంచెం అవాస్తవికంగానూ, తండ్రే లీల పెళ్ళి జరక్కుండా చెయ్యటం వాస్తవానికి దగ్గరగానూ ఉన్నాయి. సీతమ్మ, కస్తూరి పాత్రలు మధ్యతరగతి మాణిక్యాలు. చినిగిన నోట్లతో ప్రయాణీకుల వల్ల ఇక్కట్లు, కేష్ హేండోవరు చేస్తున్నప్పుడు కౌంటర్లో రాజకీయాలు లాంటివి మరికొన్ని సమస్యలు మిగిలిపోయాయి. సరోజా ఆనందరావుల పాత్రలు కాలక్షేపం అయినా హాస్యాన్నందించాయి. వృత్తిపట్ల విశ్వాసం, అంకితభావం ఉండాలన్న సందేశం ఇచ్చిన ప్రయోజనాత్మక నవల 'ప్రయాణం'.

ఆదిత్యపార్వతీపురం-535501.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!

ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.










Pickles
ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసి




**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్, (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482**